

# చెళ్ళపిళ్ల వెంకట రమణ

నవల

# మంచు ముత్యాలు

(కెనడాలో గడిపిన జీవితం నుంచి)

ప్రచురణ :

రమణ సుమనశ్రీ ఫౌండేషన్, హైదరాబాద్.

Rs.150/-
$ 10/-

చెళ్ళపిళ్ల వెంకట రమణ

నవల



మంచు ముత్యాలు

(కెనడాలో గడిపిన జీవితం నుంచి)

ప్రచురణ :

రమణ సుమనశ్రీ ఫౌండేషన్, హైదరాబాద్.

# ముందుమాట

నాగరికత పెరిగేకొద్దీ జీవితాలు సంక్లిష్టమవుతున్నాయి. జీవితంలో ఉన్నత స్థాయి చెందడమంటే మనసులు సంకుచితంగాదుగదా! విచిత్రమేమిటంటే - భౌతికంగా ఉన్నతస్థాయి చెందినా, మానసిక బలహీనతలకి, అమానుష ప్రవర్తనలకీ మనుషులు దూరం కాలేకపోవడమే. కొన్ని కొన్ని సందర్భాలలో సహజమైన ఆవేశాలకి, కావేషాలకి లోనై జీవితాన్ని ఛిన్నాభిన్నం చేసుకుంటారు. ఎదురుతిరిగిన పరిస్థితులకి విపరీతంగా స్పందిస్తారు. వివాహబంధం పట్టుకోల్పోతుందా అనిపిస్తుంది.

కొన్ని కొన్ని జీవితాల్ని చూస్తే-

ఒకర్నొకరు గౌరవించుకోలేని కొన్ని అసహనపు వ్యక్తిత్వాలు, నాగరిక సమాజంలో మనకి కొల్లలుగా కనబడతాయి.

విఫలమయిపోతున్న కుటుంబవ్యవస్థ, తల్లిదండ్రులమధ్య, పిల్లల మధ్య మృగ్యమైపోతున్న ప్రేమానురాగాలు - విచ్చలవిడిగా విడాకులు పుచ్చుకుంటున్న భార్యా భర్తలు - వాళ్ళ మధ్య వెర్రిచూపులు చూస్తూ ఎవరికి చెందాలో తెలీని అమాయకపు పిల్లలు!

ఇదంతా నిజ జీవితాలకి తార్కాణం.

*

ఈ నవలలో 'అట్టావా'(కెనడా కేపిటల్) వాతావరణం, ఇంట్లో పిలుచుకునే పేరు, షాపింగు సెంటర్లు, రెస్టారెంట్లు, పార్కులు, తినుబండారాలు, వీధుల పేర్లు, ప్రకృతి గురించి రాయటం జరిగింది.

*

ఎక్కడకు వెళ్ళినా, ఎక్కడున్నా, వేషభాషలు మారినా, సుఖదుఃఖాలు, కష్టాలు, సంతోషాలు, సెంటిమెంట్లు ఏదో విధంగా మనకు కనపడకపోవు!

ఉన్నచోట కష్టపడిపోతున్నామని, లేనిచోట సుఖం మిస్సయిపోతున్నామని చాలమంది భ్రమలో ఉంటారు. కానీ అదంతా భ్రమే!

# మంచు ముత్యాలు

"జీవితం విచిత్రమైంది. ఆనందంగా గడుస్తున్న జీవితంలో అమాంతం చీకట్లు కమ్ముకుంటాయి. ఏదో తెలీని మహాశక్తి అమానుషంగా ప్రేమికుల్ని విడదీస్తుంది. వెన్నెలని ఆనందించగల్గిన మనిషి చీకటిని మాత్రం భరించలేడు. అమావాస్య చీకటిని చీదరించుకుంటూంటాడు. ఇక జీవితం వ్యర్థమని ఆత్మహత్యకు కూడా సిద్ధమౌతాడు. మంచి కాలం ముందుందని గుండెధైర్యంగల వాళ్ళకి మాత్రమే తెలుసు. అంతదాకా మనిషి ఓపికపట్టాలనే నిత్యసత్యం బాగా వంటబట్టించుకోవాలి"

ఆలోచిస్తూ ఆలోచిస్తూన్న స్టీవ్ కారు వేగంగా నగరరోడ్ల మీద దూసుకుపోతోంది. ఇవాళ ఆఫీసులో పని ఎక్కువగా వుండటంతో బయలుదేరటం కాస్త ఆలస్యమైంది. పింకీ స్కూలు వదిలేసి వుంటారు. వాడు బిక్కమొహం వేసుకుని తనకోసం నిరీక్షిస్తూంటాడు. పరధ్యానంగా ఉన్నా కాస్త జాగ్రత్తగానే డ్రైవ్ చేస్తూ 'యార్క్‌స్ట్రీట్ స్కూలు' ఆవరణలో కారు ఆపాడు స్టీవ్. స్కూలు గ్రౌండ్‌లో పింకీ మరో నలుగురు పిల్లలతో బంతి ఆట ఆడుకుంటున్నాడు. కారు శబ్దానికి ఉలిక్కిపడి పుస్తకాల సంచిని సర్దుకుని, తండ్రి వద్దకు పరుగెట్టుకుంటూ వచ్చాడు. 'హాయ్ హనీ' అంటూ పింకీని గుండెలకి హత్తుకున్నాడు స్టీవ్. 'ఐ యామ్ వెరీ సారీ,

లేటయిపోయింది గదూ' అంటూ తన ఆలస్యానికి కారణాలు చెప్పుకున్నాడు. 'దటీజ్ ఆల్‌రైట్ డాడీ!' అంటూ పింకీ నవ్వేసాడు.

ఆరోజు స్కూలు విశేషాలు పింకీ చెబుతూంటే దీక్షగా వింటూ తిరుగుముఖం పట్టాడు స్టీవ్.

## 2

ఆ వీధిలో అన్ని యిళ్ళకంటే అందమైన యిల్లు ఏదీ? అంటే అది స్టీవ్‌దే అని చెప్పవచ్చును. రెండు మూడు రంగుల కలయికతో రెండంతస్థుల భవనం అతనిది. ముందు భాగం రెండు వైపులా పచ్చని లాన్ మరియు నాలుగువైపులా కలిసేలా ఫెన్సింగు చేయబడిఉంది. ఒకప్రక్క లాన్‌లో మధ్యగా పదహారేళ్ళ పల్లెపడుచు నీళ్ళ బిందె భుజముపై ఎత్తుకున్నట్లు ఉన్న పాలరాతి శిల్పము. లాన్ అంచుల చివరలో వరుసగా ఇంగ్లీషు అక్షరాల ఆకారంలో వేయబడ్డ రంగురంగుల పూలమొక్కలు, నడుస్తున్న దారి చివరలో రెండు పెద్ద పెద్ద మేపుల్ చెట్లు నిలబడిఉన్నాయి. ఆ పూల మొక్కల వరుసలు చూస్తున్న వాళ్ళకి సీతాకోకచిలుకల గుంపులు ఏ పెండ్లి ఊరేగింపుకో తరలి వెడుతున్నట్లు అన్పిస్తుంది. ప్రకృతి దేవత ఆ యింటి ముందు స్థిరనివాసమేర్పరుచుకున్నట్లనిపిస్తుంది.

ఇంటిలోపల మేడపైన ప్రతి ఒక్కరికి వేరువేరుగా పడక గదులు, స్టీవ్‌కి ఆఫీసు పని చేసుకుందుకు ప్రత్యేకమైన గది, పింకీకి, జెర్సీకీ వేరు వేరుగా స్టడీ రూంలు అందంగా అమర్చబడిఉన్నాయి.

మధ్యగా పెద్ద డ్రాయింగు రూం. అందులో అడుగు పెట్టిన వారికి తొందరగా బయటకు రాబుద్ధిపుట్టదు. ఆ హాలులో పసుపు, ఎరుపు రంగులు కలబోసిన కార్పెట్టు పరచబడిఉంది. రెండువైపుల కుషన్‌తో తయారుచేయబడిన సోఫాలు వేయబడిఉన్నాయి. కిటికీలకి గులాబీ రంగు సిల్కుకర్టెన్స్ వేయబడిఉన్నాయి. గోడలకి నాలుగువైపులా పెద్దపెద్ద భంగిమల్లో మోడరన్‌ఆర్ట్ కళాఖండాలు అమర్చబడివున్నాయి. కార్నర్స్‌లో టీపాయ్‌లమీద ఫ్లవర్‌వాజ్‌లో విరిసీవిరియని పసుపుపచ్చ గులాబీలు పెట్టబడిఉన్నాయి. ఆ యింటి అలంకరణనుబట్టి మనుష్యుల అభిరుచులను తెలుసుకోవచ్చును. ఆ యింటిలో చల్లదనంతో పాటు మత్తుగా సువాసనలను వెదజల్లుతూ చల్లని గాలి మనుష్యుల శరీరాలను తాకుతూంటుంది.

## 3

సూర్యుడు తూర్పుకొండమీంచి ప్రయాణంచేసి అలసిన తన శరీరాన్ని పడమట కనుమలలో చేరవేయడానికి ప్రయత్నాలు చేస్తున్నాడు. రోడ్డుపై వాహనాలు పోటీపడి పరుగులు తీస్తున్నాయి. ఆకాశంలో పక్షుల బారులు గుంపులు గుంపులుగా హడావుడి పడుతూ తమ యిళ్ళవైపు పరుగెడుతున్నాయి.

స్టీవ్ కారు ఆ అందమైన భవనం ముందు ఒయ్యారంగా ఆగింది. ఆటోమేటిక్ బటన్ నొక్కగానే గ్యారేజ్ తలుపు తెరుచుకుంది. కారుని అందులో లాక్ చేసి తండ్రీకొడుకులు యింటిలోకి దారితీసారు.

పింకీ తన రూంలోకి వెళ్ళి, పుస్తకాల బ్యాగ్‌ని టేబుల్‌మీద పడేసి, స్కూలు బట్టలు మార్చుకుని వాష్‌రూంలోకి వెళ్ళాడు. ఇంతలో స్టీవ్ కూడ బట్టలు మార్చుకుని కిచెన్‌లోకి వెళ్ళి పాలువేడి చేసి, తాను కాఫీ కలుపుకొని పింకీకి 'హాట్ చాక్‌లేట్' మిల్క్ కలిపి, ఒక ప్లేటులో కూకీస్ ఉంచి వాటిని టేబుల్ మీద పెట్టి, ఆ రోజు న్యూస్ పేపరు చూస్తూ కూర్చున్నాడు. ఇంతలో పింకీ వాష్ రూంలోంచి బయటకు వచ్చి చేతులు టవల్‌తో తుడుచుకుంటూ తండ్రి ప్రక్కన కుర్చీలో కూర్చున్నాడు. స్టీవ్ పాల గ్లాసును పింకీకియిచ్చి తాను కాఫీ సిప్‌చేస్తూ ఆ రోజు జరిగిన వింతలు-విశేషాలు చెబుతున్నాడు. "డాడీ!డాడీ! ఈ రోజు స్కూల్లో ఏం జరిగిందంటే" అని పింకీ చెప్పటం మొదలెట్టాడు. "ఈరోజు మా క్లాసులో ఒక క్రొత్త అబ్బాయి జాయిన్ అయ్యాడు. అతనిని కొంత మంది అల్లరి పిల్లలు ఏడిపిద్దామని ఏం చేసారంటే 'షార్ట్ యింట్రవెల్' టైములో అతను కూర్చునే సీటు మీద బబుల్ గమ్ అంటించారు. తర్వాత ఆ అబ్బాయి మామూలుగా తన సీటులోకి వచ్చి కూర్చున్నాడు. టీచరు పాఠం చెబుతూ చెబుతూ మధ్యలో ఆ అబ్బాయిని ప్రశ్నలు అడిగింది. అతను సమాధానం చెప్పడానికి లేవబోగా బబుల్‌గమ్ అంతా అతని పేంటుకి అంటుకుపోయి తొందరగా లేవలేకపోయాడు. అది చూసి మిగతా పిల్లలంతా గొల్లున నవ్వారు. ఆ అబ్బాయి అవమానంతో ఏడ్చాడు" అని సంతోషంగా పింకీ చెప్పుకుపోతున్నాడు. అప్పుడు స్టీవ్ 'సరదాకైనా కొన్ని పనులు చేయకూడదు పింకీ! సపోజ్ ఆ సంఘటన నీకే జరిగిందనుకో అప్పుడు నీవెలా ఫీలవుతావ్?' అని అడగ్గానే పింకీ చిన్న మొహం చేసుకుని 'అవును డాడీ! నేను అంత దూరం ఆలోచించలేదు. వెరీ సారీ డాడీ!" అన్నాడు.

"పింకీ! ఒక్కొక్కప్పుడు సరదాకి చేసిన పనులవల్ల కొందరు జీవితాంతం బాధపడవలసివస్తుంది."

'ఒకసారి ఏం జరిగిందంటే' అని స్టీవ్ చెప్పసాగాడు.

"నేను చదువుకునే రోజుల్లో మా యింటికి ఒక పెద్దాయన వస్తూండేవారు. ఆయన నన్ను చూసి ఎప్పుడూ వేళాకోళంగా మాట్లాడేవాడు. ఆయన మాటలకి నాకు కోపం వచ్చేది. నేను ఎదురు సమాధానం చెప్పి ఆయనతో మాట్లాడలేక పోయేవాణ్ణి. ఒక రోజున నాకు ఒక మాంచి ఆలోచన వచ్చింది. ఒకరోజు ఆయన డాడీకోసం వచ్చారు. ఆ సమయంలో డాడీ స్నానం చేస్తున్నారు. వెంటనే నా బుర్రలో ఓ మెరుపు మెరిసింది. వెంటనే నేను ఏం చేసానంటే ఆయన డ్రాయింగు రూంలోపలికి వచ్చేలోపులే ఆయన కూర్చునే వాలు కుర్చీ పైకర్ర తీసేసాను. ఆయన అలవాటు ప్రకారం లోపలికు వచ్చి కుర్చీలో గభాల్న కూర్చున్నారు. అంతే...! ఆయన అమ్మో...! అంటూ ఒక అరుపు గట్టిగా అరిచారు. ఇంతలో డాడీ! వాష్ రూంలోంచి బయటకు వచ్చి, కుర్చీలో పడిపోయిన ఆయనను చూసి గబగబా దగ్గరికి వచ్చి ఏం జరిగింది అని ఆయనను అడగ్గా ఆయన బాధగా జరిగింది చెప్పారు. అప్పుడు ఆయన్ని వెంటనే ఆస్పత్రికి తీసుకువెళ్ళారు డాడీ. ఎక్సరే తీసాక ఆయనకి వెన్నెముక విరిగిందని, ఆయన యింక లేచి నడిచే అవకాశం లేదని తెలిసింది. అది విన్న నాకు ఎంతో బాధేసింది. చేసేదేమి లేక పశ్చాత్తాపంతో బాధ పడ్డాను. కాని నావల్లే ఆయనకి ఎలాంటి పరిస్థితి ఏర్పడిందో చూసావా?" అని చెప్పటం ముగించాడు.

పింకీ, అవునన్నట్లు తల పంకిస్తూ-

"డాడీ! ఇప్పటికే చాలా టైం అయ్యింది. హోంవర్క్ చేసుకోవాలి" అని పింకీ తన 'స్టడీ రూం' లోకి వెళ్ళిపోయాడు.

ఇక స్టీవ్ ఆఫీసు నుండి తెచ్చుకున్న ఫైల్సులో నిమగ్నమయ్యాడు.

## 4

రాత్రి ఎనిమిది గంటలకు సప్పరైన తరువాత కొడుకు చేత కాసేపు చదివించి, కాసేపు కథలు, కబుర్లూ చెప్పి, తరువాత పింకీని పడుకోమని వాడికి బెడ్‌సర్ది, గుడ్‌నైట్ చెప్పి తన గదిలోకి వెడుతుండగా 'గుడ్ నైట్ డాడీ!' అని దుప్పటి ముసుగులోంచి ఓరకంటితో చూస్తున్నాడు పింకీ. అది గమనించి స్టీవ్ దగ్గరగా 'గుడ్‌నైట్ హనీ' అని పింకీ నుదుటి మీద ముద్దిచ్చి, సరిగ్గా కప్పి, లైటార్పి తన గదిలోకి వెళ్ళిపోయాడు స్టీవ్.

స్టీవ్ మంచంమీద పడుకున్నాడే గాని అతనికి నిద్ర రావటంలేదు. పింకీ భవిష్యత్ గురించి తను అనేక కలలుగంటున్నాడు. వాణ్ణి బాగా చదివించాలని, తన కంటే పెద్ద చదువులు చదివించాలని, వాడు మంచి పొజిషన్‌లో ఉంటే తాను చూసి సంతోషించాలని వాడిమీద ఎన్నో ఆశలు పెంచుకుంటున్నాడు. అందుకు తగిన కృషి చేస్తున్నాడు. అందుకోసమే తనకి టైము చిక్కినప్పుడల్లా వాడికి మంచి నడవడిక గురించి, చదువుకోవటం గురించి ఇంకా ఎన్నో విషయాల గురించి ఓపిగ్గా వివరించి చెప్పేవాడు. వాడంటే తనకి ప్రాణం. కొడుకు భవిష్యత్ గురించి ఆలోచిస్తున్న స్టీవ్‌కి గోడ గడియారం రెండు గంటలు కొట్టిన శబ్దం వినపడింది. 'మళ్ళీ ప్రొద్దున్నే లేవాలి' అని అనుకుంటూ కళ్ళు మూసుకున్నాడు.

## 5

తూర్పు తెలతెలవారబోతోంది. ఎర్రబడ్డ ముఖంతో సూరీడు బాహ్యప్రపంచంలోకి అడుగులు వేస్తున్నాడు. ఆకుల మీద, పూబాలలమీద ఇంకా మత్తుగా నిద్రపోతున్న హిమ బిందువులు ప్రభాత సూర్యుని పసిడి కిరణాల స్పర్శకు చలిస్తున్నాయి. ఎవరి పనుల్లో వాళ్ళు హడావుడిగా పరుగులు తీస్తున్నారు. ఏడు గంటలకల్లా స్టీవ్, పింకీ బ్రేక్ ఫాస్ట్ ముగించుకుని లంచ్‌బాక్స్‌లు తీసుకుని బయలుదేరారు.

స్టీవ్ పింకీని స్కూలు వద్ద దింపి, టాటా చెప్పి వాడు స్కూలు లోపలికి వెళ్ళే వరకు అక్కడుండి, ఆ తర్వాత ఆఫీసుకి చేరుకున్నాడు.

టైము మధ్యాహ్నం పన్నెండుగంటలు. స్కూలు ఆవరణ అంతా పిల్లల ఆటలతోను, కేరింతలతోను గందరగోళంగా ఉంది. కిండర్ గార్డన్ పిల్లల్ని టీచర్లు త్రాడు-బంతి ఆట ఆడిస్తున్నారు. మధ్య మధ్యలో పిల్లలకి కబుర్లు చెబుతూ, వాళ్ళు కబుర్లాడుకుంటున్నారు. కొంత మంది ఉయ్యాలలూగుతున్నారు. ఆ ఉయ్యాలలు వివిధ జంతువుల ఆకారాలలో అమర్చబడి వున్నాయి. కొంచెం పెద్ద పిల్లలు ఫుట్‌బాల్, బ్యాట్‌మెంటన్ ఆడుకొంటున్నారు. పింకీ మాత్రం ఒక చెట్టు క్రింద కూర్చుని లైబ్రరీ నుండి తెచ్చుకున్న పుస్తకం చదువుకుంటున్నాడు. వాడికి అస్తమానూ పుస్తకాలు చదవటం అలవాటు. వీలున్నప్పుడల్లా ఏదో ఒక పుస్తకం పట్టుకొని కూర్చుంటాడు. ఆ చిన్ని బుర్రలోఎన్నెన్నో ఆలోచనలున్నాయి. బాగా చదువుకోవాలని, మంచి మార్కులు తెచ్చుకోవాలని ఆరాటపడుతూంటాడు. అందుకు తండ్రి కూడా ప్రోత్సాహమిస్తుంటాడు. తండ్రికి ప్రొగ్రెస్ రికార్డ్ చూపించినప్పుడు తండ్రీకొడుకుల కళ్ళల్లో ఆనందం చూడాలి. గర్వంగా తనని దగ్గరకు తీసుకొంటున్న తండ్రంటే తనకి చెప్పలేని యిష్టం.

"పింకీ!పింకీ!'' అంటూ ఎవరో పిలవటంతో ఎవరా అని పుస్తకంలోంచి ముఖం ప్రక్కకు త్రిప్పి చూసాడు పింకీ. దూరం నుంచి నడచి వస్తున్న జెర్సీ కనబడింది. మౌనంగా తల పుస్తకంలోకి దించేసుకున్నాడు పింకీ. ఆమె దగ్గరగా వచ్చి ప్రక్కన కూర్చుంటూ 'హాయ్ హనీ! ఎలా ఉన్నావ్! రెండు రోజుల బట్టి వద్దామనుకుంటున్నా ఆఫీసుపన్లవల్ల రాలేకపోయాను'' అంటూ సంజాయిషీగా చెప్పింది జెర్సీ.

"...........''

పింకీ నుండి ఎటువంటి సమాధానం రాకపోయేసరికి చిరునవ్వునవ్వుతూ-

'హనీ! కోపం వచ్చిందా? ఏదీ! ఇటుచూడూ...! నీకోసం ఏం తెచ్చానో' అంటూ తన హేండ్‌బ్యాగ్ తెరచి మిల్క్‌చాక్‌లెట్సు, స్పాంజ్‌తో చేసిన చిన్నబొమ్మలు రెండు తీసి పింకీకిచ్చింది జెర్సీ.

పింకీ వాటిని మౌనంగా తీసుకున్నాడు.

ఆమె ఏవేవో కబుర్లు చెబుతూనే ఉంది. పింకీ మౌనంగా వింటూనే ఉన్నాడు. వాడి కళ్ళలో ఎటువంటి బాధా కనపడనీయటంలేదు.

ఇంతలో బెల్ మ్రోగటంతో జెర్సీయిచ్చిన వస్తువుల్ని, తన పుస్తకాల్ని తీసుకుని ఒక్కసారి జెర్సీ వంక చూసి, క్లాసురూం వంక మౌనంగా నడిచాడు.

పింకీ కళ్ళలోని భావాన్ని గ్రహించిన దానిలా తన కళ్ళజోడు సర్దుకొని ఏదో నిశ్చయానికొచ్చిన దానిలా కారు వద్దకు వెళ్ళింది జెర్సీ.

## 6

వారంలో అయిదు రోజులు పని చేసి అలసిన శరీరాలకి వీకెండ్ (శని, ఆదివారాలు) వస్తే పెద్ద రిలీఫ్‌గా ఉంటుంది. ప్రొద్దున్నే ఆదరాబాదరాగా హడావుడిగా లేవక్కరలేదు. ఉరుకుల పరుగులతో ఆఫీసులకి, స్కూల్సుకి బస్సు ప్రయాణాలు చేయక్కరలేదు. హాయిగా రెండురోజులు ఎంజాయ్ చెయ్యొచ్చు. అవసరమైన పనులు చేసుకోవచ్చు.

అలవాటు ప్రకారం ఆ రోజు పింకీ తన రూంలో ఏదో బొమ్మ గీసుకుంటున్నాడు. లాన్‌లో గడ్డి ఎక్కువగా పెరగటంతో స్టీవ్ గార్డెన్ పని చేస్తున్నాడు. చేస్తూ చేస్తున్న స్టీవ్ మెదడులో ఓ మెరుపు మెరవటంతో ఆ పనిని ఆపి, చేతులు వాష్ చేసుకుని పింకీ రూంలోకి అడుగుపెట్టాడు.

పింకీ సీరియస్‌గా తన పనిచేసుకుంటున్నాడు. చుట్టు ప్రక్కల చీమ చిటుక్కుమన్నా శబ్దం కూడా లేదు. స్టీవ్ నెమ్మదిగా పింకీ వెనకగా వచ్చి వాడు వేస్తున్న చిత్రాన్ని తేరిపార చూసాడు.

ఒక్కసారి ఆ తండ్రి హృదయం ఆనందంతో పొంగిపోయింది. పింకీలో యింతటి కళాత్మక దృష్టి ఉందని తనకింతవరకూ తెలీదు. చిన్నవాడైనా వాడి బుల్లి బుర్రలో ఎంతటి భావనా ప్రపంచముంది.

ఉయ్యాలలోని పసి బాలునికి తండ్రి పాలసీసాతో ప్రేమగా పాలు పడుతున్న దృశ్యం అది. ఎంత చక్కగా వేశాడు అని అనుకుంటూ నెమ్మదిగా అక్కడ నుండి బయటకు వచ్చేసాడు. వాడిని డిస్ట్రబ్ చేయటం యిష్టం లేక లాన్‌లో కుర్చీ వేసుకుని కూర్చున్నాడు. స్టీవ్ ఆలోచనలు గతంలోకి పరుగులు తీసాయి.

*

స్టీవ్‌కి ఊహ తెలిసినప్పటినుండి తండ్రి ప్రేమ ఎటువంటిదో తెలియదు. తల్లి మేరీ కష్టపడి పెంచింది. తండ్రి జాన్ యింట్లో ఉన్నాకూడా తనని దూరంగానే ఉంచేవాడు. ఎప్పుడూ ప్రేమగా దగ్గరకి పిలిచేవాడు కాదు. ఎప్పుడూ కోపంగా, చిరాగ్గా చూచేవాడు. అప్పుడప్పుడు తన విషయంలో తల్లిదండ్రులిద్దరూ పోట్లాడుకునేవారు. మేరీ చాటుగా ఏడ్వటం, బాధపడటంలాంటి సంఘటనలు స్టీవ్ కంటపడుతూండేవి. తన బాధని ఎప్పుడూ బయటపడనిచ్చేది కాదు తల్లి. తనని బాగా చదువుకోమని మాత్రం చెప్పేది. సాయంకాలాలు తనతో షికారుకి తీసుకువెళ్ళేది. రాత్రి పడుక్కోబోయే ముందు చిన్న చిన్న కథలు చెప్పేది. తనకి 'హేంబర్గర్' యిష్టమని వీకెండ్‌లో రెస్టారెంట్‌కి తీసుకువెళ్ళి యిప్పించేది. కథలు వింటూ అమ్మ ఒడిలో నిద్రపోతూంటే బ్రతుకులో యింకేమీ అక్కరలేదనిపించేది. ఆమెని చూస్తూంటే దేవతను చూసినట్లే ఉండేది స్టీవ్‌కి.

తల్లి ప్రేమతో తండ్రి అనురాగం కూడ ఉంటే బాగుండునని అనిపించేది ఆ పసిహృదయానికి. కాని అది అందని ఫలం అని తెలుసు స్టీవ్‌కి. తను కావాలని దగ్గరకు వెళ్ళినా కారణం లేకుండా చీదరించుకునేవాడు తండ్రి. తల్లి సరదాకైనా కోపగించుకునేది గాదు. అందుకే అప్పుడప్పుడు స్టీవ్‌కి తండ్రంటే తగనికోపం వచ్చేది. తనతో ప్రేమగా మాట్లాడడు. పలకరించడు. కలసి ఎక్కడికీ తీసుకెళ్ళడు. బయటవాళ్ళకన్నా అధ్వాన్నంగా ప్రవర్తించేవాడు.

స్టీవ్‌కి పద్దెనిమిది సంవత్సరాలు వచ్చేటప్పటికి తల్లి కారుయాక్సిడెంట్‌లో మరణించింది. తన కళ్ళ ముందు ఎప్పుడూ నవ్వుతూ కన్పించే ఆ దేవత క్రూరంగా

తన్ను వదిలేసి వెళ్ళిపోయింది. ఇంక తనకి దిక్కెవరు? తండ్రి ఉన్నాలేనట్లే కనపడేవాడు. తన గురించి ఏమీ పట్టించుకునేవాడు కాదు. ఇంటికి సరిగ్గా వచ్చేవాడు కాదు. తరువాత తరువాత పూర్తిగా రావటం మానేసాడు. కొద్ది రోజుల తరువాత తెలిసిన విషయం ఏమిటంటే అతను మరొక ఆమెను వివాహం చేసుకున్నట్లు తెలిసింది.

తల్లి లేనిలోటును మరవలేక స్టీవ్ ఒంటరిగా యింట్లోనే గడిపేవాడు. స్కూలుకి వెళ్లటం మానేశాడు. ఇంట్లోనే తల్లి ఫొటో దగ్గర కూర్చుని బాధపడేవాడు. ఎప్పుడు తల్లే గుర్తుకువచ్చేది. తల్లి ప్రాణంతో యింట్లో తిరుగుతున్నట్లు అన్పించేది. తనని ప్రేమగా 'స్టీవ్' అని పిలుస్తున్నట్లు, నిద్రరాకపోతే తనవద్ద కూర్చుని కబుర్లు చెబుతున్నట్లు భ్రమించేవాడు. ఇంటి బయటకు వచ్చేవాడు కాదు.

ఒకరోజు కాలింగ్ బెల్ చప్పుడయింది. స్టీవ్ చాలాసేపటివరకు తలుపు తీయలేదు. బెల్ అలా మ్రోగుతూనే ఉంది. ఇంకవిసుగుపుట్టి లేచి వెళ్ళి తలుపు తీసాడు. ఎదురుగా జెర్సీ నిలబడి ఉంది. ఆమె చొరవగా లోపలకు వచ్చి, ఫ్రిజ్‌లోంచి ఒక గ్లాసుడు ఆరెంజ్ జ్యూస్ తీసుకుని త్రాగి సోఫాలో కూలబడింది.

స్టీవ్ మాత్రం ఏమీ మాట్లాడకుండా మౌనంగా కుర్చీలో కూర్చున్నాడు.

'స్టీవ్' అని నెమ్మదిగా పిలిచింది జెర్సీ.

'హూ!' అని మూల్గుతున్నట్లు సమాధానం వచ్చింది.

"ఏమిటి? స్కూలుకి రావటం మానేసావు. ఈ విధంగా ఎన్నాళ్ళు యింట్లో కూర్చుంటావు? ఈ సంవత్సరం చదువు పూర్తి చేసుకుంటే ఎక్కడైనా ఉద్యోగం చూసుకోవచ్చు" అని తన ధోరణిలో చెప్పుకుపోతోంది.

"........."

"నేను చెప్పింది ఏమన్నా వినబడుతోందా? గద్దించి అడిగింది జెర్సీ.

"ఊ!"

"ఆఆ! ఊఊ! అంటే ఎలా? మనసువిప్పి నాతో మాట్లాడు. రేపట్నుంచి నువ్వు నాతో స్కూలుకి రావాలి. నేను వెళ్ళేముందు యిక్కడకు వచ్చి నిన్ను తీసుకెళతాను" అంది.

"నాకు చదవాలనిలేదు."

"ఏం? ఎందుకని?"

"మమ్మీని మరచిపోవటం చాలా కష్టంగా ఉంది"

"ఏది ఒకసారి నాకేసి యిలా చూడు! మేరీ శరీరమైతే లేదు గాని ఆమె ఆత్మమాత్రం నీ చుట్టూరానే తిరుగుతూ ఉంటుంది. నీవు చదువు మానేసి యిలా కూర్చుంటే ఆమె యిష్టపడుతుందా? నువ్వు బాగా చదువుకోవాలని, మంచి ఉద్యోగం చెయ్యాలని ఆమె ఎప్పుడూ మా మమ్మీతో చెబుతూండేది. ఆమెకోరిక నెరవేరాలంటే నువ్వు రేపట్నుంచి స్కూలుకి వస్తున్నావ్! అంతే! ఆ! అన్నట్టు మరిచాను. నీకోసం ఏంతెచ్చానో చూడు" అంటూ తనుతెచ్చిన కాగితం కవరు తీసి అందులో ఉన్నవి ఒక ప్లేటులో పెట్టి స్టీవ్‌ముందు ఉంచింది.

వాటిని చూసి నిర్లక్ష్యంగా మొహం పక్కకి తిప్పుకున్నాడు.

"స్టీవ్ నువ్వు భోజనం చేసి ఎన్నాళ్ళయిందీ తెలుసా? ముందు యివి తిను. నీకు యిష్టమని ఆంటీ చెబుతూండేది?" అని అంది జెర్సీ.

స్టీవ్ కళ్ళలో ఆకస్మాత్తుగా నీళ్ళు తిరిగాయి.

అది చూసి 'ఏమిటి స్టీవ్! నేను కూడా నిన్ను బాధ పెట్టానా!' అని బేలగా అతని ముఖంలోకి చూసింది.

"లేదు జెర్సీ! మమ్మికూడా ఇలాగే ఆఫీసునుండి వచ్చేటప్పుడు తీసుకువచ్చేది. అయినా జెర్సీ! నేనంటే నీకెందుకింత అభిమానం?" అని చిన్న పిల్లాడిలా ఆమె ఒడిలో తల పెట్టుకుని బాధపడటం మొదలెట్టాడు. "వాటీజ్ దిస్ స్టీవ్? మరీ చిన్న పిల్లాడిలా! ఏదీ యిటు చూడు" అంటూ జెర్సీ అతని కన్నీళ్ళు తుడిచి, "ముందు యివి తిను" అని హేమ్ బర్గర్ ఒకటి తీసి అతనికిచ్చింది. స్టీవ్ నెమ్మదిగా తిని, మంచి నీళ్ళు త్రాగాడు. మరి నేనింక వెడతాను. వచ్చి చాలా సేపయింది. రేపు ఉదయం రెడీగా ఉండు. లేనిపోని ఆలోచనలు పెట్టుకుని అనవసరంగా బాధపడకు. నువ్వు మళ్ళీ బాధపడటం మొదలెడితే ఆంటీ మనసు బాధ పడుతుంది" అని చెప్పి "ఒకే! బై" అని జెర్సీ వెళ్ళిపోయింది.

## 7

"డాడీ! డాడీ! అని పింకీ రెండుసార్లు పిలిచాక ఈ లోకంలోకి వచ్చాడు స్టీవ్.

"ఏంటి పింకీ?"

పింకీ ఒక ట్రేలో రెండు యాపిల్ జ్యూస్ గ్లాసులు, ఫ్రెంచి వైన్ పట్టుకొని వచ్చి లాన్‌లో ఉన్న టేబుల్ మీద పెట్టి మరొక కుర్చీ తెచ్చుకుని తండ్రి పక్కన కూర్చున్నాడు.

ట్రేలో ఉన్నవాటిని చూస్తూ 'అరె! నాతో చెబితే నేను చేద్దునుగదా!' అని

పింకీతో అన్నాడు స్టీవ్.

"నేను నేర్చుకున్నట్టు ఉంటుంది. మీకు చేసిపెట్టినట్టు ఉంటుంది గదా డాడీ! అందుకనే స్వయంగా చేసాను"

"థ్యాంక్యూ హనీ!"

ఇద్దరూ తింటూ కబుర్లు చెప్పుకుంటున్నారు. పింకీ తింటూ తింటూ మధ్యలో ఒక్కసారి "డాడీ! డాడీ! అటు చూడండి డాడీ! ఆ చెట్టుమీద గూటిలోన పిల్లలకు పెద్ద పక్షి తన నోటితో ఆహారం ఎలా పెడుతోందో! వాటి బుల్లి బుల్లి నోళ్ళు ఎంత ఎర్రగా ఉన్నాయో!" అని ఆ దృశ్యాన్ని తండ్రికి చూపించాడు పింకీ. అవును హనీ! ప్రతి ప్రాణీ అంతే గదా! వాటికి రెక్కలు వచ్చేదాకా కష్టపడి పిల్లల్ని పెంచుతుంది" అని స్టీవ్ అన్నాడు.

"అయితే డాడీ! మరి పిల్లలకి తల్లి పక్షి పెడుతుందా? లేక తండ్రి పక్షి పెడుతుందా?" అని అమాయకంగా అడిగాడు పింకీ.

"రెండు పక్షులు కష్టపడి సంపాదిస్తాయి. రెండూ పెడతాయి"

మరి అయితే డాడీ చిన్నప్పుడు మమ్మీ కూడా నాకు అలాగే తినిపించేదా? ఆ ప్రశ్నతో స్టీవ్ ఒక్కసారి ఉలిక్కిపడి, "ఆ ఎందుకు తినిపించలేదూ తినిపించేది" అని అన్నాడు స్టీవ్.

"డాడీ! నాకు గుర్తులేదు. నాకు ఊహతెలిసినప్పట్నుంచి నా పనులన్ని మీరే గదా చేస్తున్నారు."

"మరి మమ్మీకి ఆఫీసు వర్క్ ఎక్కువ గదా! సరే గానీ బాగా వేడిగా ఉంది బయట. లోపలికి వెళ్దామా?"

ఓకే డాడీ! అంటూ పింకీ తండ్రితో పాటు లోపలికి వెళ్ళాడు శరీరం కొంచెం బడలికగా ఉండటంతో స్టీవ్ కాసేపు బెడ్‌మీద పడుకుని కళ్ళు మూసుకున్నాడు. అతని మనస్సు మళ్ళీ గతం లోకి పరుగులు తీసింది.

## 8

కాలగమనంలో మూడు నాలుగు కేలండర్లు చిరిగి పోయాయి. స్టీవ్, జెర్సీలు కలిసి స్కూలుకి వెళ్ళటం, పిక్‌నిక్‌లకి వెళ్ళటం, గేమ్‌లో పాల్గొనటం, ఎక్కడికి వెళ్ళినా కలసి వెళ్లటం చేసేవారు. వారి స్నేహం పెరిగి ప్రేమగా మారింది. ఒకళ్ళంటే ఒకళ్ళు యిష్టపడ్డారు. స్టీవ్ చదువు పూర్తి చేసుకున్నాడు. ఉద్యోగ ప్రయత్నాలు చేస్తున్నాడు.

ఒకరోజు సాయంత్రం సంతోషంగా జెర్సీ వాళ్ళింటికి బయలుదేరాడు స్టీవ్. వాళ్ళింటికెళ్ళటం చాల అరుదు. ఎందుకంటే తరచు జెర్సీ రావటమో, లేక వాళ్ళ పేరెంట్స్ రావటమో జరుగుతుంది. వీలున్నప్పుడు జెర్సీవాళ్ళ ఫాదరు, మదరు రాత్రి పూట వచ్చి తనకి మంచి, చెడు చెప్పేవారు. తను ఈనాడు ధైర్యంగా బయటనల్గురిలో తిరగగల్గుతున్నాడు అంటే దానికి జెర్సీ ప్రోత్సాహం ఎంతైనా ఉంది. తనకి జీవితాన్ని గురించి ఎన్నో విషయాలు నేర్పుగా, ఓర్పుగా చెప్పేది. జెర్సీ గురించి ఆలోచిస్తూ వాళ్ళింటి కాలింగ్ బెల్ బజర్ నొక్కాడు. జెర్సీ వాళ్ల ఫాదర్ తలుపు తీసి, ఎదురుగా ఉన్న స్టీవ్‌ని చూసి ఆశ్చర్యంతోను, ఆనందంతోను లోపలికి ఆహ్వానించాడు. సోఫాలో కూర్చుంటూ స్టీవ్‌ని కూడా కూర్చోమని చెప్పాడు థామస్.

"హౌ ఆర్ యూ స్టీవ్?"

"ఫైన్ అంకుల్"

"ఏమిటి విశేషాలు?" అంటూ జెర్సీ తండ్రి థామస్ అడిగాడు.

"ఒక గుడ్ న్యూస్ అంకుల్"

"ఏమిటది?" అంటూ ఆత్రంగా అడిగాడు థామస్.

"నాకు ఒక ప్రయివేట్ కంపెనీలో జాబ్ వచ్చింది"

"ఆ! ఆ! హార్టీ కంగ్రాచ్యులేషన్స్ స్టీవ్. ఇంత మంచి వార్తని అంత నెమ్మదిగా చెబుతావేంటి?" అంటూ లోపలికెళ్ళి ఒక ప్లేటులో స్వీట్ పెట్టి తీసుకువచ్చి స్టీవ్‌కిచ్చాడు. "జెర్సీ, వాళ్ళ మదర్ కలసి స్విమ్మింగ్‌కి వెళ్ళారు. బహుశా ఈపాటికి వస్తూఉండాలి. ఈ వార్త వాళ్ళు వింటే చాల సంతోషిస్తారు. అందులోను జెర్సీకి నువ్వంటే చాలా యిష్టం. ఎప్పుడూ నీ గురించే చెబుతూంటుంది. ఎలాగూ ఉద్యోగం కూడ వచ్చింది. అది సరేగాని స్టీవ్ నిన్ను ఓ విషయం అడుగుతాను. ఏమీ అనుకోకు. దానికి సమాధానం వెంటనే చెప్పక్కర లేదు. ఆలోచించుకుని చెప్పు" అంటూండగానే కారు హారన్ వినబడింది.

బయటనుండి జెర్సీ, విక్టోరియాలు లోపలకు వచ్చారు. అనుకోకుండా హాలులో స్టీవ్‌ని చూడగానే మెరిసేకళ్ళతో హలో! స్టీవ్ ఎప్పుడొచ్చావ్?" అంటూ థామస్ ప్రక్కన కూర్చుని కబుర్లు చెప్పసాగింది. స్టీవ్‌కి జాబ్ వచ్చిందన్న విషయం విని పట్టరాని ఆనందంతో గబుక్కున లేచి స్టీవ్‌ని ముద్దెట్టేసుకుంది. ఈ హఠాత్ పరిణామానికి స్టీవ్ స్టన్ అయిపోయాడు. అంతలో ఏదో గుర్తువచ్చిన దానిలా గబుక్కున అతన్ని వదిలేసి "సారీ స్టీవ్!" అంటూ లోపలికి పరుగెత్తింది. స్టీవ్

బుర్రవంచుకుని ఏదో ఆలోచిస్తున్నాడు. "దాని తత్వమే అంత. సంతోషం వచ్చినా, కోపం వచ్చినా పట్టలేం. ఏది తోస్తే అది చేసేస్తుంది. అంతా హడావిడి మనిషి" అని అంటూ స్టీవ్ కేసి చూసాడు థామస్.

"..........''

"స్టీవ్ ఏమిటి ఆలోచిస్తున్నావ్?''

"ఏం లేదు అంకుల్. మరి నేను యింటికెడతాను''

"అదేంటి? అప్పుడే వెడతావా? భలే వాడివే! భోజనం చేసి వెడుదువుగాని. అయినా నీతో చాల విషయాలు మాట్లాడాలి కూర్చో'' అని అన్నాడు థామస్.

"ఓకే అంకుల్'' అని వినయంగా అన్నాడు స్టీవ్.

"అది సరేగాని స్టీవ్! జెర్సీ గురించి నీ అభిప్రాయం ఏమిటి?''

"అదేంటి అంకుల్! నన్ను అడుగుతున్నారు?''

"మరి నిన్నుగాక ఎవర్ని అడగమంటావ్?'' అంటూ చిన్నగా నవ్వారు.

"జెర్సీకేం అంకుల్. మంచి అమ్మాయి. అందం, తెలివి తేటలున్నాయి. ఇంకా చదువు విషయంలో నాకంటే ఎక్కువే అని చెప్పవచ్చును.''

"అంతే అంటావా? మరి ఆమె అంటే నీకు యిష్టం లేదా?''

"అందేంటి అంకుల్! ఆమె అంటే నాకు చాల గౌరవం, యిష్టం. ఈరోజు నేను ఇలా ఉన్నానంటే దానికి జెర్సీయే కారణం''

స్టీవ్ ఒక్కసారి షాక్ తిన్నాడు.

"అంకుల్'' అని ఒక్కసారి థామస్‌ని కౌగిలించుకున్నాడు.

"ఏం? నీకు యిష్టం లేదా?''

"అది కాదు అంకుల్! నాకు జెర్సీతో పెళ్ళి?

నేను అందుకు అర్హుణ్ణి కాదేమో అంకుల్. నాకేముంది అంకుల్. ముందు వెనుక పెద్దవాళ్ళెవరూ లేరు. నేను ఎవరి అభిమానానికి నోచుకోలేదు. నా అన్న వాళ్ళెవరూ లేరు. ఒంటరి వాణ్ణి'' అని బాధగా మాట్లాడుతుంటే థామస్ కదలిపోయాడు. కళ్ళు చెమ్మగిల్లాయి.

"ఆపు స్టీవ్! ఆపు. నేను అవన్నీ విన్లేను. నేను అడిగింది జెర్సీని వివాహం చేసుకోవటం నాకు యిష్టమా? కాదా? దీనికి సమాధానం ఎస్ లేక నో అంతే. నీ గురించి మిగతా విషయాలు నాకు తెలుసులే'' అని నవ్వుతూ అన్నాడు థామస్.

"ఎస్ అంకుల్. జెర్సీ అంటే నాకు ప్రేమ, యిష్టం. జెర్సీని మమ్మి ఎప్పుడు మెచ్చుకుంటూండేది. అందం, తెలివి తేటలు, చలాకీతనం ఉన్న అమ్మాయి అని'' అని తల్లిని గుర్తుకు తెచ్చుకుంటూ అన్నాడు స్టీవ్.

"అయితే యింకేం! మీ మమ్మి కూడా మనస్ఫూర్తిగా మీ యిద్దర్నీ దీవిస్తారు. నీ చదువు అయిపోయింది. ఉద్యోగం కూడ వచ్చింది. ఈ సంవత్సరంతో జెర్సీ చదువుకూడ పూర్తయిపోతుంది. అయితే మంచి రోజు చూసి వివాహానికి తేదీ నిర్ణయిస్తాను. దానికి కావల్సిన కార్యక్రమాలు ప్రారంభిస్తాను'' అని అన్నాడు థామస్.

"మీ ఋణాన్ని ఎలా తీర్చుకోగల్ను అంకుల్? తుఫానులో కొట్టుకుపోతున్న నాకు మీరు చల్లని నీడ యిచ్చారు''

"ఇదిగో మళ్ళీ ప్రారంభించావ్! ఇంకేం మాట్లాడకు'' అంటూ నవ్వేసాడు థామస్.

ఆ నవ్వులో స్టీవ్ నవ్వు కూడా కలసిపోయింది.

"ఇంతలో తుఫానులా డాడీ! స్టీవ్! సప్పర్ రెడీ! కమాన్..... కమాన్'' అంటూ జెర్సీ పిలవటంతో థామస్, స్టీవ్‌లు డైనింగ్ హాల్లోకి వెళ్ళడానికి లేచారు.

## 9

స్టీవ్ ఉద్యోగంలో చేరాడు. ఉదయం 8గంటలకు యింటినుండి బయలుదేరితే మళ్ళీ సాయంత్రం ఆరుగంటలకి యింటికి చేరటం. ఉద్యోగం ఏదైనా పనిమాత్రం ఎక్కువగానే ఉంటోంది. అందులోను క్రొత్తగా చేరటం వలన ప్రతి విషయం చాల జాగ్రత్తగా చూసుకోవలసివస్తోంది. రోజులు గడచిపోతున్నాయి. ఈ మధ్య జెర్సీని కలుసుకోటానికి కూడ టైం చిక్కటం లేదు. కోపం వచ్చిందంటే పిడుగులా మీద పడుతుంది. వీలుచూసుకుని వెళ్ళాలి అని గెడ్డంగీసుకుంటూ అనుకుంటున్నాడు స్టీవ్.

ఇంతలో ఉరుములా ఊడిపడింది జెర్సీ. తుఫానులా లోపలకు దూసుకువచ్చింది. స్టీవ్ అంటూ ఒక్క అరుపు అరచింది. ఆ అరుపుకి అదిరిపడి చేతిలో ఉన్న రేజరు స్లిప్పై బుగ్గమీద తెగింది.

"ఏమిటి హడావుడి? ఏమైంది? అని స్టీవ్ అడిగాడు జెర్సీని.

"ఇంకా ఏం కావాలి? నువ్వు చేస్తున్న పనేమిటి?'' అని కోపంగా అంది జెర్సీ.

"నేనా! ఏం చేస్తున్నాను? గెడ్డం గీసుకుంటున్నాను. నీ శివ తాండవానికి అదిరిపడి రేజరు గెడ్డాన్ని ముద్దెట్టుకుంది. ఇదిగో చూడు'' అని దగ్గరగా వచ్చి చూపించబోయాడు.

"నా దగ్గర నీ నాటకాలు కట్టిపెట్టు......" అని కోపంగా చూసింది.

"ఏమైందిరోజు నీకు? నాటకాలు ఏమిటి? అందులోనూ నీ దగ్గరా?" అంటూ అమాయకంగా అడిగాడు.

"నేను అడిగిందానికి సరిగ్గా డొంక తిరుగుడుగా గాకుండా సరియైన సమాధానం చెప్పు. తిక్క తిక్కగా వాగావంటే నేనసలే మంచిదాన్ని కాదు" అంది జెర్సీ.

"ఎస్ మేడమ్" అంటూ బుద్దిగా తలవంచుకుని నిలబడ్డాడు.

"అదిగో! అదే వద్దన్నాను. అది సరేగాని నువ్వు పెళ్ళి చేసుకుంటున్నావుట. అవునా?"

"యస్"

"ఎవర్ని?"

"ఓ అందమైన సుకుమారిని"

"ఆ అమ్మాయంటే నీకిష్టమేనా?"

"ఆ! ఆ!!"

"మరి పెళ్ళెప్పుడు?"

"ఇంకా డేట్ ఫిక్స్ కాలేదు."

"మరి నేనంటే నీకిష్టం లేదా?"

"నువ్వంటే చాలా... చాలా... యిష్టం"

"మరి నాతో ఎందుకు చనువుగా తిరిగావ్?"

"నువ్వంటే ప్రేమ కాబట్టి. డోనట్స్ వంటి నీ బుగ్గలంటే మరీ మరీ యిష్టం కాబట్టి. ఇంకా చెప్పాలంటే...!" అని నసుగుతున్నాడు స్టీవ్.

"ఛీ! నీకసలు సిగ్గులేదా?"

"నీ దగ్గర అసల్లేదు"

"అదిగో ఆ వెధవ సమాధానాలే వద్దంటున్నాను"

"మరా అసలు సంగతేమిటో చెప్పకుండా మరేమిటీ పరీక్షాపత్రంలోని ప్రశ్నల్లా ఒకదాని వెంట ఒకటి అడుగుతుంటే ఏం చేయనుమరి?"

"ఇంతకీ ఆ అమ్మాయి ఎక్కడ?" గద్దించింది జెర్సీ.

"తరువాత నువ్వే చూస్తావ్ గదా! తొందరెందుకు?" అని చిరునవ్వు నవ్వాడు స్టీవ్.

మనసు లావాలా ఉడుకుతున్నా పైకి మనోనిబ్బరంతో,

"మరి నీకు, నాకూ మధ్య ఎటువంటి సంబంధం లేదా?" అని అంది.

"ఎందుకు లేదూ! మనది విడదీయరాని బంధం. ఒక నాటితో పోయేదికాదు. ఇంకా... ఇంకా పెనవేసుకుపోతుందే కాని..." చిన్నగా నవ్వుతూ ఆమె పక్కకి వచ్చి కూర్చున్నాడు.

"ఛీ! నువ్వసలు మనిషివికాదు. నయవంచకుడివి. నమ్మించి మోసం చేసావ్. నిన్ను ప్రేమించటం నాదే తప్పు. మరింక ఈ జన్మలో నీ ముఖం చూడను. గుడ్‌బై" అంటూ విసురుగా సోఫాలోంచి లేచి బయటకు నడవబోయింది.

ఇంతలో స్టీవ్ సడన్‌గా ఆమె చేయి పట్టుకుని కుర్చీలో కూర్చోపెడుతూ "అయిందా? నీ లెక్చర్? ఇంకా ఏమైనా మిగిలిందా? ఇంతకీ అసలు విషయం తెలుసుకోకుండా వెళ్ళిపోతే ఎలా? నేను చెప్పేది కూడా స్థిమితంగా విను. అసలు నాకు పెళ్ళని, నేను పెళ్ళిచేసుకుంటున్నానని ఎవరు చెప్పారు?"

"డాడీ, మమ్మీతో చెబుతుంటే విన్నాను"

"మరి ఆ అమ్మాయి ఎవరో చెప్పలేదా?"

"నాకు సరిగ్గా వినపడలేదు"

"మంచిదే అయ్యింది"

"ఏం?"

"లేకపోతే నీ ఉగ్రావతారం చూసే భాగ్యం నాకు కలిగేది కాదేమో"

"ఇవన్నీ నాకింక అనవసరం. ఇక నుండి నీ దారి నీదే. నా దారి నాదే. నేను అనవసరంగా భ్రమపడ్డాను. చాల పెద్దపొరపాటు చేసాను. నీ స్నేహం చేసినందుకు మంచి గుణపాఠం నేర్పావ్" కోపంతో ఊగిపోతూ అంది.

"మరి అమ్మాయి ఫొటో చూస్తావా?"

"ఆ అవసరం లేదులే"

"తప్పదు. నీవు చూసివెళ్ళాలి" అంటూ ఒక్క క్షణం అని లోపలకు వెళ్ళి ఒక ఫొటో తెచ్చి ఆమెచేతికిచ్చాడు. ఇష్టం లేకపోయినా ఫొటోని అందుకుని చూసింది జెర్సీ. తన కళ్ళను తానే నమ్మలేకపోయింది.

"స్టీవ్" అంటూ ఆనందంలో అతన్ని కౌగిలించుకుంది. స్టీవ్ ఆమెని దగ్గరగా తీసుకుంటూ "సగం సగం విని, సంగతి తెలుసుకోకుండా ఎంత హంగామా చేసావో చూడు. నాకు జీవితంలో నువ్వు తప్ప ఎవరున్నారు చెప్పు. ఎన్ని జన్మలెత్తినా నువ్వే నాకు కావాలి. ఐ లవ్ యూ జెర్సీ! ఐ లవ్ యూ!" అంటూ ఆమె పెదవుల్ని ముద్దెట్టుకున్నాడు.

ఇంతకీ ఆ ఫొటోలో ఉన్నది జెర్సీయే. ఆమె ఆనందానికి అవధులు లేవు.

"ఐ లవ్ యూ టూ మచ్" అంటూ మరింత దగ్గరగా వొదిగిపోయింది జెర్సీ.

*

స్టీవ్, జెర్సీల వివాహం ఘనంగా జరిగింది. వివాహానంతరం వాళ్ళిద్దరూ పారిస్, న్యూయార్క్, లండన్ ప్రదేశాలకి హానిమూన్ వెళ్లటానికి థామస్ ఏర్పాట్లు చేసాడు. వాళ్ల జీవితం ఎప్పుడు నందనవనంలాగా, కళకళలాడుతూ హేపీగా గడపాలని మనస్ఫూర్తిగా దీవించారు థామస్ దంపతులు. స్టీవ్, జెర్సీలు ఆనందంగా హానిమూన్‌కి బయలుదేరారు...

*

"డాడీ! డాడీ! ఏమిటి యింత సేపు నిద్రపోయారు? లేవండి. టీ తీసుకుందురుగాని!" అంటూ పింకీ లేపటంతో స్టీవ్ ఉలిక్కిపడి లేచి "అవునా! ఏదో కళ్ళు మూసుకుంటే నిద్రపట్టేసింది. టైం చాలా అయినట్లుంది" అని లేస్తూ మొహంకడుక్కోడానికి వాష్ రూంలోకి వెళ్ళాడు.

తరువాత టీ తీసుకుని స్టీవ్, పింకీలు వాకింగ్‌కని పార్క్ దాకా వెళ్లడానికి బయలుదేరారు.

*

కేలండర్‌లో మార్చి నెల చింపివేయబడింది. స్నో పడటం నెమ్మది నెమ్మదిగా తగ్గింది. గడ్డ కట్టించే చలిలో వణికిపోయే జనాలు నెమ్మదిగా బయట తిరుగుతున్నారు. సూర్యుడు మంచు దుప్పట్లను దులుపుకుని మెల్లిగా నగర వీధులలోకి తొంగిచూస్తున్నాడు. ఆ గోరువెచ్చని చూపులకి గడ్డకట్టిన మంచు దిబ్బలు కొంచెం కొంచెం కరగి రోడ్లమీద పారుతున్నాయి.

పార్కులో పిల్లలు పరుగులు పెడుతూ ఆటలు ఆడుతున్నారు. కాసేపు స్టీవ్, పింకీ కలసి ఫ్రిజ్‌బీ ఆడారు. "డాడీ కాసేపు సైకిలింగ్ చేసి వస్తాను" అంటూ కూడా తెచ్చిన సైకిల్ని త్రొక్కుతూ వెళ్ళాడు. వాడు వచ్చేంతవరకు స్టీవ్ తను తెచ్చుకున్న లైబ్రరీ పుస్తకాన్ని చదవడానికి బ్యాగ్‌లోంచి తీసి బెంచిమీద కూర్చున్నాడు.

పుస్తకం చేతిలోనే ఉంది. కాని స్టీవ్ కళ్ళు చుట్టుప్రక్కల పరిసరాల్ని తిలకిస్తున్నాయి. అప్పుడప్పుడే చిగురిస్తున్న చెట్టుపై రెండు నల్ల ఉడుతలు దోబూచులాడుకుంటున్నాయి. మరొక కొమ్మపై ఉన్న ఓ జంట పావురాలు ఆ దృశ్యాన్ని వింతగా చూస్తున్నాయి. మరికొన్ని తెల్లని పక్షులు 'ఆ! మనకెందుకులే' అన్నట్లు ఎగిరిపోతున్నాయి. అక్కడక్కడ పల్చగా ప్రేమ జంటలు ఒకరిలో ఒకరు ఒదిగిపోతూ, చేయి చేయి నడుంమీద వేసుకుని కబుర్లు చెప్పుకుంటున్నారు.

పార్కుని ఆనుకుని ఉన్న 'రిడూ కాలువ' మౌనంగా పారుతోంది. ఆ సెలయేటి గలగలలో నల్లబాతుల గుంపులు పరుగుపందాలు వేసుకుంటున్నాయి. 'గెలుపు ఓటముల సంగతి మేము చెబుతాం' అంటూ ఆ కాలువలో రాజ్యం చేస్తున్న హంస ద్వయం ముందుకు వచ్చింది.

ఈ దృశ్యాలన్నిటిని తిలకిస్తున్న స్టీవ్‌కి తాను, జెర్సీ కలసి ఆనందంగా, తీయగా గడిపిన రోజులు సినిమా రీళ్ళలా కళ్ళ ముందు గిర్రున తిరిగాయి. తాము హనీమూన్ నుండి తిరిగి వచ్చిన తరువాత జెర్సీకూడ ఉద్యోగంలో జాయిన్ అయ్యింది. ఇద్దరూ కలసి వెళ్ళేవారు. కాని వచ్చేటప్పుడు మాత్రం టైము వేరుగా ఉండేది. అప్పుడప్పుడు తను రావటం బాగా ఆలస్యమయ్యేది. అయినా చిరునవ్వుతో స్టీవ్‌ని ఆహ్వానించేది.

కొద్ది రోజులకి వాళ్ళ అనురాగానికి ఫలితంగా ఓ ప్రియపుష్పం పుట్టింది. ప్రేమగా పింకీ అని పేరుపెట్టారు. వాడంటే వాళ్ళిద్దరి ప్రాణం. వాడు పెరిగి పెద్దవాడవుతున్నాడు. స్టీవ్‌కి ఆఫీసు బాధ్యతలు ఎక్కువయ్యాయి. ఎంత ఆలస్యంగా వచ్చినా తల్లీ కొడుకులిద్దరూ నిద్రపోకుండా ఎదురుచూచేవారు. పోనీ పింకీని పడుక్కోమని చెప్పినా వినేవాడుకాదు. స్టీవ్ వచ్చేదాకా ఉండి, వచ్చిన తరువాత అతనితో కొద్దిసేపు కబుర్లు చెప్పి అప్పుడు పడుక్కొనేవాడు. ఒకసారి అందరూ కలసి పిక్‌నిక్‌కి వెళ్ళారు. స్టీవ్‌కి 'ఫిష్షింగ్' అంటే చాల యిష్టం. అందుకని దానికి కావలసిన పరికరాలు వెంటతెచ్చుకునేవాడు.

"డాడీ! డాడీ! నాకు కూడ ఫిష్షింగ్ నేర్పండీ! నేను నేర్చుకుని మీకంటే ఎక్కువ చేపల్ని పడతాను" అని అనేవాడు.

"ఓకే హనీ! కమాన్" అంటూ వాణ్ణి దగ్గరకు తీసుకునేవాడు.

జెర్సీకి ఫిషింగంటే మహాబోరు.

"సరిపోయింది! ఇద్దరూ బయలుదేరితే నేను వేరేదారి చూసుకోవలసిందే" అని నవ్వుతూ అనేది.

"ఆ నవ్వు చాలు తన జీవితానికి" అని అనుకునేవాడు స్టీవ్.

"డాడీ! ఇంక బయలుదేరుదామా! ఆకలేస్తోంది'' అని పింకీ వచ్చి కుదపటంతో తన జ్ఞాపకాల రీలు మధ్యలోనే ఆగిపోయింది. ఇద్దరూ పార్కులోంచి బయలుదేరి యింటి దారిపట్టారు.

ఇంటికి వచ్చాడన్న మాటే గాని స్టీవ్ యింకా ఆలోచిస్తూనే ఉన్నాడు. పరధ్యానంగానే భోజనం ముగించి పింకీని పడుక్కోబెట్టాడు.

జరిగిన సంగతులన్ని కళ్ళ ముందు గిర్రున తిరుగుతున్నాయి. ఆరోజు తనకింకా బాగా గుర్తుంది...!

## 10

స్టీవ్ తన ఆఫీసులో రూంలో కూర్చుని సీరియస్‌గా తన పని చేసుకుంటున్నాడు. ఫోన్ మ్రోగటంతో తన పనికి బ్రేక్‌వేసి ఫోన్ ఎత్తాడు.

"హలో!''

"హలో స్టీవ్!''

"గుడ్ మార్నింగ్ సర్''

"నేను పర్సనల్‌గా నీతో మాట్లాడాలి. మధ్యాహ్నం మూడింటికి నా రూంకి రా. ముఖ్యమైన విషయాలు మాట్లాడాలి'' అని చెప్పి అవతలి కంఠం ఫోన్ పెట్టేసింది.

'చాలా అర్జంటు పని ఉంటేనేగాని అక్కడనుండి ఫోన్ రాదు. అయినా మధ్యాహ్నం వెడతాను గదా! అప్పుడే తెలుస్తుంది' అని అనుకొని తన పనిలో నిమగ్నమయ్యాడు.

మధ్యాహ్నం కాఫీ తీసుకొని మూడవుతుండగా ఆఫీసరు రూంలోకి అడుగుపెట్టాడు స్టీవ్. ఆఫీసరు చిరునవ్వు నవ్వుతూ కుర్చీ చూపించి కూర్చోమని సైగచేసి టేబుల్‌పై ఉన్న ఏవో ఫైల్సు తీసి స్టీవ్ ముందు పెట్టాడు.

అర్థం కానట్టు స్టీవ్ ఆఫీసరు మొహం వంక చూసాడు.

"రెండు నెలల్లో నీవు చేయవలసిన పని చాలా వుంది. ఇవిగో ఈ మూడు ప్రాజెక్టుల వర్క్ పూర్తవాలి. వీటికి సంబంధించిన మేటరు తయారుచేసి పై వాళ్ళకి పంపాలి. మనకి పోటీగా మరొక సంస్థ ఏర్పడింది. మన పని చురుగ్గా సాగితేనే గాని లాభం లేదు'' అని ఆఫీసరు స్టీవ్‌తో చెప్పాడు.

స్టీవ్ కొంచెం తడబడుతూ "ప్రయత్నిస్తాను సార్'' అని అన్నాడు.

"ప్రయత్నించటం కాదు. ముందు పని పూర్తి కావాలి'' అని గర్జించినట్లు మాట్లాడాడు ఆఫీసరు.

"అలాగే సార్!'' అని ఆ ఫైల్సు తీసుకుని బయటపడ్డాడు. మనస్సంతా అల్లకల్లోలంగా ఉంది. ఇంత వర్క్ రెండు నెలల్లో పూర్తవాలంటే గాబరాగానే ఉంది. రాత్రి పగలు కష్టపడి పని చేస్తేనేగాని పని పూర్తవదు. లేకపోతే ఉద్యోగం ఏమవుతోందో! ఇక్కడ ఉద్యోగాలే ఇంత. ఎప్పుడు తీసేస్తారో తెలీదు. ఎప్పుడు కొత్త వాళ్ళని తీసుకుంటారో తెలీదు. మొన్నటికి మొన్న పాపం టైపిస్ట్ రూబీని మర్యాదగా పిలిచి ఈ నెల తరువాత నువ్వింక పనిలోకి రానక్కరలేదని చెప్పారట. ఆమె కళ్ళ నీళ్ళు పెట్టుకుంటూ తన బాధని చెప్పుకుంది. ఎనిమిది సంవత్సరాలబట్టి పనిచేస్తోంది. ఏదైనా ఎన్ని సంవత్సరాలబట్టి చేస్తున్నా, ఎంత అనుభవం ఉన్నా ఆడైనా, మగైనా వాళ్ళకేమిటి? ఇష్టం ఉంటే ఉంచుతారు. లేకపోతే గుడ్ బై చెబుతారు. అంతా బిజినెస్ మోరల్స్...! ఇవన్నీ తలుచుకుంటూ తాను క్రొత్తగా చేయవలసిన వర్క్‌ని ఆరోజునుండి చేయటం మొదలెట్టాడు స్టీవ్.

## 11

పింకీని రెండు రోజులబట్టి జ్వరంగా ఉంది. జెర్సీ సెలవు పెట్టడానికి ప్రయత్నిస్తే శెలవు దొరకలేదు. ఆమె కొలీగ్ లీవ్‌లో ఉండటం వలన ఆ అవకాశం లేకపోయింది.

స్టీవ్ సంగతి వేరే చెప్పక్కరలేదు. అయినా మధ్య మధ్యలో పింకీని చూసి వెడుతున్నాడు. ప్రస్తుతం అతని దృష్టంతా పనిమీద ఉంది. అనుకున్న టైం ప్రకారం పనిపూర్తి చేసి ఆఫీసరు మొహాన పడేస్తేనేగాని అతనికి మనశ్శాంతి ఉండదు.

పింకీకి జ్వరం తగ్గేవరకు భార్యాభర్తలిద్దరూ అవస్థలు పడుతున్నారు.

ఒక వారం రోజుల తరువాత పింకీకి జ్వరం తగ్గుముఖం పట్టింది. పని వత్తిడి వల్ల స్టీవ్ ఎక్కువ టైం ఆఫీసులోనే ఉంటున్నాడు. ఒకరోజు టైం రాత్రి పదకొండు గంటలైంది.

"పింకీ! యింకా నిద్రపోలేదా!'' అని జెర్సీ అడిగింది.

"లేదు మమ్మీ''

"పడుక్కో హనీ! అసలే నీరసంగా ఉన్నావ్. తొందరగా పడుకుంటే మంచిది'' అని బుజ్జగింపుగా అంది.

"డాడీ యింకా రాలేదు కదా! వచ్చాక కథ చెబితేనే గాని నాకు నిద్ర పట్టదు.''

"నేను చెబుతాను. పడుకో'' అంటూ ప్రక్కన కూర్చుంది జెర్సీ.

"నో మమ్మీ! డాడీ వచ్చాక...''

"అన్నిటికీ డాడీ! డాడీ! అంటే ఎలా? డాడీ బిజీగా ఉన్నారు. వచ్చాక నేను మళ్ళీ నిన్ను లేపుతాగా"

"ఊ! ఊ! డాడీ వచ్చిందాకా నిద్ర పోను" అంటూ మరాం చేసాడు.

అసలే చికాగ్గా ఉన్న జెర్సీ వాణ్ణి గట్టిగా గద్దించింది. దాంతో పింకీ ఏడవటం మొదలెట్టాడు. వాడు ఏడుపు మొదలెడితే ఒక పట్టాన ఆగడు. ఇంతలో తలుపు తీసుకుని స్టీవ్ లోపలకు వచ్చాడు. పింకీ రూంలోంచి ఏడుపు వినపడటంతో పైకి వెళ్ళాడు. పింకీ దగ్గరకు వెళ్ళి 'ఎందుకు ఏడుస్తున్నావ్?' అని కంగారుగా అడిగాడు స్టీవ్.

దానికి సమాధానంగా జెర్సీ జరిగిన విషయం చెప్పింది.

స్టీవ్ కొడుకుని దగ్గరకు తీసుకుని "లేదులే హనీ! ఏడవకు. నేను నీకు కథ చెబుతాగా" అంటూ వాణ్ణి మంచం మీద పడుకోబెట్టి కథ చెప్పసాగాడు. కథ వింటూనే నిద్రపోయాడు పింకీ.

తరువాత లేచి బట్టలు మార్చుకుని డిన్నర్ చేసి తన ఆఫీసు రూంలోకి వెళ్ళిపోయాడు స్టీవ్. అది చూసి జెర్సీచిన్నగా నిట్టూర్పు విడిచింది.

*

ఈ మధ్య స్టీవ్ తన పనులు చేసుకోవటం కూడా నిర్లక్ష్యం చేస్తున్నాడు. ఆ రోజు జెర్సీ రావటం కొంచెం లేటయ్యింది. ఇల్లంతా చీకటిగా ఉంది. పింకీ యింకా బయటే ఆడుతున్నాడు. ఇంట్లో వస్తువులు చిందరవందరగా ఉన్నాయి. పింకీ లంచ్ బాక్స్, పుస్తకాల బ్యాగ్ సోఫాలో పడేసిఉన్నాయి. బ్రేక్‌ఫాస్ట్ తిన్న ప్లేటులు, టీ కప్పులు సింక్‌లో నిండుగా ఉన్నాయి. సాధారణంగా స్టీవ్, జెర్సీలు ఉద్యోగాలకి వెడతారు. కాబట్టి వారు ఏరోజు ఎవరు ఏ పనులు చేయాలో ముందుగానే నిర్ణయించుకుంటారు. అందువల్ల ఎవరు ఎక్కువ శ్రమ పడవలసిన అవసరం ఉండేది కాదు. కాని ఈ మధ్య స్టీవ్ యింటి పనుల విషయంలో అశ్రద్ధ కనబరుస్తున్నాడు. ఇదంతా చూస్తున్న జెర్సీకి కోపం వచ్చింది. 'ఇంక అటో, యిటో తేల్చుకోవాలి' అని నిర్ణయించుకుంది.

*

ఆరోజు శనివారం కదా అని తొందర లేనందువల్ల ఆలస్యంగా లేచింది జెర్సీ. పింకీ యింకా నిద్ర లేవలేదు. స్టీవ్ ఈ మధ్య ఎక్కువగా ఆఫీసు రూంలోనే కాలం గడిపేస్తున్నాడు. ఎప్పుడో వచ్చి కాసేపు నిద్రపోతాడు.

జెర్సీ ముఖం వాష్ చేసుకుని రెండు కప్పుల కాఫీ కలిపి స్టీవ్ రూంలోకి వెళ్ళి ప్రక్కనున్న మరొక కుర్చీలో కూర్చుంటూ-

"గుడ్ మార్నింగ్ డియర్" అంది.

"వెరీ గుడ్‌మార్నింగ్ హనీ" అన్నాడు స్టీవ్ ప్రసన్నంగా.

"ఎన్ని గంటలకు లేచావ్ స్టీవ్"

"వర్క్ ఉంది కదా అని నాల్గింటికి లేచాను"

"పనిలేనిదెప్పుడు?"

"అదేంటివాళ అలా మాట్లాడుతున్నావ్"

"మరిలేకపోతే ఏమిటి? ఉద్యోగం నువ్వొక్కడివే చేస్తున్నట్లు ఇరవై నాలుగ్గంటలూ ఫైల్సు ముందేసుకుని కూర్చుంటావ్? తిండి తిప్పలు కూడ అక్కరలేకుండగా అలా పనిచేస్తే ఆరోగ్యం సంగతేమిటి? అని కోపంగాను, బాధగాను అంది.

"అన్నీ తెలిసిన దానివి. నువ్వే యిలా మాట్లాడితే ఎలా చెప్పు. అనుకున్న పనికాస్తా అయిపోతే తరువాత మనం హాయిగా ఉండొచ్చు. నువ్వు ఉద్యోగం చేస్తున్న దానివే కదా! అందులోని సాదకబాదకాలు నీకు తెలుసు. అయినా ఏమిటివాళ ప్రొద్దున్నే మొదలైంది ఫైర్" అంటూ నవ్వేసాడు స్టీవ్.

"ఈ రోజు మనం ఎక్కడికన్నా కలిసి వెళ్ళి ఎంజాయ్ చేద్దాం. చాల రోజులైంది సరదాగా బయటకు వెళ్ళి. నాకు బోర్‌గా ఉంది" అంది జెర్సీ.

"ఈ రోజా! అమ్మ బాబోయ్! కొన్నాళ్ళ దాకా నాకు ప్రతి క్షణం చాల విలువైంది. వేస్ట్ చేయటం నా వల్ల కాదు!"

"అయితే నాతో రావటం యిష్టం లేదన్న మాట"

"ఇష్టం లేకకాదు జెర్సీ! నువ్వు చూస్తూనే వున్నావ్ కదా! తెలుసుండి అడగటం బాగుందా?"

"ఏది ఏమైనా సరే అసలు ఈ మధ్య నీ ప్రవర్తన ఏమీ బాగుండటం లేదు. ఎప్పుడు వస్తున్నావో, ఎప్పుడు వెడుతున్నావో, ఎప్పుడు పడుకుంటావో తెలీటం లేదు. ఇంటి విషయాలు అసలే పట్టించుకోవటం మానేసావు. నేనున్న సంగతి కూడా మర్చి పోతున్నావ్. ఈ విధంగానే ఉంటే కొన్నాళ్ళకు నీకూ నాకూ అంతే సంగతులు" అని కోపంగా గది బయటకు వెళ్ళిపోయింది జెర్సీ.

స్టీవ్ ఆమె ప్రవర్తనకి ఒక్క క్షణం నిశ్చేష్టుడయ్యాడు.

## 13

స్టీవ్ ఆఫీసులో ఆరోజు వచ్చిన ఉత్తరాలు చూసుకుంటున్నాడు. తనకి రెండు మూడు ఉత్తరాలు వచ్చాయి. ఒకటి జెర్సీ వాళ్ళ ఫాదర్ నుండి, రెండోది ఆఫీసుకి సంబంధించినది. మూడోది ఎవరు వ్రాసారా? అని చించి చదువుతున్నాడు.

డియర్ స్టీవ్,

ఎవరాయింత ధైర్యంగా పిలుస్తున్నారని ఆశ్చర్యపోతున్నావ్ కదూ! నేనే నాకు ఆటవాలో జాబ్ వచ్చింది. చాల రోజులబట్టి నువ్వు రమ్మంటున్నా పనుల వత్తిడివల్ల రాలేకపోయాను. ఉద్యోగరిత్యా మనం మళ్ళీ కలుసుకునే అవకాశం వచ్చినందుకు సంతోషంగా ఉంది. నీ మేరేజ్‌కి కూడా రాలేదు. నీవు కోపంతో వ్రాసిన ఉత్తరాలు చదువుతుంటే నాకు బలే నవ్వు వస్తుంది. ఆ కోపం అంతా అక్కడికి వచ్చాక తీర్చుకుందువుగానిలే! నిజంగా జీవితంలో 'స్నేహం' కంటే మధురమైనది, మరపురానిది మరొకటి లేదురా! మన హైస్కూలు రోజులు ఎంత మధురంగా గడచిపోయాయో గదా! ఇలా పాత జ్ఞాపకాలన్నీ వ్రాస్తూ పోతే నే వ్రాసేది ఉత్తరం కాదు, నవలైపోతుంది.

నేను వచ్చేవారం వర్క్‌లో జాయిన్ అవ్వాలి. నేను శుక్రవారం సాయంత్రం 'టొరొంటో' నుండి బయలుదేరుతున్నాను. అక్కడికి వచ్చేటప్పటికి రాత్రి పదిన్నర దాటుతుంది. నీవు మర్చిపోకుండా ఎయిర్‌పోర్ట్‌కి రావాలి. కోపంతో నువ్వు రాకపోవటం మానేసావనుకో; నా పని డిస్కో డాన్సే. మర్చిపోవుకదూ! ఇల్లు దొరికిందాకా నీ యింట్లోనే ఉంటాను. నీ శ్రీమతి మెడబట్టి తోసేస్తే రోడ్డేగతి. వచ్చాక మిగతా విషయాలు మాట్లాడుకుందాం. మర్చి పోకుండా ఎయిర్‌పోర్ట్‌కి వస్తావు కదూ!

మరి ఉంటాను. బై.

ఇట్లు,
స్కాట్.

ఆ ఉత్తరం చదివిన స్టీవ్‌కి చాల సంతోషం కల్గింది. స్కాట్ ఉత్తరం ఎడారిలో ఒయాసిస్సులా అన్పించింది. ఎన్నాళ్ళయిందో వాణ్ణి చూసి. చాలా సరదా అయిన మనసున్న మంచి మనిషి. ఎప్పుడు నవ్వుతూ, నవ్విస్తూండేవాడు. ఎంత కోపంలో ఉన్న వాడైనా వాడి మాటలకి నవ్వితీరాల్సిందే. ఏ ఫంక్షన్‌కైనా వాడు ఉండాలి. వాణ్ణి అమ్మాయిలు బాగా లైక్ చేసేవారు. కాని వాడికి లేడీస్ అంటే తగని గౌరవం. ఆలోచిస్తూపోతే చాలా గుర్తుకు వస్తాయి అని అనుకుంటూ ఉత్తరాన్ని మడిచి పేంటు జేబులో పెట్టుకున్నాడు.

*

సాయంత్రం రోజూ కంటే తొందరగా వచ్చాడు. అతను వచ్చేటప్పటికి జెర్సీ యింట్లోనే ఉంది.

"హాయ్! ఏమిటివాళ విశేషం?'' అంటూ నవ్వింది జెర్సీ.

"ఏం? అలా అడుగుతున్నావ్?''

"ఆ!ఆ! ఈ రోజు ఆకాశం ప్రశాంతంగానే ఉంది. ఉరుములు, మెరుపులు లేవు. అనుకోకుండా వానపడలేదు. సూర్యుడు తూర్పునే ఉదయించాడు. కాని మావారు యిన్నాళ్ళ తరువాత యింత తొందరగా యింటికి రావటం జరిగిందంటే ఏదో విశేషం ఉండాలి. లేకపోతే రాత్రికి ఫ్రీజింగ్ రైన్ పడాలి'' కొంటెగా వెక్కిరిస్తూ అందిజెర్సీ.

ఆ!ఆ! అలాగా అంటూ ఆమెని దగ్గరగా తీసుకుంటూ రాత్రికి ఫ్రీజింగ్ రైన్ కావాలా నీకు అంటూ ఆమె లేత గులాబీ బుగ్గల మీద ముద్దుల ముద్రలు వేసాడు.

"ఊ!ఊ! అది సరేగాని ఇంతకీ అసలు సంగతేమిటి?''

"నీకు తెలియదా?''

"హుఁ! హుఁ!''

"నిజంగా?''

"నిజంగా!''

"ఈరోజు ఏమిటో నీకు గుర్తులేదా?''

"నవంబరు పధ్నాలుగు''

"అవునా''

"అవును''

"మరి ఈ రోజు నీకు గుర్తులేదంటే నిజంగా నమ్మమంటావా?''

"ఆ గుర్తొచ్చింది''

"అమ్మయ్య! ఇప్పటికైనా గుర్తొచ్చినందుకు సంతోషం. ఇప్పటికి వెలిగింది ట్యూబ్‌లైట్''

"ఏది? ఎక్కడ?'' అంటూ చుట్టూ చూసింది జెర్సీ.

"ఇదిగో యిక్కడ'' అంటూ ఆమె పెదవుల్ని ఘుంబించాడు స్టీవ్.

"ఏయ్! ఏమిటి అల్లరి" అంటూ జెర్రీ చిరుకోపం ప్రదర్శించింది.

"మైడియర్ స్వీట్ హనీ! ఈ రోజు మన ప్రోగ్రామ్ ఏమిటో తెలుసా? నైట్ 'మూన్‌లైట్' డిన్నర్. తరువాత అందులోనే మ్యూజిక్ ప్రోగ్రాముంది. ప్రఖ్యాత గాయత్రి 'మిస్ క్రిష్టల్' పాటలు పాడుతుంది. ఆ తరువాత వచ్చాక...! మరి తొందరగా తయారైతే బయలుదేరుదాం అంటూ తొందర చేసాడు స్టీవ్.

"ఆ! మరిచాను. పింక్ కలర్ డ్రస్ వేసుకో! వినపడిందా!" అంటూ తనూ డ్రస్ మార్చుకుందుకు లోపలికి వెళ్ళాడు.

ఓ పది నిమిషాల తరువాత స్టీవ్ కళ్ళ ముందు ఓ పసిడివెన్నెల మెరుపు తీగ మెరిసింది. రెప్పవాల్చకుండా ఆమెనే చూస్తున్నాడు స్టీవ్.

"ఓహ్! వ్వాటే బ్యూటీ! ఇప్పుడు మనం బయటకు వెళ్ళాలంటావా" అంటూ ఆమెని అడిగాడు.

"అదేంటి నువ్వేగా అంతా ప్రపోజ్ చేసావ్. మళ్ళీ అంతట్లోకి మైండ్ ఛేంజైపోయిందా? ఇంతట్లోకి ఏమైంది?" అంటూ అమాయకంగా మొహం పెట్టింది.

"హనీ! ఇంత అందంతో బయటకు వెడితే ఏం బాగుంటుంది. హాయిగా యింట్లోనే ఎంజాయ్ చేద్దాం" అంటూ ఓర కంటితో ఆమెని గమనిస్తూన్నాడు.

"ఓకే స్టీవ్! మరి నా బాయ్ ఫ్రెండ్‌తో కాసేపు బయటకు వెళ్ళొస్తాను" అంటూ అతని జేబులోంచి కారు తాళాలు తీసుకోబోయింది.

"ఏయ్, నాటీ గర్ల్" అంటూ స్టీవ్ ఆమె చేయి పట్టుకున్నాడు. ఇద్దరూ పింకీని కూడ తీసుకొని బయటకు వచ్చారు. చాల రోజుల తరువాత వాళ్ళెంతో హాపీగా గడిపారు.

## 14

ఆ రోజు మామూలుగానే స్టీవ్ లేచి తన పనులు ముగించుకుని ఆఫీసునుండి యింటికి బయలుదేరాడు. "తను వర్క్‌లో కాలంకంటే ముందుగా పరుగెట్టాల్సి వస్తోంది. ఏమిటో జీవితం. ఉరుకులు, పరుగులు! బ్రతకడానికి ఎంతలా తాపత్రయపడాలో! భార్య, పిల్లలు, యిల్లు సంసారం. ఈ సాగరంలో కొట్టుకుపోతూంటారు మనుష్యులు. బంధాలు, బాంధవ్యాలు, అనురాగాలూ, ఆత్మీయతలు. ఇవిలేకపోతే మనిషి బ్రతుకు వ్యర్థం. ఊపిరి పీల్చుకుందుకు కూడా టైం ఉండటంలేదు. ఏదో ఉద్యోగం పుణ్యమా అంటూ నాలుగు వేళ్ళూ నోట్లోకి వెడుతున్నాయి. అది కూడా లేకపోతే ఎన్ని అవస్థలు పడాలో!" అని అనుకుంటూ ఎడతెగని ఆలోచనలతో డ్రైవ్ చేస్తున్నాడు. ఇంతలో సడన్‌గా ఏదో గుర్తుకు వచ్చి నాలిక్కరుచుకున్నాడు. వెంటనే వాచీ వంక ఓ చూపు చూసి 'థాంక్‌గాడ్!' అనుకుంటూ తన కారుని ఎయిర్‌పోర్ట్ వైపు మళ్ళించాడు.

*

అందమైన ఎయిర్‌పోర్ట్‌లో నాజూగ్గా విమానం దిగింది. ఎవరిమటుకు వాళ్ళు తమ తమ బ్యాగ్‌లతో 'ఎయిర్ హోస్టెస్' నమస్కారాల్ని దాటుకుంటూ బయటకు వస్తున్నారు. రాత్రి సమయం కాబట్టి రంగురంగుల దీపాలతో క్రొత్త పెళ్ళి కూతురిలా తళ తళలాడుతూ మెరిసిపోతోంది. ఆ సమయంలో ఒక వ్యక్తి ఉలెన్ సూటులో ఠీవిగా నడచుకుంటూ బయటకు వచ్చాడు. ఎవరికోసమో అతని కళ్ళు వెదుకుతున్నాయి. ఎదురుచూస్తున్న వ్యక్తి ఇంకా రాలేదు. కాఫీ త్రాగి వద్దామని రెస్టారెంట్ వైపు నడిచాడు. కాఫీ త్రాగి, సిగరెట్టు వెలిగించి ఒకసారి వాచీ వైపు చూసుకుని "హు! ఇక లాభం లేదు. ఏదో దారి చూసుకోవాలి" అనుకుంటూ సూట్‌కేసు చేత్తో పట్టుకొని గేటు బయటకు నడిచాడు ఆ వ్యక్తి. ఇంతలో వెనక నుండి 'స్కాట్' అంటూ ఎవరో పిలిచారు. ఎవరా అని వెనక్కి తిరిగి చూసాడు. ఆయ్ స్టీవ్, ఆయ్ స్కాట్ అంటూ ఒకరినొకరు ఆనందంతో కౌగిలించుకున్నారు.

"ఐయాయ్ సారీరా! బాగా లేటయి పోయింది. ఆఫీసుపనిలో పడి టైము సంగతి మరిచిపోయాను. సడన్‌గా గుర్తొచ్చింది. సరేపద. ఇంటికి వెళ్ళాక తీరికగా కబుర్లు చెప్పుకుందాం" అంటూ ఇద్దరూ కలసి ఇంటికి కారులో బయలుదేరారు.

"స్టీవ్ మనం కలుసుకుని ఎన్నాళ్ళయిందో! అప్పటికీ యిప్పటికీ నీలో చాలా మార్పు వచ్చిందిరా. బాగా లావు అయ్యావ్. గెడ్డం, మీసాలతో బాగా అందంగా ఉన్నావ్" అంటూ పిచ్చాపాటి మాట్లాడుతూ కారు అద్దాలలోంచి నగర అందాలు చూస్తున్నాడు స్కాట్.

కారు అందమైన బిల్డింగు ముందు ఆగింది. ఇద్దరూ కారు దిగి తలుపు తీసుకుని యింటిలోకి అడుగుపెట్టారు. హాలులో మాటలు వినపడటంతో బెడ్‌రూంలోంచి జెర్రీ మేడ దిగి క్రిందకు వచ్చింది. స్కాట్ ఒక్కసారిగా జెర్రీని చూసి "ఎవర్రా యీ క్రిష్టల్ బ్యూటీ" అని అంటుండగా 'హుష్!' అని చేత్తో పొడుస్తూ

"ఈమె నా లవర్ అండ్ వైఫ్" అంటూ జెర్రీని పరిచయం చేస్తుండగా-

"ఇతను మీ బెస్ట్ ఫ్రెండ్ స్కాట్ అవునా?' అంటూ స్టీవ్ వంక చూసింది జెర్రీ.

"అరె! నీకు ఎలా తెలిసింది. ఎప్పుడైనా, ఎక్కడైనా చూసావా?'' ఆశ్చర్యంతో అన్నాడు స్టీవ్.

"ఆ! ఉదయం మీ జేబులో చూశాను'' అంది జెర్సీ.

"వ్వాట్? నన్ను మీరు వాడి జేబులో చూడటం ఏమిటి?'' అని స్కాట్ ఆశ్యర్యంతో జెర్సీ వంక చూసాడు.

"ఉదయం స్టీవ్ మాసిన బట్టలు తీస్తుంటే జేబులో ఒక ఉత్తరం దొరికింది. అందులోని విషయాన్ని బట్టి చూస్తే అది మీరేనని గెస్ చేసాను''.

"భలే చమత్కారంగా మాట్లాడుతారే మీరు'' అని నవ్వేశాడు స్కాట్.

"మీరు మాట్టాడుకుంటూ ఉండండి. మరి నేను అతిథి సత్కారాలుమొదలు పెట్టాలి గదా!'' అంటూ లోపలకు వెళ్ళింది జెర్సీ.

"నువ్వు చాలా అదృష్టవంతుడివిరా!''

"ఏం? ఎందుకని?''

"చక్కని ఇల్లు, అందమైన భార్య... ఇంకా ఏదో అనబోతుండగా

"ఓ లిటిల్ రాస్కెల్'' అంటూ 'పింకీ' అని పిలిచాడు స్టీవ్. లోపలనుండి ఓ చిచ్చరపిడుగు వచ్చి "గుడ్ ఈవినింగ్ అంకుల్'' అంటూ ముద్దుగా పలకరించాడు స్కాట్‌ని. తరువాత కొద్ది సేపటికి జెర్సీ భోజనానికి అందర్నీ పిలిచింది.

అందరూ కలసి భోజనం చేస్తూ చిన్ననాటి ముచ్చట్లు చెప్పుకుంటూ నవ్వుతూ టైము తెలీకుండా చాల సేపు గడిపారు. తరువాత స్కాట్‌కి ఏర్పాటు చేసిన రూంలో స్కాట్ వెళ్ళిపడుకున్నాడు.

*

"జెర్సీ!''

"ఏయ్ హనీ!'' అంటూ చెవి దగ్గర నెమ్మదిగా పిలిచాడు స్టీవ్.

"ఊ!'' అంటూ ప్రక్కకు వత్తిగిలింది జెర్సీ.

"నిద్రపోతున్నావా?''

"ఊ''

"రియల్లీ!''

"ఏమిటి?'' అంటూ కళ్ళు తెరచింది.

"నీకు చాల థాంక్స్''

"ఏం? ఎందుకు?''

"నా మర్యాద కాపాడినందుకు''

"అదేం మాట స్టీవ్ '' అంది నొచ్చుకుంటూ.

"అవును జెర్సీ. స్కాట్ వస్తాడని నీతో చెప్పటం మర్చిపోయాను. అసలు ఎయిర్‌పోర్టుకి కూడా వెళ్ళటం మరిచాను. అదృష్టవశాత్తు మధ్యలో గుర్తుకు వచ్చింది. అప్పుడు వెంటనే పరుగెత్తాను. ఈ మధ్య మతిమరుపు ఎక్కువైపోతోంది''

"అవును. నిజమే. ఇంకొన్నాళ్ళు పోతే నన్నేమర్చిపోయేలా ఉన్నావ్. అవునా?''

"ఛ. అదేం మాట. నీవు లేకపోతే నాకు జీవితమే లేదు. ఆ సంగతి నీకు తెలుసు. నేను ఈరోజు ఇలా జీవిస్తున్నానంటే అదంతా నీ ప్రేమకారణం. తెలిసిందా!'' అంటూ ఆమెని దగ్గరగా తీసుకున్నాడు.

*

తూర్పు తెల్లతెలవారుతోంది. చెట్లమీద పక్షుల పలకరింపులతో ప్రకృతిని పరవశింపజేస్తున్నాయి. తూర్పున ఉదయభానుడు బాహ్య ప్రపంచంలోకి తొంగి చూస్తున్నాడు. అరుణ కిరణాల స్పర్శతో పులకాంకితయై చిరునవ్వు నవ్వే గులాబీలు చల్లని చిరుగాలితో ఊసులాడుకుంటున్నాయి. లాన్‌లో గడ్డిమీద మంచుబిందువులు ముత్యాల్లా మెరుస్తున్నాయి. ఆ అందమైన ప్రకృతి శోభని బాల్కనీలో కూర్చీలో కూర్చున్న స్టీవ్ తిలకిస్తున్నాడు. అతనికి ప్రకృతి అంటే చాలయిష్టం. సాధారణంగా తన మనస్సు ఆనందంగా ఉన్నప్పుడు, తీరిక సమయాల్లో వేడివేడి కాఫీ సిప్ చేస్తూ, ప్రకృతి శోభని ఆస్వాదిస్తూంటాడు.

శనివారం అవటంతో కొంచెం ప్రశాంతంగా ఉంది. రాత్రి స్నేహితుని కబుర్లతో పడుక్కునేటప్పటికి ఆలస్యం అయినా అలవాటు ప్రకారం స్టీవ్‌కి తొందరగానే మెలకువ వచ్చేసింది. ఇంకా యింట్లో ఎవరూ లేవలేదు. కుర్చీలోంచి లేచి మరొకసారి కాఫీ కలుపుకుని త్రాగి, ఆఫీసుకి వెళ్ళడానికి తయారయ్యాడు. టైము ఎనిమిది గంటలయ్యింది. వీకెండు కదా! ఏ ప్రాణులు తొందరగా లేవవు. వారంలో అయిదు రోజులు పడ్డశ్రమను ఈ రెండు రోజులు మరచిపోతారు. ఒకసారి జెర్సీ రూంలోకి వెళ్ళిచూసాడు. ఆమె ఒక ప్రక్కకు తిరిగి పడుక్కొని ఉంది. సుధాకరుని క్రమ్మేసిన మేఘాల్లా ఆమె కురులు అందమైన ముఖం మీద చిందర వందరగా పడి ఉన్నాయి. అతను ఆమెకు దగ్గరగా వెళ్ళాడు. ఆమె మత్తుగా నిద్రపోతోంది. 'నిన్న బాగా అలసిపోయింది' అని అనుకుంటూ ఆమె ముంగురులను సవరించి, నుదుటిమీద ముద్దెట్టుకుని వెనక్కి తిరిగాడు. ఇంతలో 'స్టీవ్' అంటూ

నిద్రలో అతని చేయి పట్టుకుంది అతను నెమ్మదిగా ఆమె చేతిని విడిపించుకుని బయటకు వచ్చి, ఆఫీసుకి వెళ్ళిపోయాడు.

## 15

బాగా బారెడు ప్రొద్దెక్కింది. సూర్యకిరణాలు కిటికీలోంచి స్కాట్ ముఖం మీద పడుతున్నాయి. అతను అటు ఇటు మంచంమీద దొర్లుతూ నెమ్మదిగా కళ్ళు తెరిచాడు. అబ్బ! చాల ప్రొద్దెక్కింది. టైమెంతై ఉంటుందో అని చేతికున్న వాచీ వంక చూసుకున్నాడు.

"ఓ మైగాడ్! అప్పుడే పదకొండు గంటలైంది'' అని అనుకుంటూ గబుక్కున మంచంపై నుండి లేచాడు. ఎక్కడ నుండో సన్నగా చిన్నగా తీయగా మ్యూజిక్ వినపడుతోంది. దానితో పాటు తీయని సువాసనలు మత్తుగా ముక్కుపుటాలను తాకుతున్నాయి. నెమ్మదిగా మేడ మెట్లు దిగి క్రిందకు వచ్చాడు స్కాట్.

జెర్సీ కిచెన్‌లో పనిచేస్తోంది.

"గుడ్ మార్నింగ్ జెర్సీ'' అని విష్ చేసాడు స్కాట్.

"వెరీ గుడ్ మార్నింగ్'' అని "రాత్రి మీకు బాగా నిద్రపట్టిందా?'' అని అడిగింది జెర్సీ.

"నిద్రపోవటంలో మనమే ఫస్ట్. నిద్రలో పాటలు కూడా పాడతాను''

"పాటలా?''

"ఆ! అదేనండీ! గుర్.... గుర్... గుర్...'' అని, "అందులోనూ నిన్న ప్రయాణ బడలిక వల్ల మరి కాస్త తారస్థాయినందుకొని ఉంటుంది రాగం. బహుశా మీ రూంలోకి వినపడి ఉండాలి.'' అంటూ నవ్వేశాడు.

"బలేవారండి మీరు. తమాషాగా మాట్లాడుతారు. ముందు మీరు బ్రెష్ చేసుకురండి. బ్రేక్‌ఫాస్ట్ రెడీ చేస్తాను. ఇప్పటికే బాగా ఆలస్యమైంది'' అంటూ తన పని చూసుకోసాగింది జెర్సీ.

స్కాట్ వాష్ రూంలోకి వెళ్ళాడు.

జెర్సీ డైనింగ్ టేబుల్ మీద ఆమ్లెట్స్, ఆనియన్ చిప్స్, బ్రెడ్, బట్టర్, జామ్ ప్లేటుల్లో పెట్టింది. కాఫీ మగ్‌లో వేడి వేడి కాఫీ పోసి ఉంచింది. కొద్ది సేపటికి స్కాట్ టవల్‌తో ముఖం తుడుచుకుంటూ వచ్చి కుర్చీలో కూర్చున్నాడు.

అతనికి ఎదురుగా ఉన్న కుర్చీలో కూర్చుంటూ, 'తీసుకోండి' అంటూ తనూ ఓ ప్లేటు తీసుకుంది.

"ఏమిటి మా కుంభకర్ణుడు యింకా లేవలేదా! పాపం. రాత్రి నా వల్ల బాగా లేటయిపోయింది''

"అదేం లేదులెండి. ఆయన సూర్యునికంటే ముందేలేస్తారు. ఆఫీసుకి వెళ్ళారు''

"వ్వాట్! శని, ఆదివారాలలో కూడా ఆఫీసువర్కేనా?''

"స్టీవ్ చేసేజాబ్ అలాంటిది. సాయంత్రం తొందరగానే వస్తారులెండి. మీరున్నారు గదా!'' అంది నవ్వుతూ.

"వాడి ఓపికకి మెచ్చుకోవాలి. అదే నేనైతే ఎప్పుడు వీకెండ్ వస్తుందా అని ఎదురుచూస్తూంటాను'' అంటూ ఆమ్లెట్‌ని తింటూ "ఎక్సెలెంట్'' అన్నాడు.

"ఏమిటి?''

"ఆమ్లెటండీ! చాల రుచిగా ఉంది. రాత్రి సప్పరైతే అద్భుతం అనుకోండి. మీ చేతి వంట చాల రుచిగా ఉంటుంది. కుకింగ్‌లో మీరు 'డిప్లొమా' తీసుకున్నారా?''

"మీకు పొగడటం బాగా వచ్చనుకుంటాను....'' అంది నవ్వుతూ జెర్సీ.

"ఎలా ఉన్నది అలా చెప్పేయటం నా పద్ధతండీ. మీరు ఏమనుకున్నా సరే. ఇంతకీ వీడు మధ్యాహ్నం కూడా రాడన్నమాట. స్నానం ముగించి నెమ్మదిగా గృహాన్వేషణకోసం బయలుదేరుతాను'' అన్నాడు స్కాట్.

"తొందరేముందీ? జాబ్‌లో చేరిన తరువాత వెతకవచ్చు. స్టీవ్ కూడ హెల్ప్ చేస్తాడు''

"ఎందుకులెండి. వాడి టైం వేస్ట్ చేయటం. ఎలాగూ ఇవాళ, రేపు ఖాళీయే గదా! చేసేపనికూడ లేదు. మరి స్నానం చేసి వస్తాను'' అంటూ అక్కడి నుండి లేచాడు స్కాట్.

"భలే విచిత్రమైన మనిషి'' అని అనుకుంది మనసులో జెర్సీ.

## 16

ఓ వారం రోజులు తిరిగిన తరువాత స్కాట్‌కి నచ్చిన అపార్ట్‌మెంటు దొరికింది. ఆ రోజు సంతోషంగా షాపింగ్ వగైరా చేసుకుని కొంచెం ఆలస్యంగా యింటికి వచ్చాడు. అక్కడి వాతావరణం చూస్తుంటే ఎవరో గెస్ట్‌లు వచ్చినట్లున్నారు అని గ్రహించాడు స్కాట్. స్కాట్‌ని చూడగానే 'వెల్‌కమ్ డియర్ ఫ్రెండ్' అని నవ్వుతూ స్కాట్‌ని వచ్చిన వాళ్ళకి పరిచయం చేస్తూ

"ఇతను నా చిన్ననాటి స్నేహితుడు స్కాట్'' అని వాళ్లకు చెప్పి, స్కాట్

వైపు తిరిగి "వీళ్ళు మన ఫామిలీ ఫ్రెండ్స్ డేవిడ్, ఆయన భార్య షీలా" అని స్కాట్‌కి చెప్పాడు స్టీవ్.

"కార్లటన్ యూనివర్సిటీ దగ్గర ఉంటున్నారు" స్కాట్ వాళ్ళకి నవ్వుతూ కరచాలనంచేసాడు.

'నా పేరు ముందుగానే మావాడు మీకు చెప్పేసాడు. నేను 'కార్లటన్ యూనివర్సిటీ'లో పనిచేస్తున్నాను. ప్రస్తుతానికి ఊరికి క్రొత్త వాణ్ణి. ఇంతవరకూ మావాడి నెత్తిమీదే 'జాగింగ్' చేస్తున్నాను" ఆ మాటకి అక్కడ ఉన్న వాళ్లందరూ గొల్లున నవ్వారు. "వేటాడగా వేటాడగా ఈ రోజు నా గేలానికి నాకు నచ్చిన ఫిష్ పడింది" వాళ్ళు స్కాట్ మాటలకి వింతగా అతని వంక చూసారు. ఒక్కసారి స్కాట్ వాళ్ళని పరికించి "ఓహ్! అయామ్ సారీ! నేను అర్థం కాకుండా ఏమేమిటో మాట్లాడేస్తున్నాను." అంటూ అందరి వంకా ఒక్కసారి చూసాడు.

"నో! నో! కంటిన్యూ చేయండీ. బలే ఇంట్రస్టుగా ఉంది" అన్నాడు డేవిడ్.

"ఇంతకీ చెప్పేదేమిటంటే ఈరోజు నాకు యిల్లు దొరికింది. యూనివర్సిటీకి దగ్గర్లోనే దొరకటం నా అదృష్టం. ఇది ఈ రోజు తాజా వార్త"

"మీరు చాల సరదాగా మాట్లాడుతారండీ!" అని ఒక సర్టిఫికేట్ పడేసింది షీలా. డేవిడ్ తన విజిటింగ్ కార్డు తీసి స్కాట్‌కిచ్చాడు.

అది చదివి "అరే! సరిగ్గా నా అపార్ట్‌మెంటుకి రెండిళ్ళు అవతలే మీ యిల్లు అన్నమాట. ఇకనేం నాకు మరొక ఫ్రెండ్ దొరికారన్నమాట"

"కంగ్రాచ్యులేషన్స్" అంది షీలా.

"ఎందుకండీ"

"ఎందుకేమిటి? మంచిలొకేషన్‌లో యిల్లు దొరికినందుకు"

"థాంక్స్"

అందరూ చాలసేపు మనసువిప్పి మాట్లాడుకున్నారు. ఆ తరువాత డేవిడ్, షీలాలు సెలవు తీసుకుని యింటికి వెళ్ళిపోయారు.

"స్టీవ్ నేను రేపు ఈవినింగ్ అద్దె కొంపలో గృహప్రవేశం అవుతాను. రేపు మీరు కూడా చూసి ఓకే అంటే అడ్వాన్స్ యిచ్చి కాంట్రాక్ట్ కాగితాల మీద సంతకం చేసేస్తాను" అన్నాడు స్కాట్.

"అది సరేగాని స్కాట్! డయానాని, పిల్లల్ని ఎప్పుడు తీసుకువస్తావ్" అని జెర్సీ అడిగింది.

"ఇదిగో! మీరు యిల్లు బాగుందని ఖాయం చేస్తే, వచ్చేవారం తీసుకువచ్చేస్తాను. కనుక మనం రేపు యిల్లుకుదుర్చుకున్న తరువాత అందరం కలసి 'పార్క్‌లైన్' హోటల్లో డిన్నర్‌కి వెడుతున్నాము" అంటూ నవ్వేసాడు స్కాట్.

మాటల్లో కాలం తెలీకుండా గడచిపోయింది.

## 17

లాంగ్‌వీకెండ్ రావటంతో స్కాట్ 'విన్నీపెగ్' వెళ్ళి డయానానీ, పిల్లలిద్దర్నీ 'ఆటవా' తీసుకువచ్చాడు. డయానాతో 'ఇల్లు ఎలా ఉందోయ్' అని అడిగాడు స్కాట్.

"ఫర్వాలేదు, నాట్‌బేడ్" పెదిమలు నొక్కుకుంటూ అంది డయానా.

"చాల యిళ్ళు తిరిగి తిరిగి చివరకిది సెలక్ట్ చేసాను. నీకు నచ్చుతుందో లేదోననే భయంతోనే స్టీవ్, జెర్సీల సర్టిఫికెట్ కూడ తీసుకున్నాను" అని నవ్వుతూ అన్నాడు

"ఆ! ఆ! నేనంటే అంత భయం ఉందా? అయినా ఎన్నేళ్ళు వచ్చినా మీకింకా చిలిపితనం మాత్రం పోలేదు"

"నువ్వెదురుగా ఉంటే ఎక్కువవుతుంది కాని తగ్గిపోదు తెలిసిందా?"

"ఆ! ఆ! అది సరేగాని సాయంకాలం తొందరగా వస్తే మనం షాపింగ్‌కి వెళ్ళాలి. కావలసినవి కొనుక్కోవాలి. తరువాత పిల్లల స్కూలు విషయం ఆలోచించాలి. ఆ! అన్నట్టు, మర్చిపోయాను. మీ చిన్ననాటి ఫ్రెండ్ అని చెప్పారు కదా! ఆ ! పేరు... ఆ... స్టీవ్, జెర్సీలు ఎక్కడా దర్శనాలివ్వలేదేం?"

"ఏదీ మనం వచ్చి రెండు రోజులైంది. ఈ విషయం వాడికి యింకా నేనే తెలియపరచలేదు. వాళ్ళిద్దరూ పగలు వర్క్‌కి వెడతారు. వీకెండ్‌లో కొంచెం ఖాళీ ఉంటుంది కదా! అప్పుడు మనమే వెడదాం. వాళ్ళకి ఒక అబ్బాయి. పేరు పింకి. వాళ్ళిద్దరూ చాల అన్యోన్యంగా ఉంటారు. లవ్‌మేరేజ్. చాల మంచి వాళ్ళు. నేనంటే ప్రాణం యిస్తాడు. వచ్చిన క్రొత్తల్లో ఓ పదిరోజులు వాళ్ళింట్లోనే ఉన్నాను. అయినా కొద్ది రోజుల్లో నువ్వే చూస్తావ్ కదా! ఓకే! మరి నేను ఆఫీసుకి వెళ్ళివస్తాను. ఏదీ" అంటూ ఆమె అధరాల మీద ఓ ముద్దిచ్చి వెళ్ళిపోయాడు స్కాట్.

*

సాయంత్రం ఆఫీసు నుండి సరాసరి యింటికి వచ్చేసాడు స్కాట్. అప్పటికే పిల్లలు, డయానా షాపింగ్ వెళ్ళడానికి రెడిగా ఉన్నారు. కాఫీ త్రాగాక అందరూ

కలసి బయలుదేరారు.

నెమ్మదిగా నడచుకుంటూ కబుర్లు చెప్పుకుంటూ, చుట్టుప్రక్కల ఉన్నవి చూచుకుంటూ కావలసిన వస్తువుల్ని కొనుక్కుంటూ ఆటవా నగర అందాల్ని తిలకిస్తున్నారు.

'ఆటవా' చాల అందమైన సిటీకదూ!'' అని స్కాట్‌తో కళ్ళు త్రిప్పుతూ అంది డయానా.

"అవును హనీ! చాలా ఉన్నాయి చుట్టు ప్రక్కల చూడటానికి మంచి మంచి పార్కులు, పార్లమెంటు భవనం, దగ్గర్లోనే ఫ్రెంచి "హాల్", ఆటవా రివర్, రిడూ సెంటర్ ఇంకా ఎన్నెన్నో ఉన్నాయి'' అన్నాడు స్కాట్.

ఆటవా అందం రాత్రిపూట 'స్పేనిష్ డాన్సర్'లా మెరిసిపోతోంది. రంగురంగుల దీపాలతో, శరవేగంగా దూసుకుపోయే వాహనాలతో, వింత వింత అందమైన మనుష్యులతో చాల హడావుడిగా పరుగెడుతోంది నగరం.

ఆకాశాన్ని అందుకునే భవనాలు, అందులో వెలిగే దీపాలు, పెద్దపెద్ద రెస్టారెంట్లు. ఎక్కడ చూసినా జన సముద్రం, అందులోనూ గురువారం, శుక్రవారం అయితే షాపులు, వగైరా ప్రజల్ని ఆకర్షిస్తూ తొమ్మిది గంటలు దాకా నవ్వుతూ ఉంటాయి. శుక్రవారం అయితే లాస్ట్ వర్కింగ్‌డే కదా! అందరూ ఆఫీసులు, కంపెనీలలో నాలుగున్నరగంటలకే తమ ఫైల్సుని మూసేసి బయట పడతారు.

''డాడీ! చాలదూరం నడిచాం. ఆకలేస్తోంది'' అంటూ నసగటం మొదలుపెట్టారు స్టేసీ, బ్రెంట్.

"ఇదిగో దగ్గర్లోనే ఇండియన్ రెస్టారెంట్ 'ఫేలీ' ఉంది. అక్కడ భోజనం చాల బాగుంటుంది. ఈ పూట డిన్నరు అక్కడే'' అంటూ దగ్గరో బైవార్డ్ మార్కెట్టు వైపు నడిపించాడు స్కాట్.

ఇదిగో వచ్చేసాం అంటూ హోటల్‌లోకి దారి తీసాడు.

డయానా, పిల్లలు ఒకటేబుల్ దగ్గర కూర్చున్నారు

స్కాట్ భోజనానికి ఆర్డరివ్వడానికి ప్రక్కకి వెళ్ళాడు. ఇంతలో వాళ్లకి ఎదురుగా ఉన్న టేబుల్ దగ్గరకి ఒకామెవచ్చి కుర్చీలో కూర్చుంది.

"ఓమైగాడ్! ఏం బ్యూటీ! ఆడవాళ్ళనే ఆకట్టుకునే అందం '' అని మనసులో అనుకుంది డయానా.

ఆమె అటు, యిటూ పరిసరాలను పరికిస్తోంది "స్కాట్ యింకా రాలేదు'' అని అనుకుంటూ ఎదురుగా కూర్చున్న స్త్రీ వంక చూసి నవ్వుతూ విష్ చేసింది.

"హలో! మీరింకా ఆర్డరివ్వలేదా భోజనానికి'' అని ఆమెని అడిగింది డయానా.

"మావారు వెళ్ళారు. ఇంకా రాలేదు'' అని నవ్వుతూ అంది ఆమె.

"అలాగా! మీ స్వీట్ నేమ్ ఏమిటి'' అని డయానా అడిగింది.

"జెర్సీ"

"ఆ! ఆ! నా పేరు డయానా''

"ఓ! ఓ! డయానా అంటే...'' అని జెర్సీ ఏదో అనబోయేలోగా స్టీవ్, స్కాట్ తో కలసి అక్కడకు వచ్చారు.

"డయానా! నీకో సర్‌ప్రైజ్!"

"ఏమిటి"

"ఈ విగ్రహం ఎవరో తెలుసా? నేను చెప్పాను నా చిన్ననాట స్నేహితుడు స్టీవ్ అని, ఉత్తబుద్ధావతారం అని, ఉదయం నువ్వు అడిగావ్ కూడా, వాడే వీడు'' అంటూ స్టీవ్‌ని డయానాకి పరిచయం చేసాడు స్కాట్.

స్టీవ్ కొంచెం ప్రక్కకి వెళ్ళి జెర్సీతో వచ్చి, "ఈమె నా భార్య జెర్సీ'' అంటూ జెర్సీని పరిచయం చేసాడు.

"మీకంటే ముందరే పరిచయం అయ్యాంలెండి'' అని జెర్సీఅంది.

"ఎలా?'' అంటూ ఆశ్చర్యాన్ని వ్యక్తం చేసాడు స్టీవ్.

"మీరు అటు వెళ్ళారు, డయానా కూడా యిక్కడే కూర్చుంది. నెమ్మదిగా చిరునవ్వులతో ప్రారంభమై, తరువాత మాటలు కలిసాయి. ఇంతలో మీరు వచ్చారు'' అని నవ్వుతూ సమాధానం ఇచ్చింది.

"చూడండి డయానా! వీడి బుర్ర అప్పుడప్పుడు అసలు పనిచేయదు. వచ్చి రెండు రోజులైనా కనీసం ఫోన్ కూడా చేయకుండా కూర్చున్నాడు. అసలు డైరక్ట్‌గా మాయింటికే వచ్చేయాల్సింది. కొద్దిగా రెస్ట్ తీసుకుని అప్పుడు వెళ్ళేవారు కదా!'' అని తన అభిమానాన్ని వ్యక్తం చేసాడు.

"పర్వాలేదులెండి. అన్ని సదుపాయంగానే ఉన్నాయి''

ఇంతలో "ఏమిటి బజారంతా కొనేసినట్లున్నారు?'' అని డయానాతోమాట కలిపింది.

"ఆ! ఏవి తప్పినా సంసారానికి కావల్సినవి కొనుక్కోవటం తప్పదు కదా! అందుకని యీ రోజు బయలుదేరాం. అనుకోకుండా మిమ్మల్ని కూడా చూడటం జరిగింది. నాకు చాల సంతోషంగా ఉంది'' అని అంది డయానా.

"అది సరేగాని వచ్చే శనివారం ఉదయం పదింటికి మా యింటికి రండి. సరదాగా కబుర్లు చెప్పుకోవచ్చు. సాయంత్రం దాక ఉండి వెళుదురు గాని" అని అంది జెర్సీ.

"అప్పుడే ఎందుకండి! ఇక్కడ ఉండేవాళ్ళమే కదా!" అని నసిగింది డయానా.

"ఆ! ఆ! అలా కాదు. తప్పక రావాలి. ఈ లోపులో మీకు యిల్లు సర్దుకోవటం పూర్తవుతుంది. నాకు మిగతా రోజులు ఖాళీ ఉండదు" తప్పదన్నట్లు చూస్తూ అంది జెర్సీ.

"మీకు పిల్లలెందరు? మాట మారుస్తూ అడిగింది డయానా"

"ఇదిగో! వీడు ఒక్కడే. పేరు పింకీ" అంటూ పింకీతో,

"పింకీ! ఆంటీకి షేక్‌హాండ్ ఇయ్యి" అంది జెర్సీ.

డయానాని విష్ చేస్తూ షేక్‌హేండ్ యిచ్చాడు పింకీ. వాణ్ణి దగ్గరగా తీసుకుని బుగ్గమీద ముద్దు పెట్టుకుంది డయానా.

తరువాత స్టేసీని, బ్రెంట్‌ని వాళ్ళకి పరిచయం చేసింది డయానా.

భోజనం చేస్తూ ఆ రెండు కుటుంబాలు పరిచయాల్తోను, కబుర్లతోను భోజనం పూర్తి చేసి హోటల్ బయటకు వచ్చారు. జెర్సీ, స్టీవ్‌లు తమ కారులో వాళ్ళని యింటివద్ద దింపి, శనివారం మరచిపోకుండా రమ్మనమని మరీ మరీ చెప్పి యింటి ముఖం పట్టారు.

## 18

స్కూల్సుకి, యూనివర్సిటీ స్టూడెంట్స్‌కి కిస్మస్ సెలవులిచ్చారు. అందరి మొహాలలోను ఆనందం వెల్లివిరుస్తోంది. పిల్లల ఆనందానికి అవధుల్లేవు. ఎవరికైనా సెలవులంటే హేపీయే కదా! ప్రతిరోజు ఉదయం లేవక్కర లేదు. నెమ్మదిగా ఎప్పుడో లేవవచ్చు. బండెడు బరువున్న పుస్తకాల బ్యాగ్‌లు మోయక్కరలేదు. హాయిగా టి.వి. చూసుకోవచ్చు. స్నేహితుల యింటికి వెళ్ళి హేపీగా గడపవచ్చు. ఎంచక్కా 'వీడియో గేమ్స్' ఆడుకోవచ్చు. మమ్మీ, డాడీలతో కలసి షాపింగ్‌లకి, పార్టీలకి వెళ్ళవచ్చును. క్రిస్మస్ రోజున రకరకాల బహుమతులొస్తాయి. సరదాగా షికారుకెళ్ళి, హోటల్లో ఫ్రెంచివైన్, మంచి మంచి కేక్స్, పెప్రోనీ పిజా తినొచ్చు. నిజంగా సెలవు రోజులే వాళ్ళకి 'గోల్డెన్ డేస్' ఇక పెద్ద వాళ్ల సంగతికి వస్తే, పిల్లలకంటే హడావుడి పడిపోతారు. పార్టీలు ఎంత ఘనంగా ఏర్పాటుచేయాలి. ఎవరెవరిని పిలవాలి? తమని పిలిచిన వాళ్ళకి ఎటువంటి గిఫ్ట్సు కొనాలి? ఇలాంటి ఆలోచనలతోనే లేచింది మొదలు షాపుల వెంట పరిగెడతారు.

స్టీవ్, జెర్సీలు తమ ఫ్రెండ్స్ అందర్నీ ఆ రోజు వాళ్ళింటికి పార్టీకి పిలిచారు. స్కాట్ ఫామిలీ ఉదయమే పదిగంటలకి వచ్చారు. డయానా డ్రాయింగు రూం డెకరేషన్‌లోను, వంటపనిలోను జెర్సీకి సహాయం చేసింది. బ్రెంట్, గ్రేసీలు, స్టీవ్‌కి హెల్ప్ చేసారు. స్కాట్ మధ్య మధ్యలో అందర్నీ పలకరిస్తూ పింకీతో కబుర్లు చెబుతూ, జోకులేస్తూ అలసట లేకుండా అందరితోను సమానంగా మిగిలిన పనులు పూర్తి చేసాడు.

అయిదు గంటలు అవుతుండగా అతిథులు రావటం మొదలుపెట్టారు. అది డ్రాయింగు రూంలా లేదు. రంగురంగుల అలంకరణలతో భూతల స్వర్గంలా ఉంది. క్రిస్మస్‌ట్రీ చాల అందంగా రంగురంగుల దీపాలతోను, బాల్స్‌తోను, చెమ్కీ పువ్వులతోను అమర్చబడిఉంది. మెరుస్తున్న హైక్లాస్ సిల్కు బట్టలతోను, వింత వింత ఆభరణాలతోను, రకరకాల హేర్‌స్టైల్స్‌తోను మిలమిల మెరిసి పోతున్నారక్కడకు వచ్చిన జంటలు.

స్టీవ్, జెర్సీలు వచ్చిన వాళ్ళని చిరునవ్వుతూ స్వాగతం చెప్తూ, వాళ్ళని స్కాట్, డయానాలకి పరిచయం చేస్తున్నారు. వాళ్ళు తెచ్చిన గిఫ్ట్సుని క్రిస్మస్ ట్రీకి చుట్టూరా పెడుతున్నారు. తరువాత అందరికీ డ్రింక్స్ సప్లై చేసారు. ఒక ప్రక్కనుండి చిన్నగా జాజ్ మ్యూజిక్ విన్పిస్తోంది. ఎవరికి నచ్చిన వాళ్ళతో వాళ్ళు గుంపులుగా విడిపోయి కబుర్లు చెప్పుకుంటున్నారు. కొందరు మ్యూజిక్‌కి అనుగుణంగా అడుగులు వేస్తూ డాన్సు చేస్తున్నారు. నవ్వులతో, పాటలతో, జోకులతో అక్కడంతా కోలాహలంగా ఉంది. డేవిడ్, షీలాలు కొంచెం రావటం ఆలస్యమైనా మిగతా వాళ్ళతో కల్సిపోయారు. తరువాత అందరూ డిన్నర్ చేసారు. వంటలు చాల బాగున్నాయంటే బాగున్నాయని అందరూ మెచ్చుకున్నారు.

పార్టీ చాల బాగా జరిగిందని, గుర్తుంచుకునేలా వంటకాలు రుచిగా చాల బాగున్నాయని ప్రతి ఒక్కరూ చెప్పి ఎవరింటికి వాళ్ళు వెళ్ళిపోయారు.

జెర్సీ, స్టీవ్‌లు తమకి హెల్ప్ చేసినందుకు స్కాట్, డయానాలకి చాలా థాంక్స్ చెప్పారు. తరువాత డేవిడ్ తన కారులో స్కాట్, డయానాలను వాళ్ళయింటి దగ్గర దింపాడు.

ఇంటికి వచ్చాక "పార్టీ ఎలా ఉందోయ్" అని డయానాని అడిగాడు స్కాట్.

"చాల బాగా జరిగింది" అని హేపీగా అంది.

"బాగా అలసిపోయినట్లున్నావ్?"

"నథింగ్"

"సరే అయితేచాలా టైమయింది. పడుకుందాం పద" అంటూ పిల్లలకి గుడ్‌నైట్ చెప్పి తమ బెడ్‌రూంలోకి వెళ్ళిపోయారు.

## 19

డయానాకి ఇప్పుడు అందరితోను పరిచయం అయింది. వాళ్ళయింటి ప్రక్కనే ఉన్న డేవిడ్ ఫామిలీతో బాగా స్నేహం కలిసింది. తీరిక సమయాల్లో ఒకరింటికి ఒకరు వచ్చి కబుర్లు చెప్పుకుని వెడుతూండేవారు. షీలాకి యిద్దరు పిల్లలు. అబ్బాయి పేరు జాన్, అమ్మాయి పేరు స్టేసీ. డయానా పిల్లల్లాగే వాళ్లు పెద్దవాళ్లే. యూనివర్సిటీలో చదువుకుంటూన్నారు. షీలా చాల మంచి మనిషి. తొందరపడి ఎవర్నీ ఒక్కమాట కూడ అనదు. ఎప్పుడూ పెదవులమీద చిరునవ్వు చిందుతూంటుంది. ఎవరికి ఏ అవసరం వచ్చినా ఒకరికొకరు సహాయం చేసుకునేవారు. డేవిడ్ కనపడటం చాల తక్కువ. ఎప్పుడో గాని కనపడేవాడు కాదు. రెండు మూడు రోజులకొకసారైనా ఒకళ్ళింటికి ఒకళ్ళు వచ్చి వెళ్తూండేవాళ్ళు. బజారుకి కలసి వెడుతూండేవారు.

ఈ మధ్య షీలా వచ్చి అప్పుడే వారం దాటింది. తీరుబడిలేక తనూ వెళ్లలేదు. ఈ రోజు ఎలాగైనా ఓసారి వెళ్ళిరావాలని, యింటి పనులను కొన్ని వాయిదావేసి, పిల్లలు వచ్చేలోపులో ఓసారి వెళ్ళిరావాలని షీలా యింటికి వెళ్ళింది డయానా. రెండు మూడుసార్లు కాలింగ్ బెల్ నొక్కింది. ఓ అయిదు నిమిషాల తరువాత షీలా తలుపు తీసింది.

"హలో! డయానా! హౌ ఆర్ యూ" అంటూ లోపలకు ఆహ్వానించింది షీలా.

"ఫైన్" అంది డయానా.

"తలుపు తీయటం ఆలస్యం అయిందనుకుంటాను. మేడమీద ఉన్నాను. సారీ!" అంటూ నీరసంగా అంది.

"పర్వాలేదులే. నువ్వేమిటి అలా నీరసంగా ఉన్నావ్? ఒంట్లో బాగాలేదా?" అని ఆత్రుతగా అడిగింది డయానా.

"అయిదారురోజుల బట్టి జ్వరంగా ఉంది"

"కనీసం పిల్లల చేతనైనా నాకు కబురు పెట్టొచ్చుకదా! ఏమంత దూరం మాయిల్లు. తీరికలేక రాలేదని అనుకున్నాను. కాని జ్వరం అని తెలియదు" అని కంగారు పడుతూ అంది డయానా.

"ఈ మాత్రం దానికే కంగారెందుకు?" నవ్వుతూ అంది షీలా.

"కుకింగ్ పిల్లలు చేస్తున్నారా? లేక డేవిడ్ చేస్తున్నాడా?"

"డేవిడ్ ఊళ్ళోలేడు. పిల్లలే అవస్థ పడుతున్నారు"

"మంచి పనేకాని, సాయంత్రం నేచేసి పంపిస్తాను. ఇలాంటప్పుడు కాకపోతే మరెప్పుడు మనం హెల్ప్ చేసుకుంటాం?" అని కాసేపు కుటుంబ విషయాలు మాట్లాడి యింటికి వచ్చేసింది డయానా.

సాయంకాలం రెండుమూడు రకాల కూరలు తయారుచేసి గ్రేసీతో షీలాకి యిచ్చిరమ్మనమని పంపించింది డయానా.

*

ఒకరోజు షీలా ఆరోగ్యం ఎలా ఉందో చూసివద్దామని వాళ్ళింటికెళ్ళింది డయానా. ముందున్న తలుపు కొద్దిగా తీసేఉంది. లోపలకెళ్ళే తలుపు మూసి ఉంది. లోపలనుండి ఏవో మాటలు గట్టిగా వినపడుతున్నాయి. తలుపు కొడదామా? వద్దా? అని ఆలోచించింది డయానా. మాటలు రానురాను అరుపులుగా వినపడుతున్నాయి. తరువాత ఎవర్నో కొడుతున్నట్లు శబ్దం వస్తోంది. ఏం జరుగుతోందో అర్థం కాలేదు డయానాకి. పోనీ తరువాత రావచ్చని తలుపు తట్టకుండా బయటకు వచ్చేసింది.

రాత్రి భోజనాలు చేస్తున్న సమయంలో డయానా భర్తతో "నేనో విషయం అడుగుతాను. సమాధానం కరెక్ట్‌గా చెప్పాలి" అని అంది.

"ఏమిటి?"

"నీ దృష్టిలో డేవిడ్ ఎలాంటి వ్యక్తి"

"ఏం? అలా అడుగుతున్నావ్?"

"ఆ! ఏం లేదు. ముందు నీ ఉద్దేశ్యం చెప్పు"

"మంచివాడు. పెద్దమనిషి. మంచిపొజిషన్‌లో ఉన్నవాడు. అసలు యింతకీ ఏం జరిగింది? ఎందుకలా అడుగుతున్నావ్?" అడిగాడు స్కాట్.

మధ్యాహ్నం జరిగిన సంగతి చెప్పింది.

"అతన్ని చూస్తే అలా అన్పించదు. వాళ్ళిద్దరూ అన్యోన్యంగానే కన్పిస్తారు"

"పైకి కొంతమంది అలాగే కన్పిస్తారు. యింటిలో మాత్రం భార్యని హింసించుకు తింటారు"

"నిజమేమిటో తెలీకుండా ఎందుకలా మాట్లాడుతావ్?"

"అది కాదు స్కాట్. షీలా చాల మంచిమనిషి"

"సరే! సమయం వచ్చినప్పుడు అసలు విషయం తెలుస్తుంది" అంటూ స్కాట్ సప్పర్ ముగించి కుర్చీలోంచి లేచాడు.

నెమ్మదిగా ఎప్పుడో మాటలసందర్భంలో నేనే అసలు విషయం తెలుసుకుంటాను" అని మనసులో అనుకుంది డయానా.

## 20

ఆ రోజు శనివారం. పింకీ తన రూము సర్దుకుంటున్నాడు. వాడికి పింక్ కలర్ అంటే బాగా యిష్టం. అందుకు తగినట్లుగా స్టీవ్ వాడి గదికి అదే రంగువేసాడు. కిటికీలకు గులాబీ రంగు కర్టెన్స్, అదే రంగున్న టేబుల్ క్లాత్, బెడ్ షీట్‌తో సహా అన్నీ గులాబీ రంగు ఉండేటట్లు అమర్చాడు. ఇవన్నీ చూస్తూ అప్పుడప్పుడు జెర్సీకొడుకుని దగ్గరగా తీసుకుని "మీ డాడీకి నువ్వంటే ప్రాణంరా! నన్ను విడిచి అయినా ఉండగలరేమో గానీ, నిన్ను మాత్రం విడిచి ఉండలేరు. మరి చూడు! నీపేరు పింకీ. నీ ఫేవరేట్ కలర్ పింక్" అని అనేది. తల్లి అన్నమాటలు పింకీకి గుర్తుకువచ్చాయి. ఎప్పుడో బుద్ధి పుట్టినప్పుడు సర్దుకోవటం మొదలుపెడతాడు. అప్పుడప్పుడు స్టీవ్ హెల్ప్ చేస్తుంటాడు. తన పుస్తకాలన్నీ నీట్‌గా షెల్ఫ్‌లో పెట్టుకున్నాడు. టేబుల్‌ని ఉన్నచోటు నుండి తీసి నెమ్మదిగా కిటికీ ప్రక్కగా జరిపాడు. కిటికీకి రెండవ ప్రక్కగా బెడ్ సర్దాడు. మిగతా వస్తువులు తన మనసుకి తోచినట్లు సర్దాడు. ఇంక బట్టల బీరువా సర్దుదామని బీరువా తలుపు తెరిచాడు. అది ఒక చిట్టడవిలా ఉంది. అందులో ఏం జంతువులుంటాయో అని కొంచెం భయపడ్డాడు పింకీ. నెమ్మదిగా ఒక్కొక్కటీ తీసి బయటపెడుతున్నాడు. అంతట్లో పై అరలో నుండి దభీమని ఒక వస్తువు మీద పడింది. పింకీ కొంచెం గాభరా పడ్డాడు. తీరా దాన్ని చూసాక "అమ్మయ్యా! ఇదేనా" అని హాయిగా ఊపిరి పీల్చుకున్నాడు. ఆ పడ్డదాన్ని తీసి నాప్‌కిన్‌తో తుడిచి ఒళ్ళో పెట్టుకుని చూడటం మొదలెట్టాడు. ఇంతకీ అది 'ఫోటో ఆల్బమ్'. 'చాల రోజులైంది చూసి' అని ఒక్కొక్క పేజీ తిరగేసి చూస్తున్నాడు.

మొదట చాల పేజీలు స్టీవ్, జెర్సీ కలసి వివిధ భంగిమలలో తీయించుకున్న ఫోటోలు ఉన్నాయి. తరువాత కొన్ని తల్లి దండ్రులతో కలసి పింకీ చిన్నగా ఉన్నప్పుడు తీయించుకున్నవి ఉన్నాయి. తనకి స్నానం చేయిస్తున్నట్లు, బట్టలు వేస్తున్నట్లు, పాలుపడుతున్నట్లు, తండ్రి క్రిందకు మోకాళ్లమీద వంగి ఉంటే తను వీపుమీద కూర్చుని చప్పట్లు కొడుతున్నట్లు, తల్లి ఒడిలో కూర్చుని నిద్రపోతున్నట్లు యింకా చాల రకాల ఫొటోలున్నాయి. వాటిని చూస్తున్న పింకీకి ఎంతో ఆనందం వేసింది. డాడీకి మమ్మీ అంటే ఎంత యిష్టమో! మమ్మీ, డాడీ అంటే తనకి మరీ యిష్టం. ఇప్పుడు మమ్మీ ఏం చేస్తూ ఉంటుందో? తన గురించి, డాడీ గురించి ఆలోచిస్తూంటుందో? లేదో? ఏదో పనిలోపడి మర్చిపోయి ఉంటుంది" అనుకుంటూ పింకీ జరిగిన సంఘటనలు గుర్తుకుతెచ్చుకుంటూ కళ్ళు మూసుకున్నాడు.

## 21

ఒకరోజు జెర్సీ కిచెన్‌లో బ్రేక్ ఫాస్ట్ తయారుచేస్తోంది. పికీ నెమ్మదిగా తల్లి వద్దకు వెళ్ళి,

"మమ్మీ! మమ్మీ! నేనూ హెల్ప్ చేస్తాను" అన్నాడు.

"నువ్వు ఏం చేస్తావ్! చిన్నాడివి! కొన్నాళ్ళాగు" అంది జెర్సీ.

"ఆమ్లెట్ వేస్తాను మామ్" అన్నాడు.

"ఓకే! ఎగ్స్ ఫ్రిజ్‌లో ఉన్నాయి. ఆనియన్స్ యివిగో యిక్కడున్నాయి" అని చెప్పి యింకోపని చూసుకుంటోంది. పింకీ రెండు గ్రుడ్లు తీసుకున్నాడు. స్టవ్ మీద ఎగ్‌పేన్ పెట్టాడు. అది వేడెక్కాక గ్రుడ్లుకొట్టి అందులో ఆనియన్స్ ముక్కలు వగైరా వేసి, సింక్ దగ్గరకి చేతులు కడుక్కుందుకు వెళ్ళి, అంతలో తండ్రి పిలవటంతో డ్రాయింగు రూంలోకి వెళ్ళాడు.

ఓ పదిహేను నిమిషాల తరువాత జెర్సీ ఏదో పనిమీద అక్కడకు వచ్చి ఒక్కసారి స్టీవ్ అంటూ అరిచింది. ఏం జరిగిందో ఏమిటో అని స్టీవ్, పింకీ యిద్దరూ కలసి కంగారుగా కిచెన్‌లోకి వచ్చారు. అప్పటికే జెర్సీ స్టవ్ ఆర్పేసింది.

"ఏం జరిగింది జెర్సీ?" అని స్టీవ్ అడిగాడు.

"టు డే స్పెషల్ బ్రేక్ ఫాస్ట్ నీకు" అంటూ అటువైపు చూపించింది.

స్టీవ్ చూపులు జెర్సీ చూపించిన దిశగా వెళ్ళాయి.

"ఓ మైగాడ్ వాట్ ఈజ్ యిట్?" అంటూ ఆశ్చర్యంగా చూశాడు.

"దటీజ్ ఆమ్లెట్"

"ఈజ్ యిట్ సో?"

"ఆ! అది మన ముద్దుల పింకీ తయారుచేసాడు. ఈ పూట మీ యిద్దరికీ అదే బ్రేక్‌ఫాస్ట్"

ఒకసారి స్టీవ్ దాని దగ్గరకి వెళ్ళిచూసాడు. పేన్ + ఆమ్లెట్ ఒకే రంగులో పోల్చుకోలేకుండా నల్లగా మాడి సెగలు క్రక్కుతున్నాయి. పాపం! పింకీ బిక్కమొహం వేసుకుని నేలచూపులు చూస్తూ భయంగా నిలబడ్డాడు తల్లి ఏం అంటుందోనని.

స్టీవ్ వాడిని దగ్గరగా తీసుకుంటూ "పర్వాలేదులే హనీ! మమ్మీ మనకి డబుల్ ఆమ్లెట్టు మంచిగా వేసి పెడుతుంది. భయపడకు. మమ్మీ ఏం అనదులే" అంటూ వాడికి ధైర్యం చెప్పాడు స్టీవ్.

"జెర్సీ చిరునవ్వు నవ్వుతూ "డోంట్ వర్రీ మైడియర్ బోయ్! మొదటిసారి కదా అలాగే ఉంటుంది. ఇదిగో ఇప్పుడు నేను వేస్తాను చూద్దువు గానిరా" అని వాణ్ణి ప్రేమగా దగ్గరకు తీసుకుంది.

"నిజంగా మమ్మి ఎంత మంచిదో" అని మనసులో అనుకున్నాడు పింకీ. అదే ఇంకొకళ్ళు అయితే కోప్పడివుండేవాళ్ళే... తియ్యని గతంలోంచి తండ్రి పిలుపుతో ఒక్కసారి ఉలిక్కిపడ్డాడు పింకీ.

"ఏం చేస్తున్నావ్ పింకీ? చాలసేపట్నుంచి కనపడలేదు" అని అంటూ... ఒక్కసారి గదంతా పరికిస్తూ "ఏమిటి ఇంత అందంగా ఉంది నీ గది. ఎవరైనా వస్తున్నారా?" అని అడిగాడు.

"ఊహూ!" అంటూ తల అడ్డంగా త్రిప్పాడు.

"అదేంటి ఒళ్ళో?" అంటూ ఆల్బమ్ వైపు చూసాడు స్టీవ్. స్టీవ్ కూడ ఒక్కసారి ఆల్బమ్‌ను తిరగేసి ఒక్క నిట్టూర్పు గట్టిగా విడిచాడు.

"డాడీ!" అంటూ నెమ్మదిగా పిలిచాడు పింకీ.

"ఏం పింకీ?"

"మమ్మీ ఎప్పుడొస్తుంది డాడీ!"

"మమ్మీకి కోపం వచ్చింది హనీ... నేను కావాలని ఏ తప్పు చేయలేదు. ఆఫీసుగొడవల్లో పడి ఆమెని బాధపెట్టాను. దానికి శిక్షగా నాకు దూరంగా ఉంటుంది. మనసు మార్చుకుని వస్తుందనే ఆశతోనే ప్రతి క్షణం ఎదురుచూస్తున్నాను. కనీసం నీకోసమైనా తప్పక వస్తుంది" అని వాణ్ణి గుండెలకి హత్తుకున్నాడు స్టీవ్.

"మమ్మీ ఉంటే బాగుంటుంది కదు డాడీ!"

"ఆ!"

"పోనీ డాడీ ఓ గుడ్ అయిడియా"

"ఏంటది?"

"మనమే మమ్మి వద్దకు వెడితే!"

"పింకీ!" అంటూ వాణ్ణి యింకాస్త దగ్గరగా తీసుకుని, వాడి పసి మనసు బాగోలేదని గ్రహించిన స్టీవ్ "మనం అలా బయటకు వెడదాం పద. మిగతావి తరువాత సర్దుకుందాం" అంటూ ఉన్నంతలో గబగబ సర్దేసి యిద్దరూ మేడ మీంచి క్రిందకు వచ్చారు.

## 22

శీతాకాలం రావటంతో మంచుపడుతూంటుంది. ఈ స్నో ఎప్పుడు పడుతుందో, ఎప్పుడు ఆగిపోతుందో తెలీదు. ఇళ్ళపైన, రోడ్లమీద, ఫుట్‌పాత్‌ల మీద ఒకచోట ఏమిటీ ఎక్కడ ఓపెన్‌గా ఉంటే అక్కడ తెల్లని తివాసీలు పరచినట్లు పడుతుంది. మీపుల్ వృక్షాలు తమ పాత వస్త్రాలను రాల్చేసి, తెల్లని మంచు చీరలను అలంకరించుకుంటాయి. ఆకాశం కడిగిన ముత్యంలా మెరుస్తూంటుంది. రోడ్లపైన పడిన మంచుని ఎప్పటికప్పుడు మునిసిపాలిటీ వాళ్ళు క్లీన్ చేస్తూంటారు. ఈ మంచు పడటం నవంబరు లాస్ట్ వీక్ నుండి మొదలవుతుంది. ఏప్రిల్ వరకు పడుతూ ఉంటుంది. మొదటిసారి చూడటానికి ఆనందంగానే ఉంటుంది. కాని తరువాత తరువాత పరుమబోరు కొడ్తుంది. బయటకు వెళ్ళాలంటే ఓ పది రకాల బట్టలు వేసుకుని వెళ్ళాలి. ఒంటి బరువుకంటే బట్టల బరువెక్కువ. కాని తప్పదు గదా! తిట్టుకుంటూనే పనులు చేసుకుంటూ ఉంటారు. ప్రకృతిని ఎవరు మార్చలేరుగదా!

ఇంటిపని చక్కపెట్టుకుని చలిగా ఉందికదా అని ఓ కప్పు టీ కలుపుకు తెచ్చుకుని కిటికీ అద్దాలలోంచి బయట ప్రకృతిని చూస్తూ త్రాగుతోంది డయానా. అంతలో కాలింగ్ బెల్ మ్రోగింది. 'ఎవరబ్బా ఈ సమయంలో వచ్చేది' అని టీ కప్పును టేబుల్ మీద పెట్టి తలుపు తీసింది. ఎదురుగా ఖీలా నిలబడివుంది.

"హాయ్! వ్హాటే సర్‌ప్రైజ్" అంటూ లోపలకి ఆహ్వానించింది డయానా. 'ఏమిటి విశేషం' అంటూ కిచెన్‌లోకి వెళ్ళి మరొక కప్పు టీ తెచ్చి ఖీలాకిస్తూ సోఫాలో కూర్చుంది డయానా

"నథింగ్. చాల రోజులైంది కదా అని బయలుదేరాను"

"ఆ! ఆ! పిల్లలు స్కూలుకి వెళ్ళారా?"

"ఆ! వాళ్ళకిప్పుడు సెకండ్ టెర్మ్ పరీక్షలు జరుగుతున్నాయి"

"ఇప్పుడు నీ ఆరోగ్యం ఎలా ఉంది?"

"పర్వాలేదు. కొద్దిగా నీరసం ఉంది. మందులింకా తీసుకుంటున్నాను"

"డేవిడ్ ఊరునుండి వచ్చాడా?"

"ఆ!" అంది ముక్తసరిగా.

తరువాత యిద్దరూ చాలాసేపు మాట్లాడుకున్నారు. కాసేపు క్రొత్త మ్యూజిక్ రికార్డ్లుంటే పెట్టుకుని విన్నారు. మధ్యలో ఏదో గుర్తుకు వచ్చినదానిలా నెమ్మదిగా,

"ఖీలా! నిన్నో విషయం అడుగుతాను చెప్తావా?" అని అడిగింది.

"ఏమిటిది?"

"డేవిడ్ నిన్ను బాగా చూసుకుంటాడా? ఇలా అడుగుతున్నానని ఏమీ అనుకోకు" అని అడిగింది డయానా. అనుకోని ఈ ప్రశ్నకు ఒక్కసారి షాక్ తిన్నట్లు డయానా వంక చూసింది ఖీలా.

"ఐ యామ్ సారీ! అడగకూడనిది అడిగానా?" అని నొచ్చుకుంది డయానా.

"నో! నో! నీకా సందేహం ఎందుకొచ్చింది?"

"ఆ! తరచు క్యాంపులు వెడుతూంటాడు. ఎప్పుడు యింట్లోఉన్నట్టు కనపడడు కదా! అందుకని అడిగాను" వివరించింది డయానా.

ఖీలా! నవ్వు మొహంతో "ఛా! అదేం లేదూ! డేవిడ్ చాల మంచివాడు. నన్ను బాగానే చూసుకుంటాడు" అని ఎటో చూస్తూ చెప్పింది ఖీలా.

ఇంతలో బ్రెంట్, గ్రేసీలు స్కూలు నుండి రావటంతో,

"ఇంక నేను వెడతాను. వచ్చి చాలా సేపయింది. పిల్లలు వచ్చే టైం కూడ అయింది అంటూ యింటికి బయలుదేరింది.

ఖీలాను పంపించి డేవిడ్ విషయంలో పొరపడ్డానేమో అనుకుంటూ పిల్లలకి సప్పర్ పెట్టడానికి లోపలకెళ్ళింది.

## 23

టైము నాలుగు గంటలవుతోంది. జెర్సీ చాలా అధునాతనంగా అలంకరించుకుంది. అరిటాకురంగు దుస్తులలో మిలమిల మెరిసిపోతోంది. స్వతహాగా అందంగా ఉన్న ఆమెకు ఆ బట్టలు, అలంకరణ యింకా అందాన్నిచ్చాయి. ఈ రోజు తన పుట్టిన రోజు. ఉదయం ఆఫీసుకి వెళ్ళేటప్పుడు సాయంకాలం పార్టీ ఉంది, తొందరగా యింటికి రమ్మనమని భర్తకు చెప్పింది.

పార్టీకి ఫ్రెండ్స్ అందర్నీ పిలిచింది. దానికి కావలసినవన్నీ హాలులో అమర్చింది. ఒక్కసారి తన అందాన్ని తృప్తిగా అద్దంలో చూసుకుంది. అందమైన భర్త, ముద్దులొలికే కొడుకు. తనకింకేం కావాలి? తన అదృష్టానికి తానే మురిసిపోయింది జెర్సీ. ఇంతలో బెల్ మ్రోగటంతో అప్పుడే స్టీవ్ వచ్చేశాడు అనుకుంటూ ఆనందంగా తలుపు తెరచింది.

కాని వచ్చింది స్టీవ్ కాదు. ప్రక్క అపార్ట్మెంట్లో ఉంటున్న 'సింథియా' వచ్చి 'వాళ్ళ ఫోన్ పాడైందని, మెకానిక్తో మాట్లాడటానికి ఫోన్ వాడుకుంటానని' జెర్సీని అడిగింది. జెర్సీ ఏమీ మాట్లాడలేక 'సరే' అంది. సింథియా ఫోన్ చేసుకుని థాంక్స్ చెప్పి వెళ్ళి పోయింది.

ఇంతలో ఫోన్ మ్రోగటంతో జెర్సీ ఫోన్ అందుకుంది.

"హలో! జెర్సీ స్పీకింగ్..."

"ఆయ్హనీ! నేను స్టీవ్ని మాట్లాడుతున్నాను. కోపగించుకోనంటే ఓ విషయం చెబుతాను"

"ఏమిటది?" అంటూ ముఖం చిట్లించింది జెర్సీ.

"నేను యింటికి తొందరగా రాలేక పోతున్నాను. సరిగ్గా బయలుదేరుదామని అనుకుంటుండగా మా ఆఫీసరు పిలిచి అర్జంటు వర్క్ అప్పగించాడు. బహుశా ప్రొద్దున్నే 'కింగ్స్టన్' వెళ్లాల్సిఉంటుంది. కొన్ని రిపోర్ట్స్ పూర్తిచేసుకుని రావాలి. రాత్రికి వచ్చేటప్పటికి లేటవుతుంది. ఐయామ్ సారీ హనీ! మనసులో రావాలని ఉన్నా రాలేకపోతున్నాను. నన్ను అర్థం చేసుకో ప్లీజ్" అని చెప్పాడు.

"................" కోపంతో ఊగిపోతూ వెంటనే ఠపీమని ఫోన్పెట్టేసింది జెర్సీ.

స్టీవ్ మనసు బాధతో విలవిల్లాడింది. ఏమి చేయలేని పరిస్థితి.

స్టీవ్ కూడ ఫోన్ పెట్టేశాడు.

స్టీవ్పై జెర్సీకి చాలా కోపం వచ్చింది. కోపంతో, ఉక్రోషంతో మనసు కుతకుత ఉడికి పోతోంది. ఫ్రెండ్స్ ఒక్కొక్కరే వస్తున్నారు. మనసుని అదుపులోకి తెచ్చుకుని నవ్వుముఖంతో వచ్చిన వాళ్లని ఆహ్వానించింది. స్టీవ్ ఏడి? అని అడిగిన వాళ్లకి ఏదో సర్ది చెప్పింది. స్టీవ్ వస్తాడేమోనని ఎనిమిది గంటలవరకు ఎదురు చూసి, యింకరాడు అని నిర్ధారణ చేసుకుని కేక్ని కట్ చేసింది. తరువాత కబుర్లతోను, ఛలోక్తులతోను కాలం గడచిపోయింది. పార్టీకి వచ్చిన వాళ్లందరూ వెళ్ళిపోయారు. పింకీ అలసిపోయి సోఫాలోనే నిద్రపోయాడు. జెర్సీ వికలమైన మనసుతో తన బెడ్ రూంలోకి వెళ్ళిపోయింది.

"ఇంక స్టీవ్ని క్షమించలేను. ఎన్నిసార్లు తను డిసప్పాయింట్మెంట్ అయింది. భార్య, బిడ్డలు అక్కరలేని మనిషితో సంసారం చేయటం కష్టం. ఓ ముద్దు ముచ్చట లేదు. మిగతా రోజులెలా ఉన్నా కనీసం తన బర్త్డే రోజున సమయానికి వస్తాడని

ఆశించింది. తనకూ ఓ మనసుందని, అది తన కోసం ఎదురుచూస్తుందని అస్సలు గుర్తించడు. ఎంతసేపు ఆఫీసు, వర్క్ తప్ప మరో ధ్యాసలేదు. ఈ మధ్య స్టీవ్ లేకుండా రెండు మూడు పార్టీలకి వెళ్ళవలసి వచ్చింది. తనకి ఎంత అవమానంగానో తోచింది. అందరూ తనని వింతగాను, అవమానంగాను చూస్తున్నట్లు తోచింది. తనని ఈ మధ్య ప్రేమగా చూడటం కూడా లేదు. ఏమీ పట్టించుకోవటం లేదు. ఏదిఏమైనా సరే'' అని బాగా ఆలోచించి జెర్సీ ఓ నిర్ణయానికొచ్చింది.

*

అర్థరాత్రి ఒంటిగంటదాటుతుండగా స్టీవ్ తలుపులు తెరుచుకొని లోపలకొచ్చాడు. ఇల్లంతా నిశ్శబ్దంగా, చీకటిగా ఉంది. హాల్లో లైటు వేసాడు. కుర్చీలు, టేబుల్స్ వాటిమీద వస్తువులు చిందర వందరగా పడిఉన్నాయి. సోఫాలో అస్తవ్యస్తంగా పడుకొని నిద్ర పోతున్న పింకీని చూసాడు. మనస్సు చివుక్కుమంది. వెంటనే వాణ్ణి లేవదీసి వాడి బెడ్ రూంలో పడుక్కోబెట్టాడు. తన రూంలోకి వెళ్ళి బట్టలు మార్చుకుని కిచెన్‌లోకి వచ్చాడు. ఆకలిగా ఉన్నా తినాలనిపించలేదు. కొద్దిగా డ్రింక్ తీసుకుని జెర్సీ బెడ్ రూంలోకి వెళ్ళాడు. జెర్సీ బట్టలన్నా మార్చుకుండా నిద్రపోతోంది. నెమ్మదిగా ఆమె దగ్గరకు వెళ్ళి,

"హనీ... హనీ..'' అని పిలిచాడు.

ఆమెలో కదలిక లేదు.

మళ్ళీ పిలిచాడు స్టీవ్.

ఆమె "ఊఁ... ఊఁ...'' అంటూ కోపంగా అటునుండి యిటు తిరిగి పడుకుంది.

ఆమె ప్రక్కన కూర్చుంటూ,

"ఐ యామ్ వెరీ సారీ డార్లింగ్. అనుకోకుండా అర్జంటు కాగితాలు పూర్తి చేయవలసి వచ్చింది. నాతోపాటు మా ఆఫీసరు, యింకా కొంత మంది ఉండిపోవల్సి వచ్చింది. ఎంత తొందరగా పూర్తిచేసి వచ్చేద్దామన్నా వీలుపడలేదు. నన్ను క్షమిస్తావ్ కదూ'' అని ఆమెకి తన బాధను చెప్పుకున్నాడు.

కాని స్టీవ్ మాటలు విందోలేదో గాని జెర్సీ నిద్రపోతూనే ఉంది. ఆమె వద్దనుండి ఎటువంటి సమాధానం రాకపోయేసరికి స్టీవ్ తన రూంలోకి వెళ్ళిపోయాడు.



## 24

తూర్పు తెల్లగా తెల్లారిపోయింది. అలసిన శరీరం యింకా కళ్ళు విప్పలేదు. అరమోడ్పులుగానే ఉన్నాయి. కిటికీలోంచి వెలుతురు గదిలోకి ప్రవేశిస్తోంది. ఒక్కసారి ఆ మేను అట్నుంచి ఇటు వత్తిగిలింది. నెమ్మదిగా కళ్ళు తెరచింది. టైం ఎంతయిందా అని వాచీ వంక చూసాయి ఆ కలువలు. 'ఓ మైగాడ్' అంటూ జెర్సీ ఒక్క ఉదుటున మంచంపై నుండి లేచింది. చెప్పులు కాళ్లకు వేసుకుంటూండగా ఆమె కళ్ళు మంచం ప్రక్కనున్న టీ పాయ్ మీదున్న వస్తువుపై పడ్డాయి. కానీ నిర్లక్ష్యంగా చూపులు మరల్చుకుని గది బయటకు వచ్చి వాష్ రూంలోకి వెళ్ళి మొహం కడుక్కుని కాఫీ కలుపుకుని, తన రూంలో మంచంపై కూర్చుని త్రాగుతోంది. టీపాయ్ మీదున్న వాటిని ఒక్కసారి పరికరించింది. గిఫ్ట్‌గా అలంకరించిన అందమైన అట్టపెట్టెలో ఏముందా అని మూత తెరచి చూసింది జెర్సీ. అందులో ఒంటిరాయి పొదిగిన వజ్రపుటుంగరం అందంగా మెరుస్తోంది. 'హు! మనిషి, మనసులేనప్పుడు ఇవన్నీ ఎందుకు?' అని దానిని అక్కడే పెట్టేసింది. అక్కడే ఒక తెల్లని కవరు కూడా ఉంది. దానిని విప్పి చదవసాగింది.

మైడియర్ హనీ!

నేను రాత్రిరావటం చాలా ఆలస్యమైంది. అప్పటికి నీవు పార్టీ హడావుడివల్ల అలసి నిద్రపోతున్నావ్. రెండు మూడుసార్లు నిన్ను లేపడానికి ప్రయత్నం చేసాను. కాని నా ప్రయత్నం విఫలమే అయింది. నేను ఆఫీసుపని మీద 'కింగ్‌స్టన్' వెళ్ళవలసిఉంది. నేను వెళ్ళే టైముకి నీవు నిద్ర లేస్తావో లేవవో అని ఈ ఉత్తరం వ్రాసి బల్లమీద పెడుతున్నాను. రెండురోజుల్లో వచ్చేస్తాను. కోపగించుకోకు. నన్నపార్థం చేసుకోకుండా క్షమించగలవని ఆశిస్తున్నాను. పింకీ జాగ్రత్త. వాడు రాత్రి హాలులోనే నిద్రపోయాడు. మరి ఉంటాను. బై...!

ఇట్లు
ముద్దులతో నీ స్టీవ్.

ఉత్తరం చదవటం ముగించిన జెర్సీ కోపంతో చేతిలో ఉన్న కాఫీ కప్పు నేల కేసి కొట్టింది. పళ్ళు పటపటా కొరికింది. 'డామిట్' అంటూ గట్టిగా అరచింది. అసలే కోపంలో ఉన్న తనకి ఈ ఉత్తరం యింకాస్త ఎక్కువ చేసింది. 'పింకీని జాగ్రత్తగా చూసుకోవాలిట. ఇక నుండి నాకు ఏ అవసరము లేదు. ఎవరు ఎలా పోతే నాకేం? ఎవర్ని గురించి ఎవరు పట్టించుకోనవసరంలేదు. నా దారి నాది. ఈ

రోజు నుండి ఈ యింటికి నాకు ఎటువంటి సంబంధం లేదు. గుడ్ బై' అనుకుంటూ తనకి సంబంధించిన వస్తువుల్ని, బట్టల్ని సూట్‌కేసులో సర్దుకుని పింకీతో కలసి యింట్లోంచి బయటకు వెళ్ళిపోయింది.

## 25

ఒకరోజు డయానా మార్కెట్టు నుండి యింటికి వస్తుంటే దారిలో జాన్ కనపడ్డాడు.

"హలో జాన్! హౌ ఆర్ యూ?" అంటూ పలకరించింది డయానా.

"ఫైన్ ఆంటీ!"

"మమ్మీ ఆరోగ్యం ఎలా ఉంది? ఈ మధ్య తెలుసున్న స్నేహితులు టోరొంటో నుండి వచ్చారు. అందుకనే మమ్మీని కలవటం పడలేదు. రెండు మూడుసార్లు రింగ్ చేసాను. కాని ఆ సమయంలో మమ్మీ యింట్లో లేనట్టున్నారు"

"అవును ఆంటీ! మమ్మీ ఆస్పత్రిలో ఉంది. వారం రోజుల బట్టి ఒంట్లో బాగోటంలేదు. ఒక రోజు సీరియస్‌గా ఉంటే ఆస్పత్రిలో జాయిన్ చేయవలసి వచ్చింది" అంటూ బాధగా చెప్పాడు.

"అరె! అలాగా! నాకు తెలియనే తెలియదు" అని అంటూండగానే యిల్లు వచ్చేయటంతో 'లోపలికి రా! కాసేపు కూర్చుని వెడుదువు గాని' అంటూ తలుపు తాళం తీసి లోపలికు నడిచింది డయానా. జాన్‌కూడా ఆమెని అనుసరించాడు.

జాన్‌ని సోఫాలో కూర్చోమని లోపలకు వెళ్ళి, ఒక ప్లేటులో కేక్ , గాజుగ్లాసులో జ్యూస్ తెచ్చి యిచ్చింది. జాన్ మొహమాటంతో వద్దు ఆంటీ అన్నాడు.

"పర్వాలేదు. తీసుకో" అని డయానా బలవంతం చేసింది. జాన్ కేక్ ముక్క తీసుకుని తినసాగాడు.

"అసలు మమ్మికి ఏమైంది? జ్వరమా?" అని జాన్‌ని నెమ్మదిగా మాటల్లోకి దింపింది డయానా.

"లాస్ట్‌వీక్ మేము స్కూలు నుండి వచ్చేసరికి మమ్మీ సోఫాలో పడిపోయి ఉంది. నుదుటి మీంచి రక్తం కారుతోంది. మాకు ముందు ఏం జరిగిందో అర్థం కాలేదు. ఇంట్లో వస్తువులన్నీ చిందర వందరగా పడిఉన్నాయి. మమ్మీ మాట్లాడలేని స్థితిలో ఉంది. ఒంటిమీద బెల్టుతో కొట్టిన దెబ్బల గుర్తులున్నాయి. డాడీ యింట్లో ఉన్నారేమోనని చూసాము. కాని ఎక్కడా ఆయన జాడలేదు. వెంటనే మాకు ఏం చేయాలో తోచలేదు. స్టేసీ మీకు ఫోన్ చేసింది. కాని ఆ సమయంలో మీ ఫోన్ ఎంగేజ్‌లో ఉంది. వెంటనే అంబులెన్స్‌కి ఫోన్ చేసాం. వాళ్ళు వచ్చి మమ్మీని ఆస్పత్రికి తీసుకు వెళ్ళారు. వెంట మేము కూడా వెళ్ళాము. డాక్టరు వెంటనే మమ్మీకి తగిలిన గాయానికి కట్టుకట్టి, సెలైన్ ఎక్కించారు. ఆ మర్నాటి నుండి జ్వరం బాగా వచ్చింది. ఇంకా ఓ వారం రోజులు ఆస్పత్రిలో ఉండాలన్నారు. రోజూ స్టేసీ, నేను వెళ్ళి చూసి వస్తున్నాం" అని చాల బాధగా చెప్పాడు.

"ఓహ్! ఐయామ్ వెరీ సారీ జాన్" అంటూ "జాన్! నువ్వు ఏమీ అనుకోకు. నేను ఓ విషయం అడుగుతాను" అని అడిగింది.

"ఏంటి ఆంటీ!"

"మమ్మీకి డాడీకి మధ్య మనస్పర్థలు ఏమైనా ఉన్నాయా?"

"................."

"పర్వాలేదులే జాన్! ఏదైనా ఉంటే చెప్పు. నేనేమైనా సహాయం చేయగల్గితే చేస్తాను"

"ఆంటీ!" అంటూ ఒక్కసారి కళ్ళ నీళ్ళు పెట్టుకున్నాడు.

"ఐ యామ్ సారీ జాన్! నిన్ను అనవసరంగా బాధపెట్టానేమో! చెప్పకూడనిదైతే చెప్పొద్దులే" అంది.

"నో ఆంటీ! నో! అదేం లేదు. మీరు ఇంత ప్రేమగా మాట్లాడుతుంటే ఆనందమో, బాధో చెప్పలేకుండా ఉన్నాను " అంటూ కళ్ళు తుడుచుకున్నాడు.

"నువ్వేం కంగారు పడకుజాన్. షీలా తొందరలోనే కోలుకుంటుందని ఆశిస్తున్నాను. షీలా వచ్చేంతవరకు మీరు మా యింట్లోనే ఉండండి. ఒక్కళ్ళూ యింట్లో ఉంటే లేనిపోని ఆలోచనలు వస్తాయి. అయినా నువ్వు స్కూలుకి వెళ్ళేటప్పుడైనా మా యింటికి వచ్చి చెప్పవలసింది. మీకు ఏం అవసరమొచ్చినా నన్ను అడగండి" అంటూ అతని ప్రక్కన కూర్చుని ధైర్యం చెప్పింది డయానా.

"అలాగే ఆంటీ! మీతో మాట్లాడుతుంటే మమ్మీతో మాట్లాడుతున్నట్లే ఉంది. మమ్మీ చాల మంచిది ఆంటీ! అందరు మమ్మీలు మంచివారే కాని మా మమ్మీలాంటి మమ్మీ ఎక్కడా ఉండదు. డాడీ అంటే మమ్మీకి చాలా యిష్టం. కాని డాడీ మమ్మీని ఎప్పుడూ నిర్లక్ష్యం చేసేవారు. కఠినంగా మాట్లాడేవారు. సాధారణంగా యింటిపట్టున ఉండరు. వారానికో, పదిరోజులకో యింటికి వచ్చేవారు. ఆ ఉన్న రెండు రోజులైనా సఖ్యతగా ఉండేవారు కాదు. మమ్మీని చాల క్రూరంగా చిత్ర హింసలు పెట్టేవారు. నోటికి వచ్చినట్లు తిట్టడం, కొట్టడం. వాటినన్నిటినీ మౌనంగా భరించేది. మేము అడ్డుపడితే అదే వరుసలో మాకు కూడ

దెబ్బలు తగిలేవి. ఆయనతో కలసి ఉండాలంటే ప్రాణ సంకటంగా ఉండేది. నాకు ఈ చదువు అయిపోయిన తరువాత ఎక్కడైనా ఉద్యోగం వస్తే అప్పుడు మమ్మీని నా దగ్గరే ఉంచుకుంటాను. డాడీ ఉన్న రెండు రోజులు యిల్లు నరకంగా ఉంటుంది. ఆయన వస్తారని ఆయనకి యిష్టమైనవి ప్రేమగా తయారుచేసి ఉంచుతుంది. డాడీ రాకకోసం వేయి కళ్ళతో ఎదురుచూస్తుంది. కాని ఏం లాభం ఆయన త్రాగి వచ్చి చేసే రభసలో అవన్నీ బూడిదలో పోసిన పన్నీరవుతాయి'' అని తన మనసులోని బాధనంతా డయానాతో చెప్పాడు.

"నిన్ను చాల బాధ పెట్టి ఉంటాను జాన్. సారీ! నేను రేపు మమ్మీని చూడటానికి ఆస్పత్రికి వెడతాను'' అని వివరాలు అడిగి తెలుసుకుంది డయానా.

"ఇంక వెడతాను ఆంటీ! స్టేసీ ఈ పాటికి యింటికి వచ్చేసి ఉంటుంది. ఏమిటో బాధలో ఏమేమో మాట్లాడేసాను'' అంటూ సోఫాలోంచి లేచాడు జాన్.

"రాత్రికి నువ్వూ స్టేసీ మా యింటికి భోజనానికి రండి'' అని ప్రేమగా అంది డయానా.

"అలాగే ఆంటీ!'' అంటూ ఇంటికి బయలుదేరాడు జాన్.

*

రాత్రి భర్త వచ్చాక విషయం అంతా పూసగ్రుచ్చినట్లు స్కాట్‌కి చెప్పింది డయానా. అంతా విన్న స్కాట్, "అంత దుర్మార్గుడా డేవిడ్, పైకి ఎంతో మర్యాదగా, పెద్ద మనిషిలా ఉంటాడే. వాళ్ళిద్దరూ చాల అన్యోన్యమైన జంటఅని అనుకున్నానే!'' అని ఆశ్చర్యపోయాడు.

"ఈ మగవాళ్ళకి ఎప్పుడు ఎటువంటి బుద్ధులు పుడతాయో ఎవరికి తెలుసులెండి. పైకి మంచిగా కనపడుతూనే తడిగుడ్డతో గొంతులు కోస్తారు. బయటికి తేనె పూసిన కత్తుల్లా కనపడతారు'' అని ఆవేశంగా అంది డయానా.

"ఏమిటి అటుతిరిగి యిటుతిరిగి మగజాతి మీద పడ్డావ్? అయినా అందరూ ఒకలా ఉంటారేమిటి?'' అంటూ తన ధోరణిలో మాట్లాడాడు స్కాట్.

"స్కాట్!''

"ఊ! ఏమిటి?''

"మనం షీలా విషయంలో ఏమన్నా సహాయం చేయగలమా? పాపం! ఆ పిల్లల్ని చూస్తే జాలేస్తోంది!''

"ఇది వాళ్ళ కుటుంబ వ్యవహారం. ఇందులో మనం జోక్యం చేసుకోవటం అంత మంచిది కాదు. అయినా మనం మాట సహాయం చేయగలం కాని అంతకంటే ఏం చేయగలం?' అనుమానంగా చూస్తూ అన్నాడు.

"అలా అంటే ఎలా స్కాట్! మనం ఫామిలీ ఫ్రెండ్స్. అందులోనూ తనకు, నాకు చాల స్నేహం ఉంది కూడాను''

"మరి అంత స్నేహం అయితే ఎప్పుడన్నా ఈ విషయం నీకు చెప్పిందా?''

"భర్త త్రాగుబోతని, కొడతాడని, తిడతాడని ఏ స్త్రీ పైకి చెప్పుకుంటుంది? తనలో తను ఎంతలా కుమిలిపోయిందో? చాల వరకు ఓర్పుతోనే సంసారం చేస్తుంది''

"దీన్ని గురించి బాగా ఆలోచించాలి. మనం చేయగల్గింది చేద్దాం'' అన్నాడు స్కాట్.

ఆ రాత్రి జాన్, స్టేసీ యిద్దరూ స్కాట్ యింటికి భోజనానికి వచ్చారు. అందరు కలసి కబుర్లు చెప్పుకుంటూ డిన్నర్ ముగించారు. మధ్య మధ్యలో స్కాట్ జోకులతో ఆ పిల్లల్ని నవ్వించాడు. వాళ్ళు తమ బాధని మరచిపోయి ఉన్న కాసేపు హేపీగా గడిపారు.

ఆ తర్వాత డయానా వాళ్లని తమ యింట్లోనే పడుక్కోమంది. కాని వాళ్ళు "లేదు ఆంటీ! ప్రాజెక్ట్ వర్క్ ఉంది. మా యింట్లోనే పడుక్కుంటాం. రాత్రి షీలా ఫోన్ చేయొచ్చు'' అంటూ వాళ్ళింటికి వెళ్ళిపోయారు.

డయానా వాళ్ళ వైపు ప్రేమగా, జాలిగా చూసింది.

## 26

స్టీవ్ అనుకున్న దానికంటే ఓ రెండు రోజులు ఆలస్యంగా 'కింగ్‌స్టన్' నుండి వచ్చాడు. ఇంట్లో ఎవరూ ఉన్న అలికిడి లేదు. ఈ టైంలో జెర్రీ పింకీ యింట్లోనే ఉండాలి. మరి ఎక్కడికి వెళ్ళారో! బహుశా ఎవరింటికైనా పార్టీకి వెళ్ళి ఉండవచ్చు అని అనుకున్నాడు. ప్రయాణం చేసి రావటంవలన శరీరం చాల అలసటగా ఉంది. స్నానం చేస్తే సగం చికాకు పోతుందని బట్టలు మార్చుకుని బాత్ రూంలోకి వెళ్ళాడు. 'స్నానం సగం బలం' అన్న సామెత ఏ భాషలోదైనా అందరికీ వర్తిస్తుంది. ఇది నిజమే అన్పించింది స్టీవ్‌కి.

నిన్నటితో వాళ్ళ ఆఫీసరు యిచ్చిన వర్క్ పూర్తయి పోయింది. ఇంక కొన్నాళ్ళు మనశ్శాంతిగా ఉండొచ్చు. నిజంగా ఎంత భయపడ్డాడో? అనుకున్న టైంలో పని పూర్తవుతుందో లేదో అని ఎంత కంగారు పడ్డాడో! తను పడ్డ శ్రమని,

బాధని ఈ రోజు జెర్సీకి మనస్ఫూర్తిగా చెప్పుకోవాలి. తనని నిర్లక్ష్యం చేస్తున్నానని తను ఎంత బాధ పడిందో! తను ఆ వర్క్ పూర్తి చేయకపోతే ఉద్యోగం పోయే ప్రమాదం ఉంది మరి. మళ్ళీ మంచి జాబ్ దొరకాలంటే ఎంత అవస్థ పడాలి. హూప్స్! ఊహకైనా అటువంటి ఆలోచన వద్దు అనుకుంటూ స్నానం ముగించాడు. బాగా ఆకలిగా ఉంది. ఏదైనా తినటాని కుందేమోనని ఫ్రిజ్ తెరిచాడు. లోపల అంతా ఖాళీగా ఉంది.

"ఇదేమిటి? ఏవీ లేకుండా ఖాళీగా ఉంది. మనుష్యులు లేని యింట్లోని ఫ్రిజ్‌లా! లేకపోతే జెర్సీ, పింకీ షాపింగ్‌కి వెళ్ళి ఉంటారు'' అని అనుకున్నాడు స్టీవ్.

టైము పదకొండు గంటలు దాటింది. జెర్సీ, పింకీలు ఎంతకీ రాకపోయే సరికి స్టీవ్‌కి ఏదో అనుమానం వచ్చింది. డేవిడ్ వాళ్ళింటికి ఫోన్ చేసి కనుక్కున్నాడు. కాని అక్కడ లేరు. పోనీ స్కాట్ వాళ్ళ యింటికి వెళ్ళారేమోనని అక్కడికి ఫోన్ చేసాడు. కాని అక్కడ నుండి కూడా లేరనే సమాధానం వచ్చింది.

స్టీవ్‌కి ఏం చేయాలో తోచలేదు. మేడమీదకి వెళ్ళి జెర్సీ రూంలోకి అడుగుపెట్టాడు. గదంతా చీకటిగా ఉంది. లైటు వేసాడు. గదంతా వెలుగు నిండుకుంది. ఒక్కసారి గదంతా పరికించాడు. చెల్లాచెదురుగా ఉన్న పక్క, పగిలిన టీకప్పు, సాసరు ముక్కలు, కార్పెట్టు పై ఒలికిన టీ మరకలు చూసిన స్టీవ్‌కి అంతా అయోమయంగా ఉంది. ఏం జరిగిఉంటుందో ఊహకందటం లేదు. అతను నెమ్మదిగా టీపాయ్ దగ్గరకు వెళ్ళాడు. తాను జెర్సీకిష్టమని తెచ్చిన పసుపురంగు గులాబీల బోఖే, అట్టపెట్టెలోని ఉంగరం ఎలా పెట్టినవి అలాగే ఉన్నాయి. స్టీవ్‌కి తల తిరిగిపోతోంది. తలంతా దిమ్ముగా ఉంది. తను స్నానం చేస్తూ ఏవేవో ఊహించుకున్నాడు. ఆ ఆలోచనలన్నీ యిప్పుడు చెల్లా చెదురైపోయాయి.

"పోలీసు రిపోర్ట్ యిద్దామా'' అని కాసేపు అనుకున్నాడు స్టీవ్. కాని కారణం ఏమిటో తెలీకుండా ఏమని యివ్వాలి? లేనిపోని గొడవ! కొంచెం ఓపిక పట్టి చూద్దాం'' అనుకున్నాడు.

అతని మనస్సంతా లేనిపోని ఆలోచనలతో అల్లకల్లోలంగా తయారైంది.

## 27

నాలుగైదు రోజుల తరువాత స్టీవ్‌కి ఒక ఉత్తరం వచ్చింది. అది విప్పి చదవసాగాడు.

స్టీవ్,

నేను యిల్లు విడిచి మరొక చోట ఉంటున్నాను. ఈరోజు నుండి నీకు నాకు మధ్య ఎటువంటి సంబంధం లేదు. ఉండదు. నీతో కలిసి ఉండటం నాకిక కుదరదు. నీ ప్రవర్తన నాకు నచ్చటం లేదు. చాలసార్లు నీ తప్పుల్ని క్షమించగల్గాను. బహుశా నీకు అవి తప్పులుగా అన్పించక పోవచ్చు. కాని నేను మాత్రం యింక సర్దుకోలేను. పింకీని నాతోనే తీసుకువెళ్ళాను. నీకు విడాకులివ్వడానికే నేను నిశ్చయించుకున్నాను. ఎటువంటి విషయంలోను నేను నీకు సంజాయిషీ చెప్పుకోనవసరం లేదు. తొందరలోనే నా లాయరు ద్వారా నీకు విడాకుల నోటీసు పంపిస్తాను. పింకీ నాతోనే ఉంటాడు.

ఓ.కే. గుడ్ బై!....

ఇట్లు,
జెర్సీ.

ఉత్తరం చదివిన స్టీవ్‌కి ఒక్కసారి భూమి తలక్రిందులైనట్లు అన్పించింది. ఒకటికి రెండుసార్లు చదువుకున్నాడు ఆ ఉత్తరాన్ని. తమచేసిన తప్పేమిటి? కావాలని తనేమి చేయలేదే! జెర్సీతో మాటవరసకైనా, సరదాకైనా ఎప్పుడు పోట్లాడలేదు. అతని మనసంతా వికలమైపోయింది. పింకీ కూడ దూరమైపోతున్నాడు. ఉత్తరంలో జెర్సీ అడ్రసుకూడ లేదు. ఉత్తరాన్నంతా ఒక్కసారి పరిశీలనగా చూసాడు. అదృష్టవశాత్తు ఉత్తరం చివర్లో ఫోన్ నెంబర్ ఉంది. థాంక్ గాడ్! అనుకున్నాడు. వెంటనే ఆ నెంబరుకి డయల్ చేశాడు. అవతలి కంఠం హలో! అంది.

"హలో! పింకీ!''

"హాయ్ డాడీ! ఎక్కడ నుండి మాట్లాడుతున్నారు?'' అని పింకీ ఆనందంగా అడిగాడు.

"ఇంట్లో నుంచే మాట్లాడుతున్నాను''

"ఊరునుండి ఎప్పుడు వచ్చారు?''

"నేను వచ్చి మూడు రోజులైంది''

"మరి మమ్మల్ని చూడటానికెందుకురాలేదు?''

"హనీ! అడ్రసు తెలియలేదు. కాని ఫోన్ నెంబరుంది ఉత్తరంలో. వెంటనే ఫోన్ చేసాను. నాకు అడ్రసు చెప్పు. వెంటనే బయలుదేరి వస్తాను'' అని ఆత్రంగా అన్నాడు.

"ఒకే డాడీ! అడ్రసు నోట్ చేసుకోండి'' అంటూ చెప్పసాగాడు. 271,

శాండీహిల్స్, అపార్ట్మెంట్ నెంబరు 4. ఒకేనా డాడీ!"

"థాంక్యూ హనీ! నేను యిప్పుడే బయలుదేరుతున్నాను. బై!" అంటూ స్టీవ్ ఫోన్ పెట్టేసాడు.

వెంటనే బట్టలు మార్చుకుని, కారు తాళాలు తీసుకుని బయలుదేరాడు స్టీవ్.

పింకీ యిచ్చిన అడ్రసు ప్రకారం ఆ నెంబరున్న కాలింగ్ బెల్ నొక్కాడు స్టీవ్.

తలుపులు తెరుచుకున్నాయి. ఎదురుగా పింకీ నిలబడి ఉన్నాడు.

"డాడీ!" అంటూ తండ్రిని వాటేసుకున్నాడు.

"హాయ్ పింకీ! హౌఆర్యూ?" అంటూ వాణ్ణి ముద్దెట్టుకున్నాడు స్టీవ్.

"కమాన్ డాడీ!" అంటూ తండ్రిని లోపలకు తీసుకెళ్ళాడు. ఇద్దరూ సోఫాలో కూర్చుని కబుర్లు చెప్పుకుంటున్నారు.

"మమ్మీ ఎన్ని గంటలకొస్తుంది?" అని స్టీవ్ కొడుకుని అడిగాడు.

"ఏడు గంటలకొస్తుంది డాడీ! నన్ను స్కూలు నుండి యింటివద్ద దింపి షాపింగ్కి వెళ్ళింది డాడీ! మీరు యిక్కడే ఉంటారు కదూ డాడీ!" అంటూ అమాయకంగా అడిగాడు.

"లేదు పింకీ!" మమ్మీ కోపంగా ఉత్తరం వ్రాసింది. నాతో కలసి ఉండటం ఆమెకి యిష్టం లేదుట. ఇక నుండి నువ్వు మమ్మీతోనే కలసి ఉండాలి. నేను ఒంటరిగా ఒక్కడిని ఆ యింట్లోనే ఉండాలి"

"నో డాడీ! మీరు లేకుండా నేనుండలేను డాడీ! నేను కూడా మీతోనే ఉంటాను. ఇన్ని రోజులబట్టి మీరు ఎప్పుడు వస్తారా అని ఎదురు చూస్తున్నాను. మమ్మీని అడిగితే యింకరారు అని కోపంగా సమాధానం చెప్పింది. అప్పుడు నాకెంతో ఏడుపొచ్చింది. ప్లీజ్ డాడీ నన్ను యిక్కడ వదిలి వెళ్ళొద్దు" అంటూ ఏడ్వటం మొదలెట్టాడు పింకీ.

"లేదు పింకీ ఏడవకు. నిన్నొదిలి నేను మాత్రం ఉండగలనా? నీ పుస్తకాలు, బ్యాగ్ తెచ్చుకో! మన యింటికి వెడదాం" అంటూ వాడి కన్నీళ్ళు తుడిచాడు.

"మరి మమ్మీకి చెప్పాలి కదా?" అని అనుమానంగా చూసాడు స్టీవ్.

"ఇప్పుడు వద్దు డాడీ! యింటికి వెళ్ళాక ఫోన్ చేద్దాం. అప్పుడు మమ్మీకూడా మన కోసం మన యింటికి వచ్చేస్తుంది" అని నవ్వుతూ అన్నాడు పింకీ.

"లేదు హనీ! మమ్మీకి కోపం వస్తే తొందరగా తగ్గదు. అయినా మమ్మీకి లెటర్ వ్రాసి పెడ్తాను" అంటూ ఒక కాగితం మీద పింకీని తీసుకువెడుతున్నట్లు జెర్సీకి వ్రాసి టేబుల్ మీద పెట్టి, తరువాత పింకీతో కలసి యింటికి బయలుదేరాడు.

## 28

షీలాని చూడటానికి ఆస్పత్రికి వెళ్ళింది డయానా. ఆస్పత్రిలో గదులన్ని చాల ప్రశాంతంగా, నీట్గా ఉన్నాయి. జాన్ యిచ్చిన అడ్రసు ఒకసారి చూసుకుని **98** నెంబరు గదిలోకి వెళ్ళింది. డయానా వెళ్ళేటప్పటికి స్టేసీ తల్లి దగ్గరే ఉంది. డయానాని చూడగానే హలో! ఆంటీ! అంటూ పల్కరించింది.

షీలా మంచం మీద నీరసంగా పడుక్కొని ఉంది. మనిషి బాగా చిక్కి పోయింది. కళ్ళు లోతుకుపోయాయి. డయానాని చూసి చిన్నగా నవ్వుతూ కుర్చీలో కూచోమని సైగ చేసింది షీలా 'ఇప్పుడే వస్తా' నంటూ స్టేసీ గది బయటకు వెళ్లింది.

డయానా కుర్చీలో కూర్చుంటూ "ఐయామ్ సారీ షీలా! నీకు ఒంట్లో బాగోలేదని నిన్నటిదాకా తెలియలేదు. విషయం తెలిసిన దగ్గర్నుంచి ఎప్పుడు నిన్ను చూద్దామా అని ఒకటే ఆత్రుత" అంటూ షీలాని పరిశీలనగా చూసింది. ముఖం అంతా పీక్కుపోయి వుంది. చేతులమీద కమిలిన చారికలు, ముఖం మీద కాలినట్లున్న చిన్న చిన్న మచ్చలు కనపడ్డాయి. షీలా ఒకసారి దుప్పటి సర్దుకున్నట్లు సర్దుకుని చేతుల్ని దుప్పట్లోకి పెట్టుకుంది.

"థాంక్స్ డయానా! ఏదో అనుకోకుండా జరిగిపోయింది.

"ఇప్పుడెలా ఉంది ఒంట్లో?"

"ఇది వరకటికన్నా ఇప్పుడు కొంచెం నయం!"

"అసలు ఏం జరిగింది?" అంటూ నెమ్మదిగా అడిగింది డయానా.

"ఏదో అంతా పీడకలలా జరిగిపోయింది"

"ఆ తలకు కట్టేమిటి?"

"......................"

"మౌనంగా ఉంటే లాభంలేదు షీలా, మనసు విప్పి నాతో చెప్పు. అదైనా నామీద నమ్మకం ఉంటేనే!"

"నో! నో! నీ మీద నమ్మకం లేకపోవటం ఏమిటి? నిజానికి నీవంటి స్నేహితురాలు ఉన్నందుకు నేనెంతో గర్వపడుతున్నాను. నీ గురించి జాన్ చెప్పాడు. నన్ను చూడటానికొచ్చి నా బాధని అర్థంచేసుకుందుకు ఇంకెవరు ప్రయత్నిస్తారు? అలా ఎవరుంటారు చెప్పు!!" సూటిగా చూస్తూ అంది షీలా.

"అది సరే గాని నీవు నన్ను మాటల్లో పెట్టి అసలు విషయాన్ని దాటేస్తున్నావ్. నాకు వివరంగా జరిగింది చెప్పు" అంటూ నొక్కి మాట్లాడింది.

ఇకతప్పదన్నట్లు డయానా చేతిని తన చేతిలోకి తీసుకుంటూ "ఏం చెప్పమంటావ్ డయానా! నేను చాల అదృష్టవంతురాల్నే అనుకున్నాను కొన్నాళ్ళు. కాని నిజానికి చాల దురదృష్టవంతురాల్ని. డేవిడ్ నేను ప్రేమించి, పెళ్ళి చేసుకున్నాం. నిజమే! నాకు డేవిడ్ అంటే చాల యిష్టం. వివాహానంతరం చాల రోజులు హేపీగానే గడచిపోయాయి. కాని రానురాను డేవిడ్‌లో ఏదో తెలియని మార్పు వచ్చింది. అప్పుడప్పుడు త్రాగి వచ్చేవాడు. కారణం లేకుండా గొడవ పెట్టుకునేవాడు. తరువాత యింటికి సరిగ్గా వచ్చేవాడు కాదు. కారణం అడిగితే చెప్పేవాడు కాదు. క్రమేపీ త్రాగి యింటికి వచ్చి కొట్టేవాడు. ఏదో తెలీని పైశాచికత్వం అతనిలో ప్రవేశించేది. కాలుస్తున్న సిగరెట్టుతోముఖం మీద కాల్చేవాడు. 'నీ ముఖానికివి ఎంత అందంగా ఉన్నాయో చూసుకో' అంటూ వికటంగా నవ్వేవాడు. ఒక్కొక్కప్పుడు బెల్టుతో కొట్టేవాడు. పిల్లలు భయపడి ఏడుస్తూంటే వాళ్ళని కూడా చావబాదే వాడు. ఇప్పుడు పెద్దవాళ్ళయ్యారు గాబట్టి అతను యింట్లో ఉన్నప్పుడు వాళ్ళు తమ గదిలోంచి బయటకు రారు. ఈ బాధలన్నీ ఓర్పుతో భరించేదాన్ని. ఒకప్పుడు కాకపోతే ఒకప్పుడైనా మారకపోతాడా అని ఆశించేదాన్ని. కాని ఆ ఆశకూడ నిరాశే అయింది. మొన్నకూడ ఓ వారం రోజుల తరువాత యింటికి వచ్చాడు. ముందు కొంతసేపు బాగానే ఉన్నాడు. కాని అంతలోనే కారణం లేకుండా గొడవపెట్టుకున్నాడు. విస్కీ త్రాగుతున్న గ్లాసుని నా మీదకి విసిరాడు. అది నా నుదుటికి తగిలి బ్రద్దలైంది. కసితీరా బెల్టుతో కొట్టాడు. అంతే!.... ఆ తరువాత ఏం జరిగిందీ నాకు తెలియదు. స్పృహ వచ్చేటప్పటికి ఆస్పత్రిలో బెడ్ మీదున్నాను. నువ్వు నన్ను చాలసార్లు అడిగావు. కాని నేను ఈ విషయాలన్ని ఎలా చెప్పను చెప్పు. అందుకే మౌనంగా ఉండేదాన్ని. కాని ఈ రోజు నీకు చెప్పుకునే అవకాశం వచ్చింది" అంటూ నీరసంగా చెప్పింది.

డయానా కళ్ళు వత్తుకుంటూ "ఇంతటి నరకాన్ని ఆ శాడిస్ట్ చేతుల్లో ఎలా భరించగల్గావ్ షీలా? అలాంటి మనిషితో నీవు యింకా జీవితాన్ని గడపాలనుకోవటం పెద్దపొరపాటు. నీ బాధని వింటూంటే నాకే గుండెతరుక్కుపోయింది. కళ్లారా చూస్తున్న పిల్లలు ఎంత తల్లడిల్లిపోయి ఉంటారు? ఇకనైనా నువ్వు మనసు మార్చుకుని అతనికి దూరం ఉండు. ఇలా చెప్పాల్సి వస్తున్నందుకు బాధగా ఉంది. కొత్తల్లో మీ యిద్దర్నీ చూసి చక్కని జంటని ఆనందపడే వాళ్లం. కాని ఇలా జరుగుతుందని కల్లో కూడ అనుకోలేదు. ఇక ముందు ఈ విషయంలో నువ్వు ఏదో ఒక నిర్ణయం గట్టిగా తీసుకోవాలి" అంది డయానా.

"ఏం చేయమంటావ్ డయానా? అతనంటే ఎంతో ప్రేమ నాకు. నీకు ఎలా వివరించి చెప్పమంటావ్? ఆ ప్రేమతోటే ఎటువంటి బాధనైనా యిన్నాళ్ళు భరించగల్గాను"

"సరే కాస్త ఆరోగ్యం చక్కబడనీ! తరువాత ఆలోచిద్దాం. మరి నేను వచ్చి చాలా సేపైంది. ఇంక వెడతాను" అంటూ లేచింది డయానా.

"చాల థాంక్స్ డయానా! నా మనసులోని బాధని నీకు చెప్పుకున్న తర్వాత నా మనస్సు కాస్త తేలిక పడింది" కృతజ్ఞతగా అంది షీలా.

"ఓకే! మళ్ళీ వీలుచూసుకుని వస్తాను. ఈ లోపల మనసు కుదుట పరచుకొని, పిల్లల కోసం, నీ కోసం ఒక సరియైన నిర్ణయానికిరా ! వస్తా! మరి" అంటూ ధైర్యం చెప్పి, శెలవు తీసుకుని ఇంటికి బయలుదేరింది డయానా.

## 29

పింకీని తీసుకుని యింటికొచ్చిన స్టీవ్ ఆ రాత్రి వాడికి చాలా కబుర్లు చెప్పాడు. వాడు మధ్యలో "డాడీ! మమ్మీ ఎందుకు వేరే యింట్లో ఉంటోంది?" అని అడిగాడు. దానికి సమాధానంగా,

"మమ్మీకి కోపం వచ్చింది. రేపు నేను వెళ్ళి తీసుకువస్తానులే" అని సర్దిచెప్పాడు స్టీవ్.

తరువాత చాల సేపటివరకు స్టీవ్‌కి నిద్ర పట్టలేదు. అతను జెర్సీ గురించే ఆలోచిస్తున్నాడు. ఒకరినొకరు ఎంతగా ప్రేమించుకున్నారు. ప్రాణంలో ప్రాణంగా కలిసిపోయారు. ఇద్దరికీ పిల్లలంటే చాల యిష్టం. పింకీ పుట్టిన తరువాత వాళ్ళిద్దర్నీ ఎంత అపురూపంగా చూసుకున్నాడు. తాను కావాలని, తెలిసుండీ ఎప్పుడు ఏ మాత్రం జెర్సీని నొప్పించలేదు. కాని అన్ని తెలిసుండీ తనకి యింతటి శిక్ష విధించటం బాగా లేదు. ఇంతకంటే నరకం వేరే లేదు.

తాను కష్టాలలో ఉన్నప్పుడు ఎంతటి ధైర్యాన్ని చెప్పేది. చీకటి నిండిన తన జీవితంలో వెలుగురేఖల్ని నింపింది. ప్రేమగా దగ్గరకు జేర్చి పసిపిల్లాడిలా తన్ను లాలించింది. అలాంటి జెర్సీ ఈనాడు తన జీవితాన్ని చీకటిమయం చేసి, ఒంటరిగా వదలి వెళ్ళిపోయింది. ఏమైనాసరే మళ్ళీ తన వెలుగుని, జీవన జ్యోతిని తిరిగి తెచ్చుకోవాలి" అని నిర్ణయించుకుని గట్టిగా కళ్ళు మూసుకున్నాడు.

ఆ మర్నాడు పింకీని స్కూలువద్ద దింపి, అటునుండి జెర్సీ యింటికి

వెళ్ళాడు. అప్పటికింకా జెర్సీ ఆఫీసుకి వెళ్లలేదు. బెల్ మ్రోగగానే తలుపు తీసి తన ఎదురుగా నిలబడ్డ స్టీవ్‌ని చూసిన జెర్సీ కళ్ళు కోపంగా "ఎందుకు వచ్చావ్?" అన్నట్లు చూశాయి.

"నీతో కొంచెం మట్లాడాలి హనీ! లోపలకు రావచ్చా?" అని స్టీవ్ దీనంగా అడిగాడు.

ఆమె అతనికి లోపలకి రావడానికి దారి యిచ్చింది. స్టీవ్ సోఫాలో కూర్చుంటూ, జెర్సీని కూడ కూర్చోమని సైగ చేశాడు.

ఆమె చికాకుగా వాచీవంక చూసుకుంటూ సోఫాలో కూర్చుంది.

"నీ ఉత్తరం అందింది. కానీ నా తప్పేమిటో కాస్త చెప్పు జెర్సీ!" అని నెమ్మదిగా బాధతో కూడిన గొంతుతో అడిగాడు.

ఆ మాటకు కోడె త్రాచులా రివ్వున లేస్తూ 'నేను ఎందుకు వచ్చేసానో నీకు నిజంగా తెలియదా? నేనంటే ఏమాత్రం ప్రేమ, గౌరవం ఉన్నా నా పుట్టినరోజు పార్టీకి ఎలాగోలా వచ్చేవాడివే. నీకు ఇరవైనాలుగు గంటలు ఆఫీసే. ఇక నుండి నువ్వు ముప్పై ఆరుగంటలుండవచ్చు. ఎవరు నిన్ను రమ్మనమని పిలవరు. నీకోసం ఎవరు ఎదురుచూడరు" అంది.

"అంతమాట అనకు హనీ! ప్లీజ్!" అంటూ బ్రతిమాలబోయాడు స్టీవ్.

"హనీ లేదు గినీ లేదు. ఇంక నేను నీతోఉండలేను. నాలో ఓర్పు సహనం నశించాయి"

"కనీసం పింకీ కోసమైనా కలసి ఉండలేవా?"

"పింకీని నా దగ్గరే ఉండేటట్లు చేసుకుంటాను"

"అయితే నీ నిర్ణయం మార్చుకోలేవా? నన్ను ఆఖరిసారిగా క్షమించలేవా?"

"నో! ఇంత జరిగాక, యింకా తెలుసుండీ మళ్ళీ ఆ పని చేయలేను. కొద్దిరోజులలో లాయరు నోటీసు పంపిస్తాను"

"జెర్సీ! నీవు కోపంలో తొందరపడుతున్నావ్. బాగా ఆలోచించుకో మరొకసారి"

"అన్నీ ఆలోచించుకునే యీ నిర్ణయానికొచ్చాను. నా నిర్ణయానికి తిరుగులేదు" అని అంటూ "నాకు ఆఫీసుకి టైం అయ్యింది. వెళ్ళాలి" అంటూ బ్యాగ్ సర్దుకోసాగింది.

స్టీవ్ మౌనంగా యింటిలోంచి బయటకు వచ్చాడు. జెర్సీ తలుపేసుకుని హై హీల్సు టకటకా శబ్దం చేస్తూ బయటకు వచ్చి కారు స్టార్ట్ చేసి వెనక్కిచూడనైనా చూడకుండా ఆఫీసుకి వెళ్ళిపోయింది.

తన ప్రయత్నం ఫలించనందుకు చింతిస్తూ, నిట్టూరుస్తూ స్టీవ్ ఆఫీసుకి బయలుదేరాడు.

## 30

షీలా ఆస్పత్రి నుండి యింటికి వచ్చేసింది. నెమ్మది నెమ్మదిగా ఆమె ఆరోగ్యం కోలుకుంటోంది. డయానా అప్పుడప్పుడు చూసి వెళ్తోంది. జాన్, స్టేసీలు తల్లిని ఎంతో జాగ్రత్తగా చూసుకుంటున్నారు. వాళ్ళిద్దరూ ఆమెకి రెండు కళ్ళు. వాళ్ళ మనసుకి బాధ కలగకూడదు. తండ్రిగా తన బాధ్యతలను డేవిడ్ నిర్వహించలేకపోయినా, తల్లీ తండ్రీ తానే అయి వాళ్ళని పెద్దవాళ్ళను చేసింది. ఇద్దరూ మంచిగా చదువుకుంటున్నారు. వాళ్ళని చూస్తుంటే తల్లిగా తనకెంత గర్వమో. కాని డేవిడ్‌ని మాత్రం వీసమెత్తు కూడా మార్చలేకపోయింది. ఎన్ని ప్రయత్నాలు చేసింది. కానీ లాభంలేకపోయింది. ఎందుకతను అలా మారిపోయాడో ఆ భగవంతునికి కూడా తెలీదేమో!

ఎవరివో అడుగుల చప్పుడు దగ్గరవుతుంటే ఎవరా అని ప్రక్కకి తిరిగి చూసింది షీలా. ఎదురుగా జాన్ నిలబడిఉన్నాడు.

"హనీ! స్కూలునుండి వచ్చావా? బాగా అలసినట్లున్నావ్" అంది మంచం మీంచి లేస్తూ.

"నువ్వులేవకు మమ్మీ. నీ గురించే మా బెంగంతా. ఎలా వుందివాళ?" అంటూ ఆమె దగ్గర కొచ్చాడు జాన్.

"పర్వాలేదు హనీ! నువ్వేం కంగారు పడకు. ఇలా దగ్గరగా వచ్చి కూర్చో" అని ఆమె మంచంపై నుండి కొంచెం ప్రక్కకు జరిగింది.

"మమ్మీ! డాడీ విషయంలో నీ నిర్ణయం ఏమిటి?" నెమ్మదిగా అడిగాడు.

ఇటువంటి ప్రశ్న కొడుకు వద్దనుండి వస్తుందనుకోలేదు షీలా.

"అంటే నీ ఉద్దేశ్యం" అనుమానంగా కొడుకు వంక చూసింది.

"ఇంకా నువ్వు డాడీతో కలసి ఉండాలని అనుకుంటున్నావా?"

"అదే ఆలోచిస్తున్నాను జాన్"

"ఇంకా ఆలోచించటం ఏమిటీ? ఇంత జరిగాక కూడ నువ్వు ఆ మనిషిని గురించి మంచిగానే ఆలోచిస్తున్నావా?"

"ఇంక మారడంటావా?"

'ఇంక ఆ మనిషిలో మార్పురాదు మమ్మీ. నువ్వు ఆస్పత్రిలో ఉన్నప్పుడు బ్రతికావో, చచ్చావో కూడా ఆలోచించాడా? కనీసం స్నేహితుడిగా కూడ నిన్ను చూడటానికి రాలేదు. నిన్ను చంపటానికి కూడ సిద్దపడ్డాడు. అటువంటి కిరాతకుడితో యింకా బ్రతుకుని పంచుకుందామనుకుంటున్నావా? నీ పిచ్చి మమ్మీ! ఈ సంవత్సరంతో నా చదువు పూర్తయిపోతుంది. ఈలోగా జాబ్‌కి ట్రై చేస్తాను. మనం కలిసి హాయిగా ఉందాం మమ్మీ. నీకు ఎటువంటి కష్టం రాకుండా చూసుకుంటాం'' అని ఆవేశంగా మాట్లాడాడు.

"జాన్!'' అంటూ చెమ్మగిల్లిన కళ్ళతో కొడుకుని దగ్గరగా తీసుకుంది షీలా.

"ఐ లవ్ యూ మమ్మీ! నువ్వు ఆ క్రూరుడి చేతుల్లో అలా బాధ పడుతూంటే నేనూ స్టేసీ చూడలేం మమ్మీ! మాకు నీ ప్రేమ చాలు'' అన్నాడు జాన్.

"ఓకే జాన్! నేను ఈ విషయంలో కాస్త సీరియస్‌గానే ఆలోచిస్తాను. మనసులో లేనిపోని ఆలోచనలు పెట్టుకోక చక్కగా చదువుకో! ఈ నెల్లాళ్ళు నాకోసం మీరు చాలా అవస్థపడ్డారు.''

"స్వీట్ మమ్మీ! మేం అవస్థపడటం ఏమిటి? తల్లికి పిల్లలు చేయటం అవస్తా మమ్మీ! నువ్వు మాకు జన్మనిచ్చిన దేవతవు'' అని ప్రేమగా అన్నాడు జాన్.

ఇంతలో స్టేసీ బయటనుండి లోపలకు వస్తూ "ఏమిటి మీరిద్దరే చెప్పేసుకుంటున్నారు కబుర్లు'' అంటూ,

"మమ్మీ! నీకోసం ఏం తెచ్చానో చెప్పుకో'' అంటూ షీలా వద్దకు వచ్చింది.

"ఏమిటి స్పెషల్?'' అంది ఆశ్చర్యంగా.

"గెస్ చెయ్యి''

"ఇప్పుడు మమ్మీకి అంత ఓపికలేదుగాని ఆదేదో తొందరగా నువ్వే చెప్పేసెయ్'' అని జాన్ అన్నాడు.

"ఆ! ఆ! నీకు అన్నిటికీ తొందరే'' అంటూ "మమ్మీ చెప్పేయ్యనా? చెబుతావా?'' అంది చిలిపిగా.

"నువ్వే చెప్పు హనీ!'' అంది నీరసంగా నవ్వుతూ.

"అయితే మమ్మీ! ఒక్కసారి కళ్ళు మూసుకో''

"ఓకే. అంటూ షీలా కళ్ళు మూసుకుంది.

తరువాత స్టేసీ తన హేండ్ బ్యాగ్ లోంచి ఒక గుండ్రని లాకెట్టున్న గొలుసును తీసి తల్లి మెడలో వేసి,

"ఇప్పుడు కళ్ళు తెరవవచ్చును'' అంది చప్పట్లు కొడుతూ...

షీలా నెమ్మదిగా కళ్ళు తెరచింది. తన గుండెల మీద వ్రేలాడుతూన్న లాకెట్టును చూసి "ఏమిటిది హనీ!'' అంటూ ఆశ్చర్యపోయింది.

"ఆ!ఆ! అప్పుడే అయిపోలేదు ఉండు'' అంటూ ఆ లాకెట్టుని ఓపెన్ చేసి చూపించింది తల్లికి. షీలాకి అటు యిటు జాన్, స్టేసీ నిల్చుని వున్నఫొటో ఉంది. చూడముచ్చటగా ఉంది ఫోటో.

"సో బ్యూటిఫుల్'' అంటూ షీలా పిల్లలిద్దర్నీ దగ్గరకి తీసుకుంది.

వాళ్ళు ఏకకంఠంతో "హేపీ బర్త్ డే టూయూ!'' అంటూ ఆమె బుగ్గల్ని ముద్దెట్టుకున్నారు.

"వాళ్ళ ప్రేమానురాగాలకు షీలా మనసు ఆనందంతో పొంగిపోయింది. "ఇంతకంటే ఏం కావాలి నాకు?' అని అనుకొని లేని ఓపిక తెచ్చుకుంటూ లేవబోయింది.

"మమ్మీ నువ్వేమి లేవవద్దు. నీకు ఏదికావాలన్నా నీ ముందుకి వచ్చేస్తాయి. ఇప్పుడు నీకేం కావాలి?'' అంది స్టేసీ.

"సూర్య చంద్రుల్లాంటి మీరిరువురూ ఉండగా ఇంక నాకు ఏం కావాలి. నా పుట్టిన రోజు సంగతి నేనెప్పుడో మరచిపోయాను. దానిని మీరు గుర్తుపెట్టుకుని నన్ను సంతోషపెట్టారు. నాకు ఎంతో ఆనందంగా ఉంది'' అని ఆనందబాష్పాల్ని తుడుచుకుంటూ "ఊఁ. మీకోసం ఏమైనా చేస్తాను'' ప్రేమగా అంది.

"మమ్మీ చాల టైమయింది. బాగా ఆకలేస్తోంది. ఈరోజు మనం కలసి భోజనం చేద్దాం'' అంటూ పిల్లలిద్దరూ భోజన ఏర్పాట్లకోసం మేడ దిగిక్రిందకు వెళ్ళారు. ప్రేమనిండిన కళ్ళతో వాళ్ళు వెళ్ళిన వైపు చూస్తూ తన పుట్టిన రోజు సందర్భంగా ఓ నిర్ణయానికొచ్చింది షీలా.

## 31

జెర్సీ తీసుకున్న నిర్ణయం సమంజసం అవునా? కాదా? అని అనేకసార్లు తర్కించుకుంది ఆమె మనసు. చివరకు కరెక్టే అని హాయిగా ఊపిరి పీల్చుకుంది. తరువాత ఆమె ఆలోచనలు పింకీ మీదకు వెళ్ళాయి. "తను లేకుండా వాడు ఉండలేడు. వాణ్ణి తన వద్దకు తీసుకువచ్చేయాలి. దానికి కూడ గట్టిగా ప్రయత్నం చేయాలి'' అని అనుకుని ఒక్కసారి తన వాచీ వంక చూసుకుంది జెర్సీ.

సరిగ్గా పింకీకి లంచ్ టైం. ఈ టైములో వాడు బయటే ఉంటాడు. ఓసారి చూసి వద్దాం అని అనుకుని బయటకు వచ్చి స్కూలుకి కారులో బయలుదేరింది.

జెర్సీ స్కూలు ఆవరణలోకి అడుగుపెట్టింది. పింకీ ఎవరితోనో ఆడుకుంటున్నాడు. తల్లిని చూడగానే మమ్మీ అంటూ పరుగెట్టుకుని జెర్సీ దగ్గరకు వచ్చాడు.

"హాయ్! హనీ! హౌఆర్‌యూ?" అంటూ వాణ్ణి ముద్దెట్టుకుంది.

"ఫైన్‌మామ్"

వాడికోసం తెచ్చిన కాండీ చాక్‌లేట్సు పింకీ కిచ్చింది.

"థాంక్స్ మమ్మీ" అంటూ వాటిని అందుకున్నాడు.

"పింకీ సాయంత్రం స్కూలు వదిలే టైంకి వస్తాను. మనమిద్దరం కలిసి యింటికి వెడదాం"

"ఏ యింటికి మమ్మీ"

"నువ్వు, నేను ఉన్నాం. ఆ యింటికి"

"మరి డాడీయో!"

"ఇక నుండి మనం వేరుగా ఉంటున్నాం. డాడీ దగ్గర మనం ఉండటం లేదు. తెలిసిందా?" అని కోపంగా అంది.

"సారీ మమ్మీ! డాడీతో కలసి ఉంటేనే వస్తాను లేకపోతే రాను." అని పెంకెగా అన్నాడు పింకీ.

"నో! పింకీ! అది జరగనిపని"

"డాడీకి నువ్వంటే ఎంత యిష్టమో తెలుసా! ఎందుకలా డాడీ అంటే అసహ్యించుకుంటున్నావ్?" సూటిగా అడిగాడు.

"డాడీకి నేనంటే యిష్టం లేదు"

"నో మమ్మీ! అది అబద్ధం. నువ్వులేని డాడీ ఉండలేరు. అందుకని నువ్వు మనయింటికి వచ్చేస్తే అందరం కలసి ఉందాం. అనవసరంగా డాడీ మీద కోపం పెంచుకోవద్దు"

"నో పింకీ! నేను ఇంక ఆ యింటికి రావటం అంటూ జరగదు" కోపంగా అంది జెర్సీ.

"............"

ఇంతలో స్కూలు బెల్ మ్రోగటంతో పింకీ మౌనంగా తల్లి వంక చూసి స్కూలు లోపలకెళ్ళిపోయాడు.

వెడుతున్న పింకీ వంక చూస్తూ నిల్చుండిపోయింది జెర్సీ.



# 32

మే నెల ప్రారంభం అయింది. ఒళ్ళు చుర్రుమనిపించే ఎండలు. మధ్య మధ్యలో చిత్తడి చిత్తడి వానలు. ఎప్పుడు ఎండ వస్తుందో, ఎప్పుడు వాన పడుతుందో తెలీటం లేదు. ఈ రోజు వాతావరణం చాలా బాగుందీ అని అనుకుంటే మరి కాసేపట్లో స్నో రైన్ పడొచ్చు. అందుకే సర్వసాధారణంగా రేడియోలు వింటారు. కార్లలో కూడ రేడియో ఆన్ చేసే ఉంటుంది నడుస్తున్నప్పుడూ.

పింకీ తన రూంలో కూర్చుని ఇయర్ ఫోన్ వింటూ పుస్తకం చదువు కుంటున్నాడు. మధ్య మధ్యలో ఏవేవో మాటలు, పాటలు, మ్యూజిక్ వస్తున్నాయి.

వాడు పుస్తకం చదువుతున్నాడే గాని మనసు మాత్రం మమ్మీ మీద ఉంది. మమ్మీ యింట్లో తిరుగుతున్నట్లు, తనని పింకీ అని పిలుస్తున్నట్లు భ్రమ పడుతున్నాడు. పుస్తకం చదవటం యిష్టం లేక దానిని ప్రక్కకి పెట్టి కిటికీ దగ్గరకు వచ్చి కిటికీలోంచి బయటకు చూస్తున్నాడు. ఇంటి ప్రక్కనే ఉన్న పార్కులో పిల్లలు బంతి ఆట ఆడుతున్నారు. తను కూడ వెళ్ళి కాసేపు ఆడుకువద్దామా అంటే వెళ్ళ బుద్ధి వేయలేదు.

బయట ఫుట్‌పాత్‌మీద మనుష్యులు హడావుడిగా ఎవరిపనుల మీద వాళ్లు పరుగులు తీస్తున్నారు. లాన్‌లో ఉన్న మేపుల్ లీపు చెట్లపై రెండు నల్ల ఉడుతలు దోబూచులాడుకుంటున్నాయి. చిన్న పిల్లల్ని వాళ్ళ తల్లి దండ్రులు "స్ట్రాలర్స్" లలో కూర్చోపెట్టుకుని షికారుకి తీసుకువెడుతున్నారు. ఆ దృశ్యాలు చూస్తూంటే తను మమ్మీ, డాడీలతో కలసి తిరిగిన సంఘటనలు గుర్తుకు వచ్చాయి. ఒకవేళ మమ్మీ ఆఫీసునుండి యింటికి రావటం ఆలస్యమైతే స్టీవ్ షికారుకి తీసుకువెళ్ళేవాడు. నిజానికి తనతో ఎక్కువ కాలం గడిపేది తండ్రి. జెర్సీ ఉదయం 8 గంటలకి యింటి నుండి బయలుదేరి వెళ్ళిపోయేది. మళ్ళీ సాయంకాలం ఏడుగంటలకు వచ్చేది. తొందరగా వస్తే, అందరు కలసి వెళ్ళేవారు. కాని తొందరగా యింటికి వచ్చిన రోజులు తక్కువ. అందువల్లే తన పనులు సాధ్యమైనంత వరకూ తండ్రి చూచేవాడు. స్కూలుకి తీసుకువెళ్లటం, తీసుకురావటం మొదలైన పనులు చేసేవాడు స్టీవ్. వీకెండ్స్ అయితే తల్లిని వదలి ఉండేవాడు కాదు పింకీ. జెర్సీ ఏ పని చేసినా కూడా కూడా తిరిగేవాడు. తనూ చేస్తానని అల్లరి చేసేవాడు. అది చేస్తాను, ఇది చేస్తాను అని మారాం చేసేవాడు. జెర్సీ అప్పుడప్పుడు చిరుకోపం ప్రదర్శించేది. వెంటనే స్టీవ్ దగ్గరకెళ్ళిపోయేవాడు. అప్పుడు తండ్రీ కొడుకులిద్దరూ ఒక పార్టీ అయిపోయేవారు. ఆమె వాళ్ళిద్దర్నీ చూసి చిలిపిగా కళ్ళతోనే నవ్వేసేది.

ఇవన్నీ గుర్తుకు వస్తుంటే పింకీకి ఒక్కసారి తల్లిని చూడాలనిపించింది. డాడీ వచ్చాక తీసుకువెళ్ళమంటే హూ! హూ! మమ్మీ, డాడీని రానివ్వదు. తను ఒక్కడూ వెడితే అమ్మో! చాల దూరం. పోనీ ఫోన్ చేసి మమ్మీనే రమ్మంటే! వస్తుందో? రాదో? ఇలాంటి ప్రశ్నలతో పింకీ బుర్ర నిండిపోయింది.

కిర్ర్... కిర్ర్... కిర్ర్‌మని కాలింగ్ బెల్ మ్రోగటంతో ఎవరబ్బా వచ్చింది, స్టీవ్ వచ్చే టైం కాదు. తన ఫ్రెండ్స్ ఎవరూ ఈ టైంలో రారు. "ఎవరై ఉంటారా?" అని అనుకుంటూ తన ఆలోచనలలోంచి క్రిందకు వచ్చి తలుపుతీసాడు. ఎదురుగా పింకీ వాళ్ళ గ్రాండ్ మదర్, గ్రాండ్ ఫాదరు కనపడ్డారు. అసలే ఒంటరిగా ఉన్నాడేమో వాళ్ళని చూడగానే పింకీకి ఎక్కడలేని సంతోషం కల్గింది. వెంటనే గ్రాడ్‌ఫా అంటూ థామస్‌ని కౌగిలించుకున్నాడు. వాణ్ణి దగ్గరగా తీసుకుని థామస్ దంపతులు లోపలకు వచ్చారు.

"హౌఆర్‌యూ పింకీ" అంటూ థామస్ అడిగాడు.

"ఐ యామ్ ఫైన్" అంటూ హేపీగా విక్టోరియా వొళ్లో కూర్చున్నాడు.

"మమ్మీ, డాడీ యింకా ఆఫీసు నుండి రాలేదా?" అని అడిగింది విక్టోరియా.

"డాడీ వచ్చే టైం అవుతోంది"

"స్కూలుకి వెడుతున్నావా?"

"ఆ! ఆ!"

"రోజు నిన్ను స్కూలుకి ఎవరు తీసుకెడతారు?"

"డాడీ"

"మరి మమ్మీ ఏంచేస్తుంది?"

"మరి మమ్మీ డాడీకంటే ముందుగా ఆఫీసుకెళ్ళాలిగా అందుకని డాడీయే నా పనులు చేస్తారు"

"మరి బాగా చదువుకుంటున్నావా?" అడిగాడు థామస్.

"ఓ! య్యా! క్లాసులో ఫస్ట్ తెలుసా?" భుజాలెగరేస్తూ చెప్పాడు పింకీ. ఇంతలో ఏదో గుర్తుకు వచ్చినట్లు,

"జస్ట్ ఎ మినిట్" అంటూ లోపలకెళ్ళి ప్లేటులో చాక్‌లేటు కూకీస్ పెట్టి తీసుకువచ్చాడు.

"అవేంటి పింకీ" అని థామస్ అడిగేంతలో,

"డాడీ యింకా రాలేదు. మీరు ప్రయాణం వలన బాగా అలసి, ఆకలితో ఉంటారు గదా! అందుకని డాడీ వచ్చేంతవరకు ఇవి తీసుకోండి" అంటూ తెచ్చిన ప్లేటుని వాళ్ళ ముందున్న టీపాయ్ మీద పెట్టాడు. విక్టోరియా దంపతులు ఆశ్చర్యంగా,

"అప్పుడే ఎంత పెద్దవాడివై పోయావ్? ఎన్ని తెలివి తేటలొచ్చాయి. ఎప్పుడో చిన్నప్పుడు చూసాం వీణ్ణి" అని అనుకుంటూ వాణ్ణి దగ్గరగా కూర్చోపెట్టుకుని కూకీస్ తింటూ కబుర్లు చెప్పుకుంటున్నారు.

పింకీ తన చదువు గురించి, స్కూలుగురించి, టీచర్ల గురించి, స్నేహితులగురించి ఎన్నెన్నో కబుర్లు చెప్పసాగాడు. వాడి మాటలకు వాళ్ళు సంబరపడిపోతూ వింటున్నారు. పింకీకబుర్లు వింటుంటే థామస్‌కి తన చిన్ననాటి స్కూలు సంగతులు గుర్తొచ్చి అవి చెప్పసాగాడు. కబుర్లలో కాలం కూడా తెలియలేదు వాళ్ళకి. ఇంతలో తలుపు తీసిన చప్పుడైతే ఒక్కసారి మూడు జతలకళ్ళు గుమ్మం వైపు చూసాయి. స్టీవ్ తలుపువేసి ప్లాస్టిక్ బ్యాగ్‌లతో లోపలకు వచ్చాడు.

"డాడీ! ఎవరొచ్చారో చూడండి" అంటూ స్టీవ్ వద్దకు వచ్చాడు పింకీ.

సోఫాలో కూర్చున్న థామస్, విక్టోరియాలను చూసి ఆనందంతో వాళ్లని విష్ చేసి కౌగిలించుకున్నాడు స్టీవ్.

"ఐ యామ్ సారీ! ఈ రోజు శుక్రవారం కదా! కొద్దిగా షాపింగ్ చేసి వచ్చేటప్పటికి ఆలస్యమైంది" అంటూ వాళ్ళతో మాట్లాడుతూనే ప్లాస్టిక్ కవర్లలోని వస్తువుల్ని అక్కడున్న అలమారులోను, ఫ్రిజ్‌లోను సర్ది, తరువాత నల్గురికి సప్పర్ ఏర్పాట్లు చేస్తున్నాడు కిచెన్‌లో.

పింకీ చెప్తున్న మాటలనుబట్టి స్టీవ్ చేస్తున్న పనులను బట్టి థామస్ దంపతులకు ఏదో అనుమానం కల్గింది.

"రండి, సప్పర్ చేద్దాం" అని వాళ్లని పిలిచాడు.

"జెర్సీ రానీ అందరం కలసి తిందాం" అంది విక్టోరియా.

"ఐ యామ్ వెరీ సారీ అంకుల్! మీకు ఈ విషయం ఎలా చెప్పాలా? అని అనుకుంటున్నాను. ఇంతలో ఆ అవకాశం రానే వచ్చింది"

"జెర్సీ నన్ను విడిచి వేరే ఉంటుంది" అని జరిగినదంతా థామస్ దంపతులకు వివరంగా చెప్పాడు స్టీవ్. ఆశ్చర్యంలోను, బాధలోను విక్టోరియా, థామస్‌లు స్టీవ్‌ని ఓదార్చారు.

తరువాత సప్పర్ తిన్నామనిపించి అలసిపోయి ఉండుటవలన ఎవరిగదుల్లోకి వాళ్ళు వెళ్ళిపోయారు.

*

అందరూ మంచాల మీద పడుక్కున్నారన్న మాటేగాని నిద్రరాక ఎవరి ఆలోచనల్లో వాళ్ళు దొర్లుతున్నారు.

"స్టీవ్ చాల తెలివైన వాడు. మంచి మేధావి. జెర్సీ ఎందుకింత తెలివి తక్కువగా ప్రవర్తించిందో తనకి అర్థం అవటం లేదు. స్టీవ్ చాల మంచివాడు జెర్సీ అంటే అమితమైన ప్రేమ. అతనిని తప్పుగా అర్థం చేసుకుని దూరమైంది జెర్సీ. ఏది ఏమైనా ఈ విషయం గురించి చాల జాగ్రత్తగా వ్యవహరించి పరిస్థితి చక్కదిద్దాలి" అని థామస్ ఆవులిస్తూ దగ్గు సరిచేసుకుని నిద్రకుపక్రమించాడు.

స్టీవ్ గదిలో లైటు ఇంకా వెలుగుతూనే ఉంది. అతను ఫొటో ఆల్బమ్ తిరగేస్తున్నాడు. తమ పెళ్ళి ఫొటోలను పదే పదే చూసుకుంటున్నాడు.

"ఐలవ్‌యూ హనీ! యూ ఆర్ ఎ బ్యూటి ఫుల్ ఉమన్ జెర్సీ!" ఈ అందమె నన్ను పిచ్చివాణ్ణి చేసింది. నువ్వు నన్ను నిజంగా పిచ్చివాణ్ణి చేసి వెళ్ళిపోయావ్. నా జీవితంలోకి నీ అంతట నువ్వే అడుగుపెట్టావ్. బీడువారిన జీవితంలో ప్రేమ విత్తులు జల్లి, పువ్వులు పూయించావ్, ఊపిరిలో ఊపిరిగా కలసి పోయావ్. కాని నన్నీనాడు నిర్దాక్షిణ్యంగా అగ్ని గుండంలోకి తోసేసావ్. నీలోని ఆ ప్రేమ ఈనాడు ఏమైపోయింది? నీవు లేకుండా నేనుండలేనని తెలిసికూడ ఎందుకింత కఠిన శిక్ష వేసావ్?" అని అతని హృదయం క్షోభిస్తోంది. స్టీవ్‌కి తెలియకుండానే అతని కళ్ళు చెమర్చాయి. బరువెక్కిన హృదయంతో మంచంపై పడుక్కున్నాడు.

ప్రయాణం బడలిక వలన విక్టోరియా ముందుగానే నిద్రపోయింది. గ్రాండ్ మా, గ్రాండ్ పా వచ్చారన్న ఆనందంతో నిద్దట్లో పింకీ చేతులు గ్రాండ్‌మాని కౌగిలించుకున్నాయి.

## 33

వేసవి కాలం అవటం వలన ఐదు గంటలకే ప్రభాకరుడు తన వెలుగురేఖల్ని అవనిపై వెదజల్లుతున్నాడు. చెట్లకొమ్మల్లోని పక్షుల కిలకిలా రావాలతో జగతి పులకిస్తోంది. జన సంచారంలేని రోడ్లు నిర్మానుష్యంగా మౌనంగా ఉన్నాయి. రోడ్ల ప్రక్కన రంగురంగుల కార్లు ఆర్మీ పోలీసుల్లా వరుసగా నిల్చుని ఉన్నాయి. అన్ని అపార్ట్‌మెంట్లు మౌనంగా నిద్రపోతున్నాయి. కాని అలవాటు ప్రకారం ఆ ఇంట్లో మాత్రం లైట్లు తొందరగా మేల్కొంటాయి(వెలుగుతాయి). కిచెన్‌లో పాత్రలు పాటలు పాడుతున్నాయి. ఆ అలికిడికి థామస్‌కి మెలకువ వచ్చింది. నెమ్మదిగా మంచంపై నుండి లేచి క్రిందకు వచ్చాడు.

"గుడ్ మార్నింగ్ స్టీవ్" అంటూ స్టీవ్‌ని పల్కరించాడు థామస్.

"వెరీ గుడ్ మార్నింగ్ అంకుల్. అప్పుడే లేచారేంటి? రాత్రి సరిగ్గా నిద్రపట్టలేదా?" అని అడిగాడు స్టీవ్.

"ఆ! ఆ! అదేం లేదు. నేను రోజు తొందరగానే లేస్తాను. ఆ అలవాటుతోనే టైముకి మెలకువ వచ్చేసింది. మీ ఆంటీ మాత్రం కాస్త ఆలస్యంగానే లేస్తుంది" అన్నాడు థామస్.

స్టీవ్ రెండు కప్పుల కాఫీ కలిపి "రండి అంకుల్ బాల్కనీలో కూర్చుని త్రాగుదాం" అంటూ బాల్కనీ వైపు నడిచాడు. వాళ్ళిద్దరూ బాల్కనీలో చెరో కుర్చీలో కూర్చుని కాఫీ త్రాగుతూ కబుర్లు చెప్పుకుంటున్నారు.

"ఈ రోజు జెర్సీని చూడటానికి వెడదామా స్టీవ్?" అని అడిగాడు థామస్.

"ఫోన్ చేసి వెడితేమంచిది అంకుల్"

"ఎలాగూ వీకెండ్ గదా! ఇంట్లోనే ఉంటుంది గదా!'

"ఎందుకైనా మంచిది. పదింటికి ఫోన్ చేస్తాను."

"ఓకే! అలాగే చేద్దాం. ఏదో కోపంలోను, ఆవేశంలోను నీకు దూరంగా ఉంది. కాని నీవంటే చాల యిష్టం, ప్రేమ"

"ఐ నో అంకుల్. అందుకే చాలసార్లు ఓపిగ్గా బ్రతిమాలాను. కాని నిర్లక్ష్యంగా నా మాటలను తీసిపారేసి, అసహ్యించుకుంది. నా బాధని మీకు ఎలా చెప్పుకుంటే తగ్గుతుందో తెలీటం లేదు. మనసుని రాయి చేసుకుని రోజులు గడుపుతున్నాను. పింకీ చూస్తే చిన్న పిల్లాడు. వాడి పసి హృదయంలో మా యిద్దరి మీద ఎటువంటి చెడు అభిప్రాయం ఏర్పడకూడదు. చిన్న విషయాన్ని కారణంగా తీసుకుని మాకు దూరంగా వెళ్ళిపోయింది" అంటూ బాధగా నిట్టూర్చాడు స్టీవ్.

"ఐ యామ్ వెరీ సారీ స్టీవ్. ఈ రోజు వెడతాంగదా. జెర్సీకి గట్టిగా చెబుతాను. తన నిర్ణయం మార్చుకోమని. నాకు జెర్సీ ఒక్కత్తే కూతురవటం వల్ల అతి గారాబం చేసాను. దాంతో తను అన్నదే కాని ఎదుటివాళ్ళు చెప్పింది శాంతంగా అర్థం చేసుకోదు" ఆలోచిస్తూ అన్నాడు థామస్.

ఇంతలో విక్టోరియా నిద్రలేచి అటురావటంతో వాళ్ళ సంభాషణ ఆగిపోయింది.

''ఏమిటి? అప్పుడే నిద్రలేవటం, కాఫీలు త్రాగటం కూడా అయిపోయాయా?'' అంటూ అక్కడ ఉన్న మరొక కుర్చీలో కూర్చుంది విక్టోరియా.

"అబ్బ! ఎంత ప్రశాంతంగా ఉందో వాతావరణం, అందమైన మొక్కలు, మనస్సుని ఆహ్లాదపరిచే చల్లని గాలి, చూపులనందుకునేలా గలగలాపారే రిడూ కాలువ. నాకైతే కదలకుండా యిక్కడే కూర్చోవాలనిపిస్తోంది. అయితే పూర్తి కాని నిద్రలో గబుక్కున లేవటం, పడ్తూ లేస్తూ కాలకృత్యాలు తీర్చుకుని ఉరుకులు పరుగుల మీద వర్క్‌కి పోవటం. ఇంత చక్కటి ప్రకృతి సౌందర్యాన్ని చూసే టైం ఏదీ?'' అంటూ వాళ్ళతో మాట్లాడుతోంది విక్టోరియా.

"నాకూ యీ వాతావరణం అంటే చాల యిష్టం ఆంటీ. వీలున్నప్పుడల్లా యిక్కడే ఎక్కువ కాలం గడుపుతూంటాను. వీకెండ్స్‌లో అయితే జెర్సీ, నేను, పింకీ కలసి యిక్కడే లంచ్, సప్పరు చేసేవాళ్లం. సరదాగా కబుర్లు చెప్పుకుంటూ కాలం గడిపే వాళ్ళం'' అంటూ స్టీవ్, జెర్సీ గురించి మాట్లాడుతున్నాడు. అతను మాట్లాడుతున్నప్పుడు ఆ కంఠంలో బాధ, తపన, జెర్సీపై ఉన్న ప్రేమ స్పష్టంగా కనపడుతున్నాయి.

థామస్ మధ్యలో కల్పించుకుని "విక్టోరియా మనం బ్రేక్‌ఫాస్ట్ అయిన తరువాత జెర్సీని చూడటానికి వెడదాం. తొందరగా పనులు ముగించుకుని రెడీగా ఉండు. ఆఁ! అన్నట్టు పింకీ యింకా నిద్రలేచినట్లులేదు. వాణ్ణి నిద్రలేపి తయారవమని చెప్పు'' అని భార్యకు చెప్పాడు. ఆమె "సరే'' అంటూ కుర్చీలోంచి బద్ధకంగా లేచి లోపలకు వెళ్ళింది.

"స్టీవ్! బేబీకి(జెర్సీ) ఒకసారి ఫోన్ చేస్తాను'' అంటూ థామస్ కూడ లోపలకెళ్ళాడు. ఒంటరిగా కుర్చీలో స్టీవ్ మిగిలాడు. 'ఐ లవ్ యూ హనీ! ఐ లవ్ యూ టూ మచ్' అంటూ పిచ్చివాడిలా తనలో తను గొణుక్కున్నాడు. ఈ గొణుగుడు థామస్ చెవులకు సోకకపోలేదు.

గ్రాండ్ మా చెప్పిన కబురుతో ఎక్కడలేని ఆనందంతో ఒక్కగెంతు గెంతి విక్టోరియాను అమాంతంగా పట్టుకుని ఆమె బుగ్గల మీద ముద్దుల వర్షం కురిపించాడు పింకీ. మమ్మీని చూసి చాల రోజులైందని నిన్ననే అనుకున్నాడు.

"థాంక్స్ విక్టోరియా! ఒక్క క్షణంలో తయారై పోతాను'' అంటూ మేడమీంచి క్రిందకు పరుగుతీసాడు.

"పూర్ హనీ!'' అంటూ విక్టోరియా ఒక్క నిట్టూర్పు విడచింది.

విక్టోరియా అందరికీ బ్రేక్ ఫాస్ట్ రెడీ చేసి థామస్‌ని, స్టీవ్‌ని పిలిచింది.

"ఐయామ్ ఆల్ సో రెడీ'' అంటూ పింకీ తూనీగలా అక్కడకు వచ్చాడు. అందరు కలిసి బ్రేక్‌ఫాస్ట్ పూర్తి చేసి జెర్సీ యింటికి బయలుదేరారు.

# 34

'స్వీట్‌డ్రీమ్స్ రెస్టారెంట్' రంగురంగుల ఎలక్ట్రికల్ దీపాలతో కలకళలాడుతోంది. చూపులకు చిన్నగా ఉన్నా అందంగా, నీట్‌గా నిర్మించబడింది. బయట లాన్ డైమన్డ్ ఆకారంలో కత్తిరించబడింది. లాన్‌కి చుట్టురా అన్ని రంగుల సీజన్ ఫ్లవర్స్ మొక్కలు పువ్వులతో నిండుగా నవ్వుతున్నాయి. ఇవి ఏప్రిల్, మే నెలలో పువ్వులు తెగపూస్తాయి. వాటి జీవితం రెండు నెలలే అయినా తమ అందంతో మనుషుల హృదయాలను మరపింపచేస్తాయి.

లాన్ లోపల కుర్చీలు, టేబుల్స్ అమర్చబడి ఉన్నాయి. మధ్యలో 'ఫౌన్‌టెన్ ఫాల్స్' పడుతూంటే రంగురంగుల దీపాలకాంతిలో ఆ ఫాల్స్ ఇంద్రధనుస్సు కాంతులతో మనుష్యులను ఆకర్షిస్తూంటాయి.

లోపల అడుగుపెట్టిన వాళ్లకి సన్నని గొంతుతో జాజ్ మ్యూజిక్ స్వాగతం పల్కుతుంది. నెమ్మది నెమ్మదిగా జనాలు వస్తున్నారు. వచ్చిన వాళ్ళందర్నీ లోపలకు ఆహ్వానిస్తున్నారు. సమయం సాయంకాలం ఏడుగంటలవుతుండగా కారులోంచి ఖీలా, జాన్, స్టేసీలు దిగి లోపలకు వచ్చారు. వాళ్లను చూసి యిద్దరు వ్యక్తులు హడావుడిగా వాళ్ళ వద్దకు వచ్చి, విష్ చేసి ప్రత్యేకంగా ఏర్పరచిన టేబుల్ వద్దకు తీసుకువెళ్ళారు. వాళ్ళు కుర్చీలలో కూర్చున్నారు. ఆ యిద్దరు వ్యక్తులు యిప్పుడే వస్తాం అని చెప్పి ఓ అయిదు నిమిషాల తరువాత కొన్ని ఫైల్సు, కాగితాలతో ఖీలా వద్దకు వచ్చారు. వాళ్ళు ఆమెను ప్రత్యేకంగా విష్ చేస్తూ ఆ కాగితాలను ఆమె ముందుంచారు. ఖీలాకి ఈ తతంగమంతా ఏమిటో అర్థం కాలేదు. ఆమె ఆ కాగితాలను చేతిలోకి తీసుకుని చదవసాగింది. మొదట ఆమె కేమీ అర్థం కాలేదు. కాని ఆమెకి ఆనందంతో నోట మాట రాలేదు. ఆనంద బాష్పాలతో జాన్, స్టేసీలను కౌగిలించుకుంది ఖీలా.

"మమ్మీ! ఎనీథింగ్ రాంగ్?'' అంటూ వాళ్ళు ఆమె వంక చూసారు.

"నో! నో! మైడియర్ చిల్డ్రన్స్. ఐ యామ్ వెరీ హేపీ'' అంటూ ఆమె వాళ్ళని దగ్గరగా తీసుకుంది.

తరువాత వాళ్ళకి డ్రింక్స్, సప్పర్ ఏర్పాటు చేసారు.

"ఆ యిద్దరి వ్యక్తుల్ని ఖీలాకి పరిచయం చేస్తూ వాళ్ళ పేర్లు విక్టర్, ఆడమ్‌లని చెప్పాడు జాన్.

సప్పర్ అయిన తరువాత విక్టర్, ఆడమ్‌లు ఖీలాకి పుష్పగుచ్ఛాలు అందజేసారు. ఆమె వాటిని ఆనందంతో అందుకుని వాళ్ళని అభినందించింది.

తరువాత వాళ్ళు యిచ్చిన కాగితాలపై సంతకం చేసింది.

"యూ ఆర్ వెరీ గుడ్ ఫ్రెండ్స్" అంటూ వాళ్లని మెచ్చుకుంది. తరువాత ఖీలా, స్టేసీ, జాన్‌లు కారులో యింటికి బయలుదేరారు.

జాన్ డ్రైవ్ చేస్తున్నాడు. వెనక సీట్లో ఖీలా, స్టేసీ కూర్చున్నారు. వాళ్ళు ఆనందంలో కబుర్లు చెప్పుకుంటున్నారు. ఖీలా మాత్రం కారు అద్దాలలోంచి బయట ప్రపంచాన్ని చూస్తోంది. ఆమె మనసు ఎన్నడూ లేనంత ఆనందంగా ఉంది. తన పిల్లలిద్దరూ మంచి ముత్యాల్లాంటి వాళ్ళు. వాళ్ళ మనసులు ఏ కల్మషం లేకుండా ఎప్పుడూ స్వచ్ఛంగానే ఉండాలి. భగవంతుడు ఎంత మంచి మనసిచ్చాడు వాళ్ళకి. తను కలలో కూడ ఊహించలేనంతగా ఎదిగిపోయారు. తనని వాళ్ళు ఈ రోజు ఎంత సర్ప్రైజ్ చేశారు.

'మదర్స్ డే' సందర్భంగా తన పేరుతో ఆ రెస్టారెంట్‌ని ప్రారంభించారట. అందులో పార్ట్‌నర్స్‌గా ఆడమ్, విక్టర్‌లు. పిల్లలు పార్ట్ టైం జాబ్ చేయగా వచ్చిన డబ్బుతో దాన్ని ప్రారంభించారుట. దానిమీద వచ్చే రాబడితో కొంత ఆర్థిక సమస్య తీరుతుందని జాన్ చెప్పగా వింది. 'భగవంతుడు మిమ్మల్ని చల్లగా చూడాలి' అని అనుకుంటూ చెమ్మగిల్లిన కళ్ళను నేప్‌కిన్‌తో తుడుచుకుంది ఖీలా.

## 35

లాంగ్ వీకెండ్ కదా అని న్యూయార్క్ చూడటానికి వెళ్ళారు డయానా, స్కాట్‌లు. పిల్లలకి పరీక్షలు దగ్గరవుతున్నాయని వాళ్ళను తీసుకెళ్ళలేదు. పెద్ద పిల్లలే అయినా జాగ్రత్తగా ఉండమని చెప్పివెళ్ళారు.

న్యూయార్క్‌లో స్నేహితుని యింట్లో దిగారు. ఉన్న రెండు రోజులు ఆనందంగా, సరదాగా గడిపారు. డయానాకు షాపింగ్ అంటే మహాపిచ్చి. స్కాట్ వెనక్కి లాగుతున్నా తను కొనదలచుకొన్న వస్తువులను కొనేసింది. నిజానికి న్యూయార్క్ చాల అందమైన సిటి. తనివితీరా చూస్తేనే గాని వర్ణించవీలుకాదు. నిత్య నూతనంగా కళకళలాడుతూ వుంటుంది. మళ్ళీ వచ్చే అవకాశం ఉంటుందో ఉండదో అని చూడవలసినవన్నీ చూసి తిరుగు ప్రయాణం అయ్యారు స్కాట్, డయానాలు.

వాళ్ళు వచ్చేటప్పటికి ఇల్లంతా నిశ్శబ్దంగా ఉంది. "పిల్లలు యింట్లో లేనట్లున్నారు" అని డయానా అనుకొని కొంచెం సేపు రెస్టు తీసుకుని యిల్లు సర్దటం మొదలెట్టింది. మళ్ళీ సోమవారం నుండి వర్క్ హడావుడి. స్కాట్ అర్జంట్‌గా కొన్ని తెచ్చుకోవలసినవి ఉంటే బయటకు వెళ్ళాడు.

ఏదో పనిమీద బ్రెంట్ గదిలోకి వెళ్ళిన డయానా ఒక్కసారి అక్కడ దృశ్యాన్ని చూసి రెండడుగులు వెనక్కివేసింది.

"వ్వాట్ హేపెండ్?" అని కంగారు పడింది.

గదంతా చిందర వందరగా ఉంది. టేబుల్ మీద తాగిన గ్లాసులు, బీరు సీసాలు. కొన్ని పగిలిన గాజు గ్లాసు ముక్కలు, కార్పెట్టు పైన ఒలికిన బీరు మరకలు. ఇవన్నీ చూస్తున్న డయానాకి బుర్ర తిరిగిపోయింది.

ఇంతవరకు ఎప్పుడు పిల్లలు బీరు త్రాగి ఎరుగరు. అలాంటిదీనాడు ఎందుకు ఇలా జరిగిందో ఆమెకి అర్థం కాలేదు. తనూ, స్కాట్ పిల్లల విషయంలో చాల జాగ్రత్తలు పాటిస్తారు. అలాంటిది ఇలా జరగటం ఆమె మనసు కల్లోల సముద్రంలా తయారైంది. కొట్టి చెప్పే వయసు కాదు. "పరీక్షలు కదా అని వదిలి వెళ్ళాల్సివచ్చింది కాని లేకపోతే అందరూ కలిసి వెళ్ళే వాళ్ళం" అనుకుంటూ సోఫాలో కూలబడింది.

కొద్ది సేపటికి గ్రేసీ ఇంటికి వచ్చింది. ఇంట్లో లైట్లు వెలిగి ఉండటం చూసి మమ్మీ డాడీ వచ్చారని అనుకుంది.

సోఫాలో కూర్చున్న డయానాని చూసి "హాయ్ మమ్మీ! ప్రయాణం బాగా జరిగిందా?" అని పల్కరించింది గ్రేసీ. ఆలోచనా సముద్రంలో మునిగిఉన్న డయానా ఒక్కసారి ఉలిక్కిపడి, తనని తను సముదాయించుకుని "హాయ్ హనీ! హౌఆర్‌యూ?" అంటూ ఎదురుప్రశ్న వేసింది.

"నైస్ మమ్మీ! అంకుల్, ఆంటీ బాగున్నారా?"

"ఆ! ఆ నువ్వురాలేదని అడిగారు. పరీక్షలు, చదువుకుంటున్నారని చెప్పాను."

"డాడీ ఎక్కడకు వెళ్ళారు?"

"స్టీవ్ అంకుల్ యింటికి వెళ్ళారు. ఏదో అర్జంట్ పనుందని. బహుశా వస్తూ ఉండవచ్చు ఈపాటికి, అదిసరే గాని బ్రెంట్ ఎక్కడికి వెళ్ళాడు?"

ఆ ప్రశ్నతో గ్రేసీ ఒక్కసారి ఉలిక్కిపడి, కొంచెం సేపు తటపటాయించి నెమ్మదిగా "నిన్న వాడు వాళ్ళ ఫ్రెండ్స్‌ని పార్టీ అని మనింటికి పిలిచాడు. ఫ్రిజ్‌లో ఉన్న బీరు సీసాలన్నీ ఖాళీ చేసేసారు. తరువాత నోటికి ఏదివస్తే అది వాగారు. ఒకళ్ళ మాటలు ఒకళ్ళకి నచ్చక కోపంతో గ్లాసుల్ని బ్రద్దలు కొట్టారు. ఆ కోపంలో వాళ్ళు ఏంచేస్తారో? ఏం చేసుకుంటారో? అని నాకు భయం వేసింది" అని చెబుతూ మధ్యలో ఆగి "జస్ట్ ఎ మినిట్" అంటూ లోపలకెళ్ళి టేప్ రికార్డర్ తెచ్చి ఆన్ చేసింది గ్రేసీ. దాంట్లో నిన్న జరిగిన గొడవ, వాళ్ళు తిట్టుకున్న తిట్లు, గ్లాసుల

చప్పుడుతో సహా అన్నీ టేపై ఉన్నాయి.

అదంతా వినేటప్పటికి డయానా తల తిరిగిపోయింది.

"ఇంతకీ వాడెక్కడకి వెళ్ళాడు?"

"అదే మమ్మీ! నిన్న వాళ్ళతో బయటకు వెళ్ళాడు. అప్పటి నుండి ఇప్పటి వరకు యింటికి రాలేదు. రాత్రి తెలిసిన ఫ్రెండ్స్‌కి ఫోన్ చేస్తే కొంతమంది ఇంట్లోలేరు. మరి కొంతమంది తెలీదని చెప్పారు. రాత్రంతా నాకు చాల భయంవేసింది. ఏం చేయాలో తోచలేదు. పోనీ పోలీసు రిపోర్ట్ యిద్దామనుకుంటే దానివల్ల మరేం గొడవలు వస్తాయో అని చేయలేదు" అంటూ గ్రేసీ బిక్కమొహం వేసుకుని చెప్పింది.

"ఓ మైగాడ్! ఎంతపని జరిగింది. స్కాట్ వస్తేనే గాని ఏం చేయడానికి వీలుకాదు" అని అనుకుంటూ "గ్రేసీ! ఓ కప్పు కాఫీ కలిపి తీసుకురామ్మా! తలపగిలి పోతోంది" అని గ్రేసీకి చెప్పింది డయానా.

"ఓకే మామ్!" అంటూ కిచెన్‌లోకి వెళ్ళింది గ్రేసీ.

రాత్రి పదిగంటలవుతుండగా స్కాట్ యింటికి వచ్చాడు. సోఫాలో దిగులుగా కూర్చున్న భార్యని చూసి 'వ్వాట్ హేపెండ్ డార్లింగ్' అంటూ కంగారుగా అడిగాడు.

డయానా కొంచెం సేపు మౌనంగా ఉండి, తరువాత నెమ్మదిగా జరిగిన సంగతంతా చెప్పింది. అంతా విన్న స్కాట్ తన కంగారుని కప్పి పుచ్చుకుంటూ "నేను యిప్పుడే వస్తాను" అంటూ హడావుడిగా బయటకు వెళ్ళిపోయాడు.

గ్రేసీ తండ్రి వెళ్ళిన తరువాత కొద్దిసేపు తల్లి వద్ద కూర్చుని ఆ తరువాత చదువుకుందుకు లోపలకి వెళ్ళిపోయింది.

ప్రశాంతంగా ఉన్న నదిలో రాయి విసరినట్లైంది ఈ సంఘటన.

బయటకు వెళ్ళిన స్కాట్ ఓ రెండు గంటల తరువాత యింటికి వచ్చాడు. అతని రాకతో డయానాకి కొంచెం ధైర్యం వచ్చింది.

"ఎక్కడికెళ్ళావ్ స్కాట్?" అని ప్రశ్నించింది డయానా. తను యింటి నుండి బయలుదేరిన తరువాత తెలిసున్న బ్రెంట్ స్నేహితుల యింటికెళ్ళి అసలు జరిగిన సంగతి ఏమిటని అడిగినట్లు, వాళ్ళు మామూలుగానే ఏం ప్రమాదం జరగలేదని చెప్పినట్లు, తరువాత వాళ్ళు ఆ రోజు బ్రెంట్ యింటి నుండి బయలుదేరి అందరూ సినిమాకు వెళ్ళినట్టు, సినిమా వదలిన తరువాత ఎవరి యిళ్ళకు వాళ్ళు వెళ్ళిపోయామని చెప్పినట్లు డయానాకి చెప్పాడు స్కాట్.

"ఎందుకైనా మంచిదని పోలీసు రిపోర్ట్ యిచ్చి వచ్చాను. వాడు సినిమా అయిన తరువాత సగం వరకు కలిసే వచ్చారు. తరువాత ఎవరి మటుక్కువాళ్ళు విడిపోయారు. మరీ చిన్న పిల్లవాడు కాదుగదా! రెండు రోజులు చూద్దాం. ఎలాగూ పోలీసు రిపోర్ట్ యిచ్చాం. ఏదైనా తెలిస్తే మనకి కాల్ చేస్తారు" అంటూ తన బాధని పైకి కనపడనీయకుండా డయానాకి ధైర్యం చెప్పాడు. తరువాత ఏదో కాస్త సప్పర్ తిన్నామనిపించి ఎవరి గదుల్లోకి వాళ్ళు వెళ్ళి పడుక్కున్నారు. కాని వాళ్ళ కళ్ళు మాత్రం మూతలుపడలేదు.

దేనితోను తనకి సంబంధంలేనట్లు గోడగడియారం గంటలు కొడుతూనే ఉంది.

## 36

ఒకరోజు మాటల సందర్భంలో డయానాతో,

"మనం న్యూయార్క్ నుండి వచ్చిన వెంటనే నేను బయటకు వెళ్ళాను గదా! వస్తూ, వస్తూ దారేగదా అని స్టీవ్ యింటికి వెళ్ళాను. జెర్సీ వాణ్ణి వదిలి వేరే ఉంటుందిట. పింకీ వీడి దగ్గరే ఉంటున్నాడు" అని చెప్పాడు స్కాట్.

"అరె! నాకు తెలీనే తెలియదు. రెండు మూడుసార్లు మార్కెట్‌లో జెర్సీ నాకు కనపడింది కూడాను. ఈ విషయం గురించి ఏం మాట్లాడలేదు. అయినా ఎందుకు విడిపోయారు? కారణం ఏమిటి? చక్కని జంట" అని అంది.

"ఏవో యిద్దరిమధ్య మనస్పర్థలు వచ్చాయిట. ఆవేశంలో వెళ్ళిపోయిందిట. మనిషి బాగా నీరసించిపోయి పిచ్చివాడిలా ఉన్నాడు. వాళ్ళది లవ్ మేరేజ్, చాల అన్యోన్యమైన జంట. నిజానికి యిద్దరూ విడిపోయేంత కారణం ఏమీలేదు. ఆమె బర్త్‌డే రోజున ఆఫీసుపని ఎక్కువగా ఉండటంతో పార్టీ సమయానికి రాలేక పోయాడుట. ఆ మర్నాడే వాడు టూర్ వెళ్ళవలసి వచ్చిందిట"

"ఆ! ఆ! అలాగా! చాల మంచిఫామిలీ. నేను వాళ్ళ సంసారాన్ని చూసి చాల ముచ్చటపడ్డాను"

"వాడు చెబుతుంటే నాకే కళ్ళమ్మట నీళ్ళొచ్చాయి. ఎంత బాధ పడుతున్నాడో. వాడి బాధని చేత్తో తీసేయలేక ధైర్యంగా ఉండమని చెప్పాను. అంతకన్నా ఏం చేయగలను?" అని జరిగిన విషయం చెప్పాడు.

"నేను జెర్సీకి చెప్పి చూస్తాను" అని నిట్టూరుస్తూ అంది డయానా.

సమయం రాత్రి పదిగంటలు. ఆటవా ఎయిర్‌పోర్టు రంగురంగుల దీపాలతో కళకళలాడుతోంది. టోరొంటో నుండి వచ్చిన విమానం గగన వీధులనుండి నెమ్మది నెమ్మదిగా ధరణి పైకి ఒయ్యారంగా దిగింది. ప్రయాణీకులు ఒక్కొక్కరూ నవ్వులు చిందించే ఎయిర్‌హోస్టెస్ నమస్కారాల్ని అందుకుంటూ బయటకు వస్తున్నారు. శ్రీకాంత్, పద్మ, పిల్లలు తమ సామానుని జాగ్రత్తగా లెక్క చూసుకుని ఎయిర్‌పోర్టు బయటకు వచ్చారు.

ముందుగానే రాజశేఖరానికి ఉత్తరం వ్రాయటం వలన అతను ఎయిర్‌పోర్ట్‌కి వచ్చి వాళ్ళని రిసీవ్ చేసుకున్నాడు. తరువాత అందరూ కలసి కారులో యింటికి వచ్చారు.

రాజశేఖరం భార్య నీరజ వాళ్ళని చిరునవ్వుతో లోపలకి ఆహ్వానించింది. పద్మకి అంతా క్రొత్తగా ఉంది. రాజశేఖరం వాళ్ళ ఇల్లు బయటకి చూపులకు చిన్నగా ఉన్నా లోపల చాల పెద్దది.

ముందుగా లోపలకు అడుగుపెట్టగానే కుడిచేతివైపు ఒక పెద్ద అలమారు ఉంది. లోపల వింటర్‌కోట్లు, స్వెట్టర్లు హేంగర్స్‌కి తగిలించబడి ఉన్నాయి. దానికి క్రింద భాగంలో బూట్లు, చెప్పులు వగైరా వరుసగా పెట్టబడివున్నాయి. అది దాటి రెండడుగులు ముందుకి వేస్తే ఎడమచేతి ప్రక్కగా పెద్ద లివింగ్ రూం ఉంది. అందులో అర్ధచంద్రాకారంగా అమర్చబడిన సోఫాలు, కుర్చీలు అమర్చబడిఉన్నాయి. నాలుగు వైపులా గోడలకి ప్రకృతిని మరపింపచేసే సుందరమైన సీనరీసు పెట్టబడిఉన్నాయి. ఒక ప్రక్కగా ఉన్న టేబుల్ మీద అధునాతనమైన సర్పాకారంలో ఉన్న టేబుల్‌లైట్సు ఉన్నాయి. ఆ లైట్సు వెలిగినప్పుడు మూడురంగుల కలయికలో వచ్చే కాంతి కనులను మిరుమిట్లు గొల్పుతుంది. ఈ డ్రాయింగు రూంలోంచి బయటకు వస్తున్నప్పుడు ఎడం చేతివైపు మేడమీదకి వెళ్ళడానికి మెట్లున్నాయి. తరువాత ఇంకొంచెం ముందుకి వెడితే అక్కడ ఒకచిన్న డ్రాయింగు రూం ఉంది. అందులో పసుపుకుంకుమలు కలబోసిన రంగులో ఖరీదైన కార్పెట్టు పరచబడి ఉంది. అందులో కుర్చీలు గాని, సోఫాలుగాని లేవు. ఒక ప్రక్కగా 'పియానో' దాని ముందు ఒక స్టూలు మాత్రం ఉంది. మరొక ప్రక్క తంజావూరు వీణ ఉంది. కిటికీలకు అందంగా అల్లుకున్న మనీప్లాంట్ గదికి రెండుమూలల క్రోటన్ మొక్కలున్న ఇత్తడి కుండీలు నీట్‌గా అమర్చబడి ఉన్నాయి. ఈగదిలోంచి బయటకు వస్తున్న దారికి కుడి ప్రక్కగా బేస్‌మెంటులోకి వెళ్ళడానికి మెట్లున్నాయి.

తరువాత కిచెన్, వాష్ రూం ఉన్నాయి. కిచెన్‌లో ఏ వస్తువు క్రింద పెట్టుకోనవసరం లేకుండా అలమారాలు గోడకి అమర్చబడి ఉన్నాయి. అన్ని కరెంటు పరికరాలే. బేస్‌మెంటు చాల పెద్దదిగా ఉంది. అందులో రెండు సోఫాలు, టి.వి. అండ్ వీడియో, ఫ్రిజర్, వాషింగ్ మిషన్, డ్రైయింగ్ మిషన్ యింకా చాల వస్తువులు పొందికగా నీట్‌గా పెట్టబడి ఉన్నాయి.

నీరజ వివరిస్తూ చూపిస్తూంటే పద్మ ఇల్లంతా చూసింది. "ఇక్కడ ఇళ్ళన్నీ ఇలాగే ఉంటాయేమో' అని పద్మ మనసులో అనుకుంది. ఇల్లంతా చూసాక అందరూ డ్రాయింగురూంలో కూర్చుని కబుర్లు చెప్పుకుంటున్నారు. నీరజ డైనింగ్ హాలులో భోజనాలకి కావలసిన ఏర్పాట్లు చేస్తోంది. పద్మకూడ హెల్ప్ చేస్తోంది. "మీకెందుకండీ శ్రమ, అసలే ప్రయాణం బడలికతో ఉన్నారు. అలా కుర్చీలో కూర్చోండి. అన్నీ రెడీ అయిపోయాయి. ఇంక మంచినీళ్ళు పెట్టేస్తే అయిపోయినట్లే' అని పద్మతో అంది నీరజ.

పిల్లలు బేస్‌మెంట్‌లో టి.వి. వాచ్ చేస్తున్నారు. నీరజ డ్రాయింగు రూంలోకి వచ్చి "ఇంక కబుర్లు చాలుకాని భోజనానికి లేవండి. పాపం వాళ్ళు ఎప్పుడనగా భోజనం చేసారో" అని అంటూ పిల్లల్నికూడ పిలిచింది నీరజ.

అందరూ కలసి సరదాగా కబుర్లు చెప్పుకుంటూ భోజనం ముగించారు. వంటలు చాల రుచిగా ఉన్నాయని పద్మ మెచ్చుకొంది. మాటల సందర్భంలో 'డౌన్ టౌన్' ప్రాంతంలో ఒక అపార్ట్‌మెంటు చూసామని చాల బాగుందని, అద్దెకూడ ఎక్కువకాదని రాజశేఖరం వాళ్ళకి చెప్పాడు.

"చాల థాంక్స్‌రా! మీరు లేకపోతే మేము యిక్కడ ఎన్నికష్టాలు పడాల్సివచ్చేదో" అంటూ కృతజ్ఞతా పూర్వకంగా రాజశేఖరం వైపు చూసాడు శ్రీకాంత్.

తరువాత అందరూ నిద్రపోవడానికి ఎవరిగదుల్లోకి వాళ్ళు వెళ్ళారు. ప్రయాణం వల్ల అలసిఉన్నారేమో ప్రశాంత్ వాళ్ళకి వెంటనే నిద్రపట్టేసింది.

*

ఆకాశం కడిగిన ముత్యంలా ఉంది. మధ్య మధ్యలో రెండు మూడు నల్లమబ్బులు ఒకదాని వెంట మరొకటి పరుగులు తీస్తున్నాయి. బయట రోడ్లన్నీ వర్షానికి తడిసి నల్లగా నిగనిగలాడుతూ మెరుస్తున్నాయి. రోడ్లకిరువైపులా ఉన్న మేపుల్ లీపు చెట్లు దిగంబరంగా నిలబడి ఉన్నాయి. కిచెన్‌లో పాత్రలు మ్యూజిక్

చేస్తున్నాయి. అంతా నిశ్శబ్దంగా ఉంది.

పద్మ మెల్లగా కళ్ళు తెరిచింది. ఒక్కసారి చుర్రున మండాయి. ఒళ్ళంతా బరువుగా ఉంది. టైమెంతయిందో అని చేతి వాచీ వంక చూసింది. అయ్యబాబోయ్ అనుకుంది. ఏమిటో పాడునిద్ర మత్తుగా పట్టేసింది. తన జీవితంలో ఎప్పుడు ఇంత సేపు నిద్రపోలేదు. ప్రక్కకి తిరిగి చూసింది. భర్త, పిల్లలు యింకా గాఢనిద్రలోనే ఉన్నారు. "ఛీ! ఛీ! సిగ్గుచేటు'' అనుకుంటూ దుప్పటి తొలగించుకుని మంచపై నుండి లేచి మేడమీంచి క్రిందకు దిగివచ్చింది.

"గుడ్ మార్నింగ్ పద్మా! రాత్రి బాగా నిద్ర పట్టిందా? నా వంటింటి మ్యూజిక్‌తో మెలకువ వచ్చిఉంటుంది. అవునా?'' అని పద్మని పల్కరించింది నీరజ.

"ఐయామ్ సారీ నీరజా! టైం కూడా తెలీకుండా నిద్రపోయాను. లేకపోతే ఏమిటి చెప్పు ఉదయం పదిగంటల దాకా నిద్రపోవటం ఏమిటి?'' అని తప్పు చేసిన దానిలా మాట్లాడింది.

"ఎందుకలా తప్పుచేసినట్లు మాట్లాడుతారు? ఇక్కడ వాతావరణాన్ని బట్టి మనకి అలా అన్పిస్తుంది. అంతెందుకు మావార్ని, పిల్లల్ని చూడండి, సెలవు వచ్చిందంటే వాళ్ళు లేచేది పన్నెండు గంటలకే. నెమ్మది నెమ్మదిగా మీకే అర్థం అవుతాయి. ఇక్కడి అలవాట్లు, పద్ధతులూను'' అని అంటూ ''మొహం కడుక్కుంటారా? లేక బెడ్ కాఫీ త్రాగుతారా?'' అని నవ్వుతూ అడిగింది నీరజ.

"ఇంకా అంతదాకా రాలేదు'' అని నవ్వుతూ వాష్ రూంవైపు వెళ్ళింది పద్మ.

పద్మ వచ్చేటప్పటికి నీరజ కాఫీ తయారు చేసింది. ఇద్దరికీ చెరొక కప్పులోనూ పోసి ఒకటి పద్మకిచ్చి, ఒకటి తను తీసుకుని "బాల్కనీలో కూర్చుందాం రండి పద్మా!'' అంటూ యిద్దరూ కలసి బాల్కనీలో వేసివున్న కుర్చీలలో కూర్చుని కాఫీ త్రాగుతూ మాట్లాడుకుంటున్నారు.

"ఇక్కడ వాతావరణం చాల బాగుంది'' అంది పద్మ.

"ఓ! య్యా! ఇప్పుడు సమ్మర్ కాబట్టి కొంచెం పర్వాలేదు. ఇంకోరెండు నెలలు పోతే అప్పుడు మొదలవుతాయి కష్టాలు''

"అంటే?'' అంటూ అర్థంకానట్టుచూసింది పద్మ.

"ఏముంది? వింటర్‌లో బయటకు వెళ్ళాలంటే పరమబోరుగా ఉంటుంది. రోజుల తరబడి మంచు కుప్పకుప్పలుగా పడుతూంటుంది. వర్క్‌కి వెళ్ళాలన్నా షాపింగ్‌కి వెళ్ళాలన్నా చాల కష్టంగా ఉంటుంది. ఎప్పుడు కాలుజారి ఎక్కడ పడతామో తెలీదు''

"అయితే పొరపాటున అందరం కలసి వచ్చాం అన్నమాట. ప్రాణాలతో ఇండియా తిరిగి వెడతామా?'' నవ్వుతూ అడిగింది పద్మ.

"అరెరే! అప్పుడే అంత భయపడిపోతే ఎట్లా? నేను వచ్చినప్పుడు కూడా ఇలాగే అనుకునే దాన్ని, కాని తరువాత తరువాత మనకే అలవాటైపోతుంది. కొత్తల్లో ఈ పరిస్థితులకు అలవాటు పడటానికి కొంత టైం పడుతుంది. మీరేమి కంగారు పడనక్కర్లేదు. మరి అవసరంగా ఇంట్లోకి కావలసిన వస్తువుల్ని మనం ఈ రోజు కొందాం. ఈ రోజు శనివారం గదా! షాపులు తెరిచివుంటాయి. ఆదివారం మాత్రం శెలవు. కొన్ని మెడికల్ షాపులు, ఫుడ్‌లైనర్సు ఇరవై నాలుగుగంటలూ పనిచేస్తుంటాయి''

"చాల థాంక్స్ నీరజా! మాకు అంతా కొత్తకదా! అంతా మీమీదే భారం'' అంది పద్మ నవ్వుతూ.

"నో! నో! అంతపెద్ద మాటలు మాట్లాడొద్దు పద్మా. ఇక్కడ మన తెలుగు వాళ్ళం ఉన్నదే కొద్దిమంది. అందువలన ఎవరికి ఏ సహాయం కావల్సొచ్చినా ఒకళ్ళకొకళ్ళం సాయపడాలి. మనం బంధువులకి, తల్లిదండ్రులకి, అత్తమామలకి, దూరంగా ఉంటున్నాం గదా! ఎప్పుడు కావాలంటే అప్పుడు ఇండియా వెళ్ళలేం గదా! అందుకనే ఇక్కడ నెలకో, రెండు నెలలకో పార్టీలు జరుపుకుంటారు. ఆ సందర్భంలో అందరూ కలుసుకున్న కాసేపు తమ బాధల్ని మరచిపోయి హేపీగా మాట్లాడుకుని కాలం గడుపుతారు'' అంది నీరజ.

"నిజంగా మీతో మాట్లాడుతుంటే మా పెద్దక్కతో మాట్లాడుతున్నట్టుంది. మరిరేపు అపార్ట్‌మెంటులోకి దిగాలి ఈరోజు షాపింగంటున్నారు గదా! మరి!''

"నేను వెళ్ళి పిల్లల్ని లేపుతాను'' అంటూ పద్మ లేవబోయింది.

"ఆ! అన్నట్టు రాత్రి అడగటం మరిచాను. పిల్లల పేర్లేమిటి?'' అంది నీరజ.

"పెద్దమ్మాయి పేరు కీర్తిక, చిన్నదానిపేరు దీపిక''

"పేర్లు చాల అందంగా ఉన్నాయి. ముచ్చటైన పిల్లలకు అందమైన పేర్లు. వెరీగుడ్. మావాడి పేరు మనోహర్. ఉద్యోగం చేస్తున్నాడు. అమ్మాయి పేరు శిల్ప హైస్కూల్లో చదువుతోంది.''

ఇంతలో రాజశేఖరం, శ్రీకాంత్‌లు ఒకళ్ళకొకళ్ళు అనుకున్నట్టుగా ఒకేసారి నిద్రలేచి క్రిందకు వచ్చారు.

''ఏమిటి ప్రొద్దున్నే తీరుబడిగా ఆడవాళ్ళిద్దరూ బాతాఖానీ

వేసుకుంటున్నారు?'' అని అంటూ బాల్కనీలో ఉన్న మరొక కుర్చీలో కూర్చోబోయాడు రాజశేఖరం.

"ఆ! ఆ! ఆగండాగండి! మీరు యిప్పుడు ఇక్కడ చతికిలబడితే తొందరగా లేవరు. మధ్యాహ్నం షాపింగ్‌కి వెళ్ళాలి. తొందరగా తయారైతే లంచ్ చేసి బయలుదేరుదాం'' అంటూ కుర్చీలోంచి లేచింది నీరజ.

ఆమెతో పాటు పద్మకూడ లోపలకెళ్ళింది.

"ఏం ఆడవాళ్ళురా బాబూ! వాళ్ళు గంటల తరబడి భర్తల్ని మర్చిపోయి మాట్లాడుకుంటే లేదుగాని కాసేపు మనం కూర్చుందాం అనుకునేటప్పటికి ఎర్రజెండా ఊపేస్తారు'' అనుకుంటూ యింక తప్పదన్నట్లు శ్రీకాంత్ వైపు చూసి వాష్ రూంవైపు దారితీసాడు రాజశేఖరం.

## 38

శ్రీకాంత్ ఫామిలీ, రాజశేఖరం ఫామిలీ కలసి మధ్యాహ్నం రెండు గంటలకి షాపింగ్‌కి బయలుదేరారు. పిల్లలు యింట్లోనే వీడియో చూస్తూ కూర్చున్నారు. దారిలో కనపడుతున్న ప్రదేశాలను, షాపింగ్ సెంటర్లను, ఇంకా మిగతా విషయాలను రాజశేఖరం డ్రైవ్ చేస్తూనే వాటి గురించి వివరించి చెబుతున్నాడు. మధ్య మధ్యలో నీరజ కూడా చెబుతోంది.

రాజశేఖరం కారుని ఒక ప్రక్కగా తీసి పార్క్‌చేసి లాక్‌చేసి పదండి అంటూ 'జయంట్ టైగర్' లో అడుగుపెట్టారు. అక్కడ వింటర్‌కి అవసరమయ్యే జీన్స్, వింటర్ కోట్లు, జాకెట్లు, థర్మల్, వింటర్ బూట్లు, మొదలైనవి కొన్నారు.

"అయ్య బాబోయ్! ఒక్కొక్కళ్ళు ఇంతింత బరువు మోసుకుంటు వింటర్‌లో బయటకు వెళ్ళాలా!'' అంటూ బాధగా చూసింది పద్మ.

తప్పదన్నట్లు చిరునవ్వుతూ చూసింది నీరజ.

తరువాత ఆ ప్రక్కన ఉన్న 'బే' లో కిచెన్‌లోకి కావలసిన సామాను కొనుక్కున్నారు. కొన్న వస్తువుల్ని కారుడిక్కీలో పెట్టి, ఇక్కడ 'హవేలీ' అనే ఇండియన్ రెస్టారెంట్ ఉంది. అక్కడ భోంచేసి వెడదాం అన్నాడు రాజశేఖరం.

"మరి పిల్లలో'' అంది పద్మ.

"వాళ్ళకోసం ఏం కంగారు పడక్కరలేదు. ఇంట్లో వాళ్ళకి కావలసినవి ఉన్నాయి. ఆ ఏర్పాట్లు శిల్ప చూస్తుంది.'' అని అంది నీరజ.

"సరే'' అంటూ అందరూ 'హవేలీ' లో భోజనం చేసి నెమ్మదిగా పదిగంటలు అవుతుండగా యిల్లు చేరారు. అప్పటికే పిల్లలు భోజనం ముగించారు. తెచ్చిన వస్తువుల్ని లోపల పెట్టి, కాసేపు పిచ్చాపాటి మాట్లాడుకుని 'రేపు ఉదయం అపార్ట్‌మెంటులో దిగాలి' అని అనుకుని అందరూ నిద్రకుపక్రమించారు.

*

చిత్రంగా అందరూ తొందరగానే లేచారు. కాలకృత్యాలు తొందరగా ముగించుకుని బ్రేక్‌ఫాస్ట్ తీసుకుని, శ్రీకాంత్, పద్మ రాజశేఖరం, నీరజలు పట్టుకెళ్ళవలసిన సామానుని కారులో పెట్టారు.

"పిల్లలు యింట్లో ఉంటారు. మనం వెళ్ళి సామాను సర్దేసుకుని మళ్ళీ వద్దాం. రాత్రి భోజనాలు అయ్యాక మీరు వెడుదురు గాని. మళ్ళీ రేపట్నుంచి తీరుబడి ఉండదు'' అని నీరజ చెప్పగా 'సరే' అని బయలుదేరారు.

అపార్ట్‌మెంటు సదుపాయంగానే ఉంది. రెండు బెడ్ రూములు, ఒక డ్రాయింగ్ రూము, కిచెన్, వాష్‌రూము, కిచెన్ వెనక ఒక పెద్ద స్టోర్ రూము ఉన్నాయి. కిచెన్‌లో అయితే ఫ్రిజ్, హీటర్ మొదలైనవి ఉన్నాయి. ఇక్కడ ప్రతి యింటిలోను ఈ వస్తువులు తప్పనిసరిగా ఉంటాయి.

తెచ్చిన సామాను గబగబ అన్ని గదులలోను సర్దేశారు. వాళ్ళకి తగిన జాగ్రత్తలు చెప్పారు శేఖరం దంపతులు. తరువాత యింటికి బయలుదేరారు.

రాత్రి సప్పర్ అవగానే పిల్లలతో బయలుదేరారు శ్రీకాంత్, పద్మలు. ఇంకా ఏమైనా అవసరమైతే ఫోను చేయమని, మొహమాటపడవద్దని చెప్పి వాళ్ళ అపార్ట్‌మెంటులో దింపి యింటికి తిరుగుముఖం పట్టారు రాజశేఖరం దంపతులు.

## 39

డయానా దంపతులు పైకి నిబ్బరంగా తిరుగుతున్నా మానసికంగా ఒకళ్ళకంటే ఒకళ్ళు క్రుంగిపోతున్నారు. అప్పుడే బ్రెంట్ ఇల్లు వదలివెళ్ళి నెల రోజులు దాటింది. ఎటువంటి వార్త తెలియలేదు.

ఎక్కడ 'మిస్సింగ్ బోర్డు' చూసినా కళ్ళ ముందు బ్రెంటే కనపడుతున్నాడు వాళ్ళకి. చిన్న పిల్లలైతే తెలీక మిస్సయి ఉంటారని అనుకుంటాం కాని వయసులో ఉన్న పిల్లలు, మరీ రెండు, మూడు సంవత్సరాల పిల్లలవలె పెద్దవాళ్ళుకూడా తప్పిపోతుంటే కారణం ఏమనుకోవాలి? ఎవరైనా మిస్సయినారని తెలిస్తే మన మనసు పరిపరి విధాలపోతుంది. అలాంటిది కన్న వాళ్ళబాధ మనం వర్ణించలేం.

ఎవరయినా ఎత్తుకుపోయారో, లేక మర్డర్ చేసారో, కిడ్నాప్ చేసారో, ఎవరి చేతుల్లో ఏం బాధలుపడుతున్నారో అని మనసులో అనేక ఆలోచనలు కందిరీగల్లా దొలిచేస్తాయి.

ప్రస్తుతం అలాంటి పరిస్థితులలోనే ఉన్నారు స్కాట్, డయానాలు. మనసుని రాయి చేసుకుని ఎవరి పనులు వాళ్ళు చేస్తున్నారు కాని, వాళ్ళ ఆలోచనలన్ని కొడుకు గురించే. ప్రశాంతంగా సాగే జీవితంలో బాధాకరమైన పరిస్థితి ఏర్పడింది.

## 40

కాల ప్రవాహంలో సూర్యచంద్రులు పడుతూ లేస్తున్నారు. మోడువారిన మేపుల్ లీపు చెట్లు పచ్చని పట్టు వస్త్రాలను ధరిస్తున్నాయి. చెట్ల తొర్రలో నల్ల ఉడుతలు దొంగాటలాడుకుంటున్నాయి. అద్దాల కిటికీలోంచి తెల్లపిల్లి వాటిని వింతగా చూస్తోంది. వాకింగ్‌కి వచ్చిన నల్ల బొచ్చుకుక్కపిల్ల నాలిక ఆడిస్తూ పరుగులు తీస్తోంది. జంటలు జంటలుగా నడుస్తున్న పాదాలు ఫుట్‌పాత్‌ల మీద ముద్రలు వేసుకుంటుపోతున్నాయి.

"క్రింగ్... క్రింగ్... క్రింగ్" అని కాలింగ్ బెల్లు మ్రోగటంతో 'ఎవరు వచ్చారా?' అని అనుకుంటు తలుపు తీసింది జెర్సీ. బయట నిలబడ్డ థామస్, విక్టోరియాలను చూసి ఆనందంతో ఆమె కళ్ళు ఒక్కసారి మెరిసాయి. వాళ్ళ వెనక పరుగెట్టు కుంటు, బాల్కనీ మెట్లు ఎక్కి వస్తున్న పింకీని చూసి, ఇంకా ఎవరైనా బయట ఉన్నారేమో అని తొంగి చూసింది జెర్సీ. అప్పటికే స్టీవ్ కారు ఆ వీధి చివర మలుపు తిరిగింది.

"ఆయ్! హనీ! హౌఆర్‌యూ" అంటూ థామస్ పలకరించాడు జెర్సీని.

"ఐ యామ్ ఫైన్" అంటూ పింకీని ముద్దుపెట్టుకొని, లోపలకు నడిచింది జెర్సీ.

ఆమె తల్లిదండ్రులు ఆమెని అనుసరించారు. అందరూ లివింగ్ రూంలో కూర్చున్నారు.

"మీరు ఎప్పుడు వచ్చారు? "ఉత్తరమైనా వ్రాయలేదు?" అంటూ తల్లిని అడిగింది జెర్సీ.

"మేము శుక్రవారం వచ్చాం యిక్కడకి. డాడీ వాళ్ళ ఫ్రెండ్ డాక్టర్ రాయ్ వాళ్ళ అబ్బాయి పెళ్ళి జరిగింది. ఎలాగూ లాంగ్ వీకెండ్ గదా అని బయలుదేరాము. మిమ్మల్ని చూసి కూడ చాల రోజులైంది" అని విక్టోరియా చెప్పింది.

"వీడికి ఎన్ని కబుర్లు వచ్చేశాయో బేబీ! మాట్లాడేకొద్ది వినాలనిపిస్తుంది. ఉదయం నుండి ఒకటే హడావుడి ఎప్పుడు యిక్కడకు వస్తామా అని" థామస్ నవ్వుతూ మనవడి ముచ్చట్లు చెబుతున్నాడు.

"కాఫీ తెస్తానుండండి డాడీ!" అంటూ కిచెన్‌లోకి వెళ్ళింది జెర్సీ. ఆమె వెనకే విక్టోరియా కూడా వెళ్ళింది.

"నేను టి.వి. చూస్తాను గ్రాండ్ పా" అంటూ తుర్రున టి.వి. ఉన్న రూంలోకి పరుగెట్టాడు.

థామస్ టీపాయ్ మీదున్న సిటిజన్ న్యూస్ పేపరు తీసి తిరగేయసాగాడు.

కొద్ది సేపటికి జెర్సీ ఒక ప్లేటులో మఫిన్స్, కూకీస్, చిప్సు, కాఫీ కప్పులతో డ్రాయింగ్ రూంలోకి వచ్చింది. విక్టోరియా కెటిల్‌లో నున్న కాఫీని కప్పుల్లో పోసి భర్తకి, కూతురికి యిచ్చి తనూ ఓ కప్పు తీసుకుంది.

"బేబీ! జాబ్ ఎలా ఉంది?" అని థామస్ కాఫీ సిప్ చేస్తూ కూతుర్ని అడిగాడు.

"పర్వాలేదు డాడీ! కాంట్రాక్ట్ కదా! వర్క్ ఎక్కువగానే ఉంటుంది. ఇంకో ఆరునెలలు దాకా పర్వాలేదు. తరువాత మరొక దానికి ట్రై చేయాలి"

"హనీ! పింకీ గురించి ఏం ఆలోచించావ్?"

"అంటే?" అర్థంకానట్టు తండ్రి వంక చూసింది.

"పింకీ పెద్దవాడవుతున్నాడు. వాడికి తల్లిదండ్రుల ప్రేమ ఎంతైనా అవసరం. దానికి మీ యిద్దరి సఖ్యతా అవసరం. కాని నీవిక్కడ, స్టీవ్ అక్కడ ఉంటే మీ యిద్దరి మధ్య ఆ పసివాడి భవిష్యత్ ఏమవుతుందో ఆలోచించావా? నీవు బయటకు వచ్చేసేముందు ఇటువంటి ఆలోచన నీకు కల్గలేదా?" అంటూ నెమ్మదిగా కూతుర్ని మందలించాడు థామస్.

"అసలు జరిగిన సంగతి మీకు తెలియదు డాడీ! నేను ఎంత మనఃక్షోభ అనుభవించానో తెలుసా డాడీ! నన్ను మీరైనా అర్థంచేసుకోండి డాడీ! ఇంకా నాకు భరించే ఓపికలేదు. కొద్ది రోజులలో స్టీవ్‌కి 'డైవోర్స్' ఇద్దామనుకుంటున్నాను. నేను ఎక్కడ ఉంటే పింకీ కూడ అక్కడే ఉంటాడు. తల్లిగా నాకు ఆ హక్కువుంది. ప్రస్తుతం నాకు కావలసిన లాయర్ ఊళ్ళోలేడు. అతను వచ్చాక మాట్లాడి ఈ సమస్యను పరిష్కరిస్తాను" అని ధైర్యంగా తండ్రికి చెప్పింది.

జెర్సీ మాటలకు థామస్, విక్టోరియాలు కించిత్తు ఆశ్చర్యపోయారు. తరువాత నెమ్మదిగా "చూడు హనీ! నేను చెప్పేమాటలు కొంచెం ఓపిగ్గా విను. నువ్వు కోపంలో, ఆవేశంలో తొందరపడి అర్థంలేని అపోహలతో ఈ నిర్ణయానికి రాకు. మరొకసారి

నిదానంగా నీ జీవితం గురించి ఆలోచించుకో. స్టీవ్ చాల మంచివాడు. నెమ్మదస్తుడు. జరిగిన సంగతంతా నాకు చెప్పాడు. దానికి అతను బాధకూడ పడ్డాడు. ఉద్యోగం అన్న తరువాత ఇంటికి రావటం కాస్త అటు, ఇటూ అవుతుంది. ఉద్యోగం మనదే అయినా పనిచేసేది మరి ఒకరిచేతుల్లో గదా! అది మన చేతుల్లో లేదుగదా బేబీ! ఒకవేళ అతని స్థానంలో నీవే వుంటే, అతను నీకు లాగే ప్రవర్తిస్తే ఎలా ఉంటుందో? ఒక్కసారి ఊహించు...! మీరిద్దరూ ఒకరికొకరు ఇష్టపడి ప్రేమించి పెళ్ళి చేసుకున్నారు. పిల్లలు కావాలనుకునేగా పింకీని కన్నావు. ఒకళ్ళని విడచి ఒకళ్ళు మీ ముగ్గురిలో ఏ ఒక్కరూ ఉండలేరు. నీ మొండితనం మానుకో. విడిపోవటం చాల తేలిక. నూటికి ఎంతమంది భార్యాభర్తలుగా కలిసి హాయిగా జీవితం గడుపుతున్నారో వ్రేళ్ళ మీద లెక్కపెట్టవచ్చు. అలాంటిది ఒక చిన్న కారణంగా నీ బంగారు భవిష్యత్‌ని చేజేతులా నాశనం చేసుకోవద్దు. నీ గురించి, పింకీ గురించి స్టీవ్ ఎంతలా బాధపడుతున్నాడో అతన్ని ఒక్కసారి చూస్తే తెలుస్తుంది. నీ గురించి అతను చేయవలసిన ప్రయత్నాలన్ని చేస్తూనే ఉన్నాడు. సుఖమైనా, కష్టమైనా వాళ్ళ జీవితాలు నీతో ముడిపడిఉన్నాయి. నిదానంగా, బాగా ఆలోచించు. నీకు చదువు, తెలివి తేటలున్నాయి. వాటిని వ్యర్థం చేయకు. నీ జీవితం సుఖంగా, ఆనందంగా ఉంటే మాకు సంతోషం. నీవు ఇలా ఒంటరిగా జీవితం గడపటం మాకు చాల బాధగా ఉంది. తండ్రిగా నాకు తోచింది చెప్పాను. ఆపై నీయిష్టం'' అని థామస్ కూతురుతో చెప్పాడు. జెర్సీ మౌనంగా తలదించుకుంది.

థామస్ మాట్లాడుతున్నప్పుడు అతని కళ్ళలోని తడిని విక్టోరియా చూడకపోలేదు.

విక్టోరియా టాపిక్ మారుస్తూ "హనీ! మేము లంచ్‌ముగించుకుని మధ్యాహ్నం కొద్దిగా షాపింగ్ ఉంది. అది పూర్తిచేసుకుని, సాయింకాలం స్టీవ్ దగ్గర కెళ్ళి పింకీని అప్పచెప్పి, ప్రొద్దున్నా బయలుదేరి మనవూరు వెళ్ళిపోతాం. ఉత్తరాలు వ్రాస్తుండు. అవసరమైతే ఫోన్‌చెయ్యి'' అంటూ కిచెన్‌లో లంచ్ ఏర్పాట్లు చేయడానికి లేచింది.

మధ్యాహ్నం మూడు గంటలవుతూండగా అందరూ టీ త్రాగి షాపింగ్‌కి బయలుదేరారు. బజారులో పింకీకి బొమ్మలు, రెండు, మూడు జతల బట్టలు కొంది జెర్సీ. షాపింగ్ ముగిసిన తరువాత అందరూ రైన్‌బో రెస్టారెంట్‌లో పీజా, ఫ్రెంచి ఫ్రైస్ తిన్నారు. తరువాత జెర్సీ వాళ్ళని స్టీవ్ యింటి వద్ద దింపి, పింకీని దగ్గరగా తీసుకుని బుగ్గమీద ముద్దిచ్చి, తల్లి దండ్రులకి బైబై చెప్పి, యింటికి బయలుదేరింది.

ఆ రాత్రి స్టీవ్ వచ్చాక జరిగిన విషయాలన్నీ చెప్పారు థామస్ తంపతులు. తమ ప్రయత్నం కూడ వ్యర్థం అయ్యిందన్నట్టు స్టీవ్ వంక చూసారు. పగలంతా తిరగటం వలన అలసిపోయి ఉన్నాడేమో తొందరగా నిద్రపోయాడు పింకీ. వాడు నిద్రలో 'ఐ లవ్ యూ మమ్మీ! మమ్మీ! ఐ లవ్ యూ!' అంటూ పలవరిస్తున్నాడు. అది స్టీవ్ విన్నాడు.

"పూర్ హనీ! ఐలవ్‌యూ!'' అంటూ వాడికి దుప్పటి సరిగా కప్పి, లైటార్పి గది బయటకు వచ్చాడు.

మర్నాడు ఉదయం థామస్, విక్టోరియాలు "మంచి వాళ్ళకి మంచి రోజులు తప్పక వస్తాయి. ధైర్యంగా ఉండటమే మనం చేయవలసిన పని'' అని స్టీవ్‌కి ధైర్యం చెప్పి తమ వూరు వెళ్ళిపోయారు. స్టీవ్ నిరాశగా ఒకవేడి నిట్టూర్పు విడిచాడు.

## 41

"ట్రింగ్... ట్రింగ్... ట్రింగ్!''

"హలో! పద్మా స్పీకింగ్!''

"హలో! పద్మగారా! నేనేనండీ రజనీని మాట్లాడుతున్నాను''

"రజనీగారా! నమస్కారమండీ!''

"నమస్కారమండీ! ఏమిటి? ఎలా ఉన్నారు? ఆటవాకి అలవాటు పడ్డారా?''

"ఆ! పర్వాలేదండీ! ఇప్పుడిప్పుడే కొంచెం కొంచెం అలవాటుపడుతున్నాం!''

"పిల్లలు స్కూలుకి వెళ్ళారా?''

"ఆ! వెళ్ళారండీ!''

"స్కూలు దగ్గరేనా లేక దూరమా?''

'మరీ అంతదూరం కాదులెండి. నడిచివెళ్ళిరావచ్చు''

"ఆ! ఇంతకీ నేను ఎందుకు ఫోన్ చేసానంటే వచ్చేశనివారం సాయంకాలం ఏడుగంటలకి సప్పర్‌కి మా యింటికి రావాలి''

"భోజనాలు అవీ ఎందుకండీ!''

"పర్వాలేదులెండి. మీరు క్రొత్తగా వచ్చారు గదా! ఆ రోజు మాయింటికి మరికొన్ని తెలుగు కుటుంబాలు కూడ వస్తున్నాయి. వాళ్ళతో మీకు పరిచయం అయినట్లు ఉంటుంది. మా యింటికి వచ్చినట్లూ ఉంటుంది''

"చాల థాంక్స్ రజనీగారూ!''

"గారు, గీరు వదిలేయండి. రజనీ అంటే చాలు. తరువాత మీరు మా

యింటికి రావటానికి మీకు రాజశేఖరం గారు రైడ్‌యిస్తారు.''

"అబ్బే! పర్వాలేదు లెండి. బస్సులో వస్తాం''

"మీరేం మొహమాటపడకండి. ఇక్కడ ఎవరూ ఏమీ అనుకోరు. మరి మర్చిపోకుండా రావాలి. ఓకేనాండి మరి!''

"థాంక్సండి''

"ఓకే! బై బై!''

"...........''

సాయంత్రం శ్రీకాంత్ వచ్చాక కాఫీ అందిస్తూ అతనితో రజనీ ఫోన్ చేసిన విషయం చెప్పింది పద్మ.

*

శనివారం సాయంత్రం ఆరుగంటలవుతుండగా నీరజ, రాజశేఖరం, శ్రీకాంత్ వాళ్ళ యింటికి వచ్చారు. కాసేపు పిచ్చాపాటి మాట్లాడుకుని ఆరున్నర ప్రాంతంలో బయలుదేరి రజనీ శర్మగారింటికి వెళ్ళారు. రజనీ, ఆమె భర్త శర్మ వాళ్ళని లోపలకు ఆహ్వానించారు. అప్పటికే నాలుగైదు ఫామిలీలు వచ్చాయి. డ్రాయింగు రూం చాల పెద్దగా 'ఎల్' ఆకారంలో ఉంది. క్రింద ఖరీదైన కార్పెట్టు పరచిఉంది. కొంతమంది సోఫాలో కూర్చున్నారు. మరికొంత మంది కార్పెట్టు మీద కూర్చున్నారు.

"పద్మా! ఈవిడేమో నిర్మలా రామకృష్ణ. మన తెలుగు అసోషియేషన్‌కి సెక్రెటరీ, ఈవిడేమో రాధామాధవన్ ఫుడ్ సెక్రటరీ, ఈవిడేమో వసుంధరా మోహన్ అని చెపుతూ అక్కడున్న వాళ్ళందర్నీ పద్మకి పరిచయం చేసింది రజనీ.

"అందరికీ చిరునవ్వుతూ నమస్కారాలు చేసింది పద్మ. ఎవరి కబుర్లలో వాళ్ళు పడిపోయారు. శర్మగారు వచ్చిన వాళ్ళకి సాఫ్ట్ డ్రింక్స్, చిప్సు అందించారు. శ్రీకాంత్‌కి అలవాటు లేదంటే "పర్వాలేదండీ! కొంచెం టేస్టు చూడండి'' అని బలవంతం చేసారు. కాని వాళ్ళ ప్రయత్నం ఫలించలేదు. మెత్తగానే వద్దన్నాడు శ్రీకాంత్.

వెనకనించి ఎవరో "ఇప్పుడు యిలా అన్నా యింకొన్నాళ్ళు పోతే ఆయన మనకే అందిస్తారు లెండి'' అని జోకేసారు.

సాఫ్ట్ డ్రింక్ త్రాగనివాళ్ళకి కోక్, పెప్సీ, ఆరెంజ్ జ్యూస్ ఎవరికేది యిష్టమో అది యిచ్చారు.

మధ్య మధ్యలో చిప్సు, సమోసాలు అందించారు.

ఒకళ్ళిద్దరైతే గ్లాసులమీద గ్లాసులు పట్టిస్తున్నారు.

పద్మకి అక్కడి వాతావరణం కొంచెం యిబ్బందిగానే ఉంది. రంగురంగుల లిప్‌స్టిక్ మొహాలు, రకరకాల హెయిర్ స్టైల్స్, చింపిరి జుట్టుల లేటెస్ట్ మోడల్స్‌తో హాలంతా హడావుడాగా ఉంది. కొంతమంది కిచెన్‌లోకి చేరి శాకపాకాలలో తమ ప్రావీణ్యతను చాటుకుంటున్నారు. మరి కొందరు ముత్యాల నగల గురించి, పుట్టింటివారి పెట్టుపోతల గురించి, అత్తింట్లో అగచాట్లు గురించి, వీకెండ్స్‌లో 'సేల్లో' అమ్మే వస్తువుల గురించి ఒకటనేమిటి? ఎవరికి నచ్చిన టాపిక్ గురించి వాళ్ళు మాట్లాడుకుంటున్నారు. బంగారం దగ్గర్నుంచి 'బైవార్డ్' మార్కెట్టుదాకా సాగుతోంది చర్చ.

"హలో!''

"హలో!'' అంటు నవ్వింది పద్మ.

"మీ పేరేమిటండీ''

"నాపేరు పద్మండీ!''

"వెరీగుడ్. నా పేరు సాహిత్యండీ''

"మీ పేరు చాల మోడరన్‌గా ఉందే'' ముక్తసరిగి అంది పద్మ.

"మావారిది, నాది ప్రేమ వివాహమండీ! మా శ్రీవారికి సాహిత్యం అంటే ప్రాణం. అందుకని వివాహానంతరం నాపేరు సాహిత్య అని మార్చుకున్నాను'' అని తన నామ వృత్తాంతాన్ని వివరించింది సాహిత్య.

"మీరు ఎక్కడుంటున్నారు?'' అని అడిగింది పద్మ.

"నేపీన్‌లో ఉంటున్నాం. మరి మీరు ఇండియాలో ఎక్కడ నుండి వచ్చారు?''

"హైద్రాబాద్ నుండి వచ్చాం''

"అరే! మాదీ హైద్రాబాదే''

''ఇంకేం రెండు హైద్రాబాద్‌లు ఒకచోట చేరితే కబుర్లకేం కొదవుండదనుకుంటా!''

"మీవారేం చేస్తుంటారిక్కడ?'' అని సాహిత్య అడిగింది.

"ఎన్. ఆర్. సి లో రిసెర్చి ఫెలోగా పనిచేస్తున్నారు''

"హో! హో! మేము యిక్కడకు వచ్చి మూడేళ్ళు అవుతోంది. ఇండియా వదిలేసి పదేళ్ళవుతోంది లెండి. అయిదేళ్ళు అమెరికాలో ఉన్నాం. తరువాత లండన్‌లో రెండేళ్ళు ఉన్నాం. ప్రస్తుతం యిక్కడ'' అని నవ్వేసింది. ఇంతలో రజనీ అక్కడకు వచ్చి భోజనానికి రమ్మనమని అందర్నీ పిలిచింది.

డ్రాయింగు హాలులోనే ఒక గోడవారగా పెద్ద డైనింగ్ టేబుల్ ఒకటుంది. దానిమీద రకరకాల ఇండియన్ వంటకాలు నీట్‌గా పెట్టబడిఉన్నాయి. వెజిటేరియన్, నాన్‌వెజిటేరియన్ వేరు వేరుగా పెట్టబడిఉన్నాయి. ఎవరిమటుకు వాళ్ళ ప్లేట్లు, స్పూన్లు తీసుకొని సర్వ్ చేసుకుంటున్నారు.

"పదండి! పదండి! మనమిక్కడ యిలాగే ఉంటే మనకి చివరకి గిన్నెలు కూడ మిగల్చరు'' అని పద్మతో నవ్వుతూ అంది సాహిత్య.

అందరూ తృప్తిగా భోజనాలు చేసారు. తరువాత కొందరు గ్రూపులు గ్రూపులుగా విడిపోయి చతుర్ముఖ పారాయణం మొదలెట్టారు. మరి కొంతమంది ధూమపానాన్ని ఆస్వాదిస్తున్నారు. మరికొంత మంది తమ గానామృతాన్ని అందరికి పంచుతున్నారు.

ఇంతలో కొంతమంది ఏకకంఠంతో "పద్మగారూ! మీరు ఒక పాట పాడాలి'' అని అన్నారు. పద్మ మొహమాటంగా తల అడ్డంగా ఊపింది. కాని అందరూ బలవంతం చేయగా తనకు నచ్చిన, వచ్చిన 'త్యాగరాయకృతి'ని చక్కగా పాడింది.

ఆమెపాడుతుంటే చతుర్ముఖ పారాయణం చేసే శాస్త్రీలతో సహా హాలంతా నిశ్శబ్దం అయిపోయింది.

"ఇంత చక్కగా పాడతారని మేమనుకోలేదండీ! చాల బాగా పాడారు'' అని అందరూ మెచ్చుకున్నారు.

అప్పటికే టైం ఒంటిగంటదాటింది. మెల్లి మెల్లిగా ఒక్కొక్కరే లేచి యింక వెడతామంటూ బయలుదేరారు. శ్రీకాంత్, పద్మలు కూడ రజనీశర్మల వద్ద శెలవు తీసుకుని రాజశేఖరం కారులో యింటికి బయలుదేరారు. శ్రీకాంత్, పద్మలను యింటివద్ద దింపి గుడ్‌నైట్ చెప్పి వాళ్ళ యింటికి వెళ్ళిపోయారు రాజశేఖరం దంపతులు.

"ఏమోయ్ శ్రీమతీ! పార్టీ ఎలా ఉంది?'' అని భార్యని అడిగాడు శ్రీకాంత్.

"పర్వాలేదు. సరదాగానే గడిచింది. వింత వింత మనుష్యులు, రకరకాల మనస్తత్వాలూను. విదేశాలలో ఉన్నా మన సంస్కృతి, మన ఆచార వ్యవహారాలను, సంప్రదాయాలను పూర్తిగా వదలలేక ఇటు యిక్కడ కల్చర్‌కి పూర్తిగా అలవాటు పడలేక కొట్టు మిట్టాడుతుంటారు యిక్కడ స్థిరపడ్డ వాళ్ళు'' ఎంతో అర్థమైన దాన్లా అంది పద్మ.

"అప్పుడే టైం చాల అయ్యింది. ఇంక పడుకుందాం పదండి'' అని అంటూ పద్మ బెడ్ రూంలోకి నడిచింది.



## 42

కాలగమనంలో రోజులు సాగిపోతున్నాయి. ఆకులు రాలుతున్నాయి. చెట్లు చిగురిస్తున్నాయి. గతంలో జరిగిన సంఘటనలు మరుగున పడుతున్నాయి.

షీలా ఆరోగ్యం కొద్ది కొద్దిగా మెరుగుపడుతోంది. జాన్‌కి హైస్కూలు చదువు అయిపోయింది. యూనివర్సిటీలో ఏవో కోర్సులు తీసుకున్నాడు. రాత్రి పూట పార్ట్ టైం జాబ్ చేస్తున్నాడు. ఎటువంటి ఒడుదుడుకులు లేకుండా ఆ కుటుంబం సాగిపోతోంది. అటువంటి సమయంలో ఒక రోజు మధ్యాహ్నం మూడుగంటల ప్రాంతంలో షీలా యింటి ముందు ఒక కారు వచ్చి ఆగింది. కారులోంచి దిగిన వ్యక్తి నేరుగా షీలా యింటిలోకి వచ్చాడు. డ్రాయింగురూంలో మాట్లాడుకుంటున్న షీలా, స్టీవ్, జాన్‌లు ఒక్కసారి ఆ వ్యక్తిని చూసి రవంత భయం, ఆశ్చర్యంతో స్తబ్దులయ్యారు. వారిమధ్య నిశ్శబ్దం చోటు చేసుకుంది. కుర్చోమన కుండానే షీలా ప్రక్కనున్న సోఫాలో కూర్చున్నాడు. షీలాకి ఏం చేయాలో తోచలేదు. ఇన్నాళ్ళు తన గురించి ఆలోచనకూడలేని వ్యక్తి, తాను చచ్చిందో, బ్రతికిందో అక్కరలేని వ్యక్తి, తనని అర్ధాంతరంగా వదిలేసిన వ్యక్తి, భర్తని చెప్పుకుందుకు కూడ అర్హతకోల్పోయిన వ్యక్తి యీ రోజిలా అకస్మాత్తుగా వచ్చినందుకు క్షణం పాటు ఆశ్చర్యపడినా, మళ్ళీ ఏం తుఫాను పుట్టిస్తాడో అని భయపడసాగింది. అందుకే నోట మాట రాకుండ మౌనంగా ఉండిపోయింది.

"హలో షీలా! హౌ ఆర్‌యూ?'' అంటూ షీలాని పల్కరించాడు డేవిడ్.

"..................''

"హౌఆర్‌యూ చిల్డ్రన్?'' అని పిల్లల్ని అడిగాడు.

".........''

భార్యవద్దనుండి, పిల్లల వద్దనుండిగాని డేవిడ్‌కి ఎటువంటి సమాధానం రాలేదు.

"ఐయామ్ వెరీ వెరీ సారీ హనీ! జరిగిన దానికి నేను చాల బాధపడుతున్నాను. మీరు లేకుండా ఇన్నాళ్ళు నేను ఎంతగానో బాధ పడ్డాను. నిజంగా నేను మీకు చాల అన్యాయం చేశాను. నన్ను క్షమించు హనీ! ప్లీజ్'' అంటూ ఆమె రెండు చేతులు పట్టుకోబోయాడు.

డేవిడ్ ప్రవర్తనకి కొంచెం దూరంగా జరిగింది షీలా.

"నన్ను నమ్ము షీలా! ఇక నుండి మిమ్మల్ని విడిచి ఒక్క క్షణం ఉండను. మిమ్మల్ని ప్రేమగా చూసుకుంటాను. ప్రామిస్ షీలా! ప్రామిస్''

షీలా అతనికి సమాధానం ఎలా చెప్పాలా అని ఆలోచిస్తోంది కాని ఇంతలో జాన్ ధైర్యాన్ని కూడ గట్టుకొని డేవిడ్‌తో,

"ఇన్నాళ్ళబట్టి అక్కరలేని మేము ఈ రోజు మీకు కావల్సొచ్చామా? ఎటువంటి పరిస్థితిలో మీరు ఇల్లు వదలివెళ్ళిపోయారో గుర్తులేదా? మీ చేతుల్లో మమ్మీ ఎంతటి నరకాన్ని అనుభవించిందో మర్చిపొమ్మంటారా? చివరకి చావు బ్రతుకుల్లో ఉన్న మనిషిని నిర్దాక్షిణ్యంగా వదిలేసినప్పుడు ఏమైంది మీ ప్రేమ? మానవత్వం ఉన్న మనిషిలా మీరెప్పుడైనా ప్రవర్తించారా? ఏనాడైనా మమ్మల్ని తండ్రిగా దగ్గరకు తీసుకున్నారా? హు! ఏనాడైతే మీరు మమ్మల్ని అనాధలుగా వదిలేసారో ఆనాడే మాకు తండ్రి లేడనుకున్నాం. మీరు యిక్కడ ఉండడానికి మేము ఏమాత్రం అంగీకరించం" అని గట్టిగా చెప్పాడు.

ఇంత ధైర్యంగా తండ్రి ఎదుట నిలబడి ఆ విధంగా కుండబ్రద్దలు కొట్టినట్లు మాట్లాడుతున్న కొడుకుని చూసి షీలా ఆశ్చర్యపోయింది. ఆ పసిహృదయం ఎంత క్షోభపడిందో? పిల్లలు తల్లి దండ్రుల ప్రేమకోసం ఎంతలా అలమటిస్తారో ఆమెకి అర్థం అయింది. ఇంతలో "షటప్! నాన్సెన్స్! వ్వాట్ డూ యూ మీన్" అని గట్టిగా అరిచాడు డేవిడ్.

షీలా తన ఆలోచనలోంచి తేరుకొని "మిస్టర్ డేవిడ్! మర్యాదగా యిక్కడనుండి వెళ్ళిపోండి. అనవసరంగా రభస చేయవద్దు. ఇక నుండి మీతో మాకు ఎటువంటి సంబంధమూ లేదు. త్వరలో మీకు విడాకులు యివ్వ దలచుకున్నాను. ఎటువంటి పరిస్థితులలోను ఈ యింటి ఛాయలకు కూడ రావద్దు. అనవసర ప్రసంగం చేయక ఇక వచ్చిన దారినే వెళ్ళండి" అంటూ డేవిడ్‌ని నెమ్మదిగా మందలించింది షీలా.

"డామిట్! నువ్వు నాకు విడాకులిస్తావా? ఎలా యిస్తావో చూస్తాను. నా యిష్టం లేనిదే నీకు విడాకులు ఎవరిస్తారు? భర్త అన్న తరువాత పొరపాటు జరగవచ్చు. దానికి అసలు నీకు, నాకు సంబంధం లేదంటే ఎలా? నువ్వు కాదన్నా నేను నీకు చట్టరీత్యా మొగుణ్ణి. ఎవరడ్డు వస్తారో చూస్తాను" అంటూ పిచ్చిగా రంకెలు వేయసాగాడు.

ఇదంతా గమనిస్తున్న స్టేసీ మౌనంగా తన గదిలోకి వెళ్ళిపోయింది. ముందు ఏం జరగబోతుందో అని ఆమెకి భయంగా ఉంది. అసలే డేవిడ్ కోపిష్టి. మళ్ళీ తల్లి మీద ఏం అఘాయిత్యం చేస్తాడో అని గదిలోకి వచ్చిన వెంటనే పోలీసులకి ఫోన్ చేసింది.

క్రింద నుండి ఏవో శబ్దాలు వినిపించటంతో ఏమిటా? అని గది బయటకు వచ్చి చూసింది స్టేసీ. డేవిడ్ టేబుల్‌పై ఉన్న ఫ్లవర్ వాజ్‌ను గోడకేసి కొట్టాడు "మీరందరూ ఏకమైనన్ను బయటకు గెంటేద్దామనుకుంటున్నారేమో! అలాంటి ఆశ వదులుకోండి. తండ్రిగా నన్ను గౌరవించకుండా యింటికి వచ్చిన నన్ను అవమానిస్తారా! అసలు ఇదంతా నువ్వు యిచ్చిన అలుసు" అంటూ ఆమె జుట్టుపట్టి గట్టిగా లాగి వీపుమీద కొట్టాడు. ఆ దృశ్యం చూసిన జాన్ తనని తను నిగ్రహించుకోలేక పోయాడు. ఒక్కఉదుటున తండ్రి వద్దకు వెళ్ళి రెండు చేతులు పట్టుకుని వెనక్కి లాగాడు. ఇంతలో కాలింగ్ బెల్ మ్రోగటంతో జాన్ వెళ్ళి తలుపు తీసాడు. ఎదురుగా ఉన్న పోలీసుల్ని చూసి ఆశ్చర్యపోయాడు. వెంటనే తనని తాను తమాయించుకుని వాళ్ళకి దారిచ్చాడు.

అప్పటికే డేవిడ్ మళ్ళీ లేచి షీలాని కొట్టడానికి చేయిఎత్తాడు. అతను ఎత్తినచేయి ఎత్తినట్లే ఉండిపోయింది. ఎదురుగా నిలబడున్న పోలీసుల్ని చూసి నివ్వెరపోయాడు డేవిడ్. షీలా జరిగిన విషయం వివరంగా పోలీసులకు ధైర్యంగా చెప్పింది. వెంటనే పోలీసులు డేవిడ్‌ని తమకూడ పోలీసుస్టేషన్‌కి తీసుకుపోయారు.

పోలీసులు వెళ్ళిన తరువాత తలుపేసి తల్లి వద్దకు వచ్చాడు జాన్. ఆమె సోఫాలో నిస్త్రాణంగా పడిఉంది. స్టేసీ వెంటనే ఓ గ్లాసు ఆరెంజ్ జ్యూస్ తెచ్చి తల్లి కిచ్చింది. ఆమె రెండు గుక్కలు త్రాగి, గ్లాసుని టీపాయ్‌మీద పెట్టేసింది.

"ఐ యామ్ సారీ మమ్మీ!" అని బాధగా అన్నాడు జాన్.

"నో! హనీ! నిజంగా మీరు దేవుడిచ్చిన వరాలు నాకు"

"మమ్మీ"

"అవును, స్టేసీ ఇలా దగ్గరకురా" అని ఇద్దర్నీ దగ్గరగా చెరొకప్రక్క కూర్చో పెట్టుకొని, నాకిప్పుడు ఏ బాధాలేదు. కాని ఆ దుర్మార్గుడు ఎప్పుడు వచ్చి మిమ్మల్ని ఏం చేస్తాడో అని భయంగా ఉంది"

"డోంట్ వర్రీ మామ్! నీకు అలాంటి భయమేమి అక్కరలేదు. వాడు మమ్మల్ని ఏమీ చేయలేడు. మేమున్నంతవరకు నీకు ఏ భయం అక్కరలేదు. కాని కొన్నాళ్ళు నీవు వాడికి కనపడకుండా ఉంటే మంచిది" అని తల్లికి ధైర్యం చెప్పాడు జాన్.

"ఇంతకీ ఈ విషయం పోలీసులకెలా తెలిసిందీ?"

"నేనే ఫోన్ చేసాను మమ్మీ! అప్పటిపరిస్థితి చూస్తే ఏం జరుగుతుందో అని భయం వేసింది. నాకు ఏం చేయాలో తోచలేదు. వెంటనే ఈ ఆలోచన వచ్చింది.

కూతురుగా ఆ పని నేను చేయకూడనిదైనా చేసాను'' అని తప్పుచేసినదానిలా తల దించుకుంది స్టేసీ.

"ఓ! హనీ! నిజంగా నేనెంత అదృష్టవంతురాల్ని'' అంటూ కళ్ళు వత్తుకుంది.

ఇంతలో మళ్ళీ కాలింగ్ బెల్ మ్రోగింది.

మళ్ళీ తండ్రి వెనక్కి తిరిగి వచ్చాడా? అని కాసేపు అందరూ మౌనం వహించారు. కాని రెండు, మూడుసార్లు మ్రోగటంతో యింక లేచి తలుపు తీయక తప్పిందికాదు జాన్‌కి.

తలుపుతీసి బయటకు చూసాడు జాన్. ఎదురుగా ఉన్న డయానాని చూసి సంతోషంగా నవ్వాడు.

"మమ్మీ! ఎవరొచ్చారో చూడు'' అంటూ తల్లిని పిలిచాడు.

ఎవరా అని సోఫాలోంచి నెమ్మదిగా తలని గుమ్మంవేపు త్రిప్పింది షీలా.

డయానా బూట్లను గుమ్మం వద్ద విడిచి లోపలకు వచ్చి,

"హౌఆర్ యూ షీలా'' అంటూ ఆమెని కౌగిలించుకుంది.

"ఫైన్'' అంటూ ఆనందంగా తన ప్రక్కన కూర్చోమని డయానాకి చెప్పింది.

"ఏమిటి? డల్‌గా ఉన్నావ్. ఒంట్లో నీరసంగా ఉందా?'' అని స్నేహపూర్వకంగా అడిగింది డయానా.

"ఆ! ఇప్పుడు ఇదివరకటి కన్నా పర్వాలేదు. కొద్ది నీరసంగా ఉంది. అది సరేగాని గ్రేసీ ఎలా ఉంది? బ్రెంట్ గురించి ఏమన్నా తెలిసిందా?''

"ప్చ్! ఎన్ని ప్రయత్నాలు చేసినా ఎక్కడ సమాచారం దొరకలేదు. ఎక్కడున్నాడో? ఏం కష్టాలు పడుతున్నాడో? స్కాట్ కాన్ఫరెన్స్ ఉందని లండన్ వెళ్ళాడు. గ్రేసీ యింట్లోనే ఉంది. బ్రెంట్ గురించి ఆలోచిస్తుంటే మతిపోతోంది. ఓసారి నిన్ను చూసి వెడదామని ఇలా వచ్చాను''

స్టేసీ టీకప్పుల తోను, బిస్కట్లు ప్లేటుతోను అక్కడకు వచ్చి అందరికి అందించింది.

డయానా టీ త్రాగుతూ యథాలాపంగా గోడకేసి చూసింది.

"అదేంటి? ఫ్లవర్‌వాజ్ పగిలిపోయింది?'' అని అనుమానంగా షీలా వంక చూసింది.

"ఏం చెప్పమంటావ్ డయానా! ఇప్పుడిప్పుడే మానుతున్న గాయం మళ్ళీ రేగింది. మధ్యాహ్నం డేవిడ్ వచ్చి నానా రభసా చేసి వెళ్ళాడు. చివరకి పోలీసులతో అతన్ని బయటకు పంపవలసి వచ్చింది'' అంటూ బాధగా సోఫాలో వెనక్కిజారబడింది.

"మరి అతనికి నీ అభిప్రాయమేమీ చెప్పలేదా?''

"చెప్పకేం! ఇకనుండి తనకి, నాకు ఎటువంటి సంబంధం ఉండదని, డైవోర్సు యిస్తానని, నాయింటికి ఇకముందు రావద్దని గట్టిగా చెప్పాను, కాని.... ''

"హు! కాని... ఏమన్నాడు?''

" 'ఎలా యిస్తావో చూస్తాను' అని బెదిరించాడు. ముందు ముందు ఏం జరుగుతుందో అని భయంగా ఉంది'' అని జాలిగా చూస్తూ అంది షీలా.

"షీలా! నువ్వు నన్ను అపార్థం చేసుకోకుండా ఉంటే స్నేహితురాలిగా ఒక సలహాయిస్తాను''

"ఏమిటది?'' అని ఆతృతగా చూసింది.

డయానా కొంచెం సేపు ఆలోచించి "ఏం లేదు షీలా! నువ్విలా ఎన్నాళ్ళు బాధపడతావ్? నీకిప్పుడు శారీరకంగా మానసికంగా రెస్టుకావాలి. పిల్లలు కూడ ఒకదారికి వస్తున్నారుగదా! మన సిటీలో 'బేటర్డ్ ఉమెన్స్ హోమ్' ఉంది. దాని అడ్రసు, ఫోన్ నెంబరు నా దగ్గరుంది. ఇస్తాను. అక్కడ వాళ్ళు నీకు రక్షణ కల్పిస్తారు. ఆ సంస్థ ఎన్నో సంసారాలను, జీవితాలను బాగుచేసింది. నీవు అక్కడ కొన్నాళ్ళుంటే నీ భర్త వలన నీకు ఎటువంటి భయం, హాని కలుగవు. ఆ తరువాత విడాకులు డేవిడ్ నుండి నువ్వు నిరభ్యంతరంగా తీసుకోవచ్చు. ఈ విషయంలో వాళ్ళు నీకు చాల సహాయం చేస్తారు. ఈ విషయం గురించి కాస్త సీరియస్‌గా ఆలోచించు'' అని తన బ్యాగ్ తెరచి అందులోంచి ఒక అడ్రసున్న కార్డు తీసి షీలాకిచ్చింది డయానా!

"థాంక్స్!'' అంటూ మౌనంగా ఆ కార్డుని అందుకుంది.

"ఆంటీ! మేముండగా మమ్మీకి ఎటువంటి హాని జరుగదు. ఆమెని మేము కంటికి రెప్పలా చూసుకుంటాం'' అని జాన్ అన్నాడు.

"మీరింకా చిన్నవాళ్ళు జాన్! నువ్వు మంచి జాబ్‌లో స్థిరపడేంతవరకు మమ్మీకి అక్కడ రక్షణ ఉంటుంది. మీరేం భయపడవలసిన పనిలేదు. నేను,. అంకుల్ మీకు తోడుగా ఉంటాం. అంతగా అవసరమనిపిస్తే మీరు మా యింట్లోనే ఉందురుగాని. మమ్మి కొన్నాళ్ళు అక్కడ ఉంటేనే మంచిది'' అని జాన్‌కి ధైర్యాన్నిచ్చింది.

"ఆంటీ! మాకు మీ సహాయం లేకపోతే మేము ఏమై పోయేవాళ్ళమో గదా! మీ మాటలు మాకు కొండంత ధైర్యాన్ని యిస్తున్నాయి'' అని జాలిగా ఆమె వంక

చూసాడు జాన్.

తరువాత చాలసేపు ఆ కబురు, ఈ కబురు మాట్లాడి డయానా యింటికి వెళ్ళిపోయింది.

## 43

ఎప్పుడు వీకెండ్‌లో తొందరగా నిద్రలేవని కీర్తిక ఆ రోజు అందరి కంటె ముందు లేచింది. త్వరత్వరగా తనపనులు ముగించుకుంది. చాల అందంగా, ట్రిమ్‌గా మేకప్ అయింది. పద్మకూతుర్ని గమనిస్తూనే ఉంది. టిఫిన్ తీసుకుని "మమ్మీ! నేను మా ఫ్రెండ్ వాళ్ళ యింటికి వెడుతున్నాను. సాయంత్రం అవుతుంది వచ్చేటప్పటికి'' అని చెప్పి సమాధానం కోసం ఎదురుచూడకుండా చెప్పులేసుకుని బయటకు వెళ్ళిపోయింది.

ఈ మధ్య కీర్తిక ప్రవర్తనలో మార్పువస్తోంది. కెనడా వచ్చాక యిక్కడి పద్ధతులు కొన్నిటికి అలవాటు పడకతప్పటంలేదు. ఫ్రెండ్సనీ, పార్టీలని ఎప్పుడు ఏదో ఒక హడావుడి ఉంటూనే ఉంటుంది. అది ఇది కాకపోతే రెండు మూడు ఫామిలీలు కలసి పిక్‌నిక్ అని చెప్పి ఎక్కడికో అక్కడకి వెళ్ళిరావటం సరిపోతోంది. కీర్తికకూడా ఫ్రెండ్సని, పార్టీలని, పిక్‌నిక్‌లని వెడుతూనే ఉంటుంది. ఎంతయినా ఆడపిల్ల, అలా తిరగటం మంచిది కాదని పద్మకి తెలుసు. అందుకనే అప్పుడప్పుడు మెల్లిగా మందలిస్తూనే ఉంటుంది పద్మ.

"పద్మా! పద్మా!'' అంటూ శ్రీకాంత్ కిచెన్‌లోకి వస్తూ "ఏమిటి ఈ రోజు స్పెషల్'' అంటూ అక్కడున్న డిష్‌ల మీద మూతలు తీసి చూస్తున్నాడు.

"ఆ! ఏముంది! టిఫిన్ ఇడ్లీ, సాంబర్, కొబ్బరి చెట్నీ, కారప్పొడి'' అంది నవ్వుతూ.

"వండర్‌ఫుల్! మరిస్వీట్....''

"నా మొహం'' అంది చిరుకోపంగా.

"బ్రహ్మాండం. ఏదీ టేస్ట్ చేయనీ'' అంటూ ఆమె ముఖానికి దగ్గరగా తన ముఖం ఉంచబోయాడు.

"ఊఁ! ఊఁ! ఆగండాగండీ'' అంటూ ప్రక్కకి తప్పుకుంది.

"ఊఁ! అది సరేగాని పద్మా! నిన్న చెప్పటం మర్చిపోయాను. వరంగల్ నుండి లెటర్ వచ్చింది. అమ్మ, నాన్న విజిటింగ్‌కి ఈ సంవత్సరం యిక్కడికి వద్దామనుకుంటున్నారు. కావలసిన వివరాలు,. వగైరా వ్రాయమని వ్రాసారు'' అంటూ ఉత్తరం పద్మ చేతికిచ్చాడు శ్రీకాంత్.

పద్మ ఉత్తరాన్ని అందుకుని చదివింది. "అంతా బాగానే ఉంది. కాని మరి వాళ్ళు యిక్కడి పద్ధతులకు, వాతావరణానికి అలవాటు పడతారో? లేదో?'' అంటూ తన అనుమానాన్ని వ్యక్తం చేసింది.

"దానికేంలే! కొద్ది నెలలే గదా! పర్వాలేదు'' అంటూ ఆమె బుగ్గ మీద చిటికేసాడు.

"అయితే వాళ్ళు రావడానికి కావలసిన ఏర్పాట్లు చూడండి'' అని ప్లేటులో ఇడ్లీలు, చెట్నీ పెట్టి శ్రీకాంత్‌కి అందించింది. టిఫిన్ తింటూ "ఈ వేళ మన ప్రోగ్రాం ఏమిటి?'' అని పద్మ వంక చూసాడు.

"ఆ! ఏముంది. సాయంత్రం శ్రీవాత్సవ వాళ్ళింటికి పార్టీకి వెళ్ళాలి. కీర్తిక పదింటికే బయటకు వెళ్ళిపోయింది. దీపిక టి. వి. చూస్తోంది'' అని జాబితా పూర్తి చేసింది.

"ఓకే! అయితే నేను స్నానం చేసి వస్తాను'' అని కుర్చీలోంచి లేచాడు.

పద్మ కిచెన్‌లో పని ముగించుకుని మిగతా రూములు శుభ్రం చేయటం మొదలు పెట్టింది. అప్పుడప్పుడు కీర్తిక గదితానే సర్దుతూంటుంది. అందువలన ఈ రోజు టైం ఉండటంతో కీర్తిక గదికూడ క్లీన్ చేస్తోంది. పెద్దగా శ్రమ లేకుండానే గబగబ సర్దడానికి వీలుగా ఉంది. సోఫాలో ఉన్న పుస్తకాలు తీసి షెల్ఫ్‌లో సర్దుతుండగా ఒక పుస్తకం చేతిలోంచి జారి క్రింద పడింది. ఆ పుస్తకంతో పాటు అందులో ఉన్న ఒక ఫొటో క్రింద పడింది. దానికి పద్మ చేతిలోకి తీసికొని పరీక్షగా చూసింది. అందులో కీర్తిక, ఆమె ప్రక్కన ఓ కెనడియన్ అబ్బాయి కలసి తీయించుకున్న ఫొటో అది.

ఇంతలో "మమ్మీ! మమ్మీ! నాకు జడవేయవూ'' అంటూ దీపిక పిలవటంతో గబగబ ఆ ఫొటో పుస్తకంలో పెట్టి షెల్ఫ్‌లో పెట్టేసింది పద్మ.

ఆ ఫొటో చూసిందగ్గర్నుంచి పద్మ మనసు మనసులో లేదు. ఆమె ఆలోచనలు అనేక విధాలుగా పోతున్నాయి. మిగతా పనులన్ని ఏదో విధంగా పూర్తి చేసేసింది.

సాయంత్రం అయిదవుతుండగా కీర్తిక హేపీగా యింటికి వచ్చింది. పార్టీకి వెళ్ళడానికి శ్రీకాంత్, దీపిక తయారవుతున్నారు. పద్మ లోపల ఏదో పనిలో ఉంది. "మమ్మీ... మమ్మీ... నాకు చాల ఆకలిగా ఉంది. ఏమైనా పెట్టు'' అంటూ, ముద్దుగా పద్మ దగ్గరకు వచ్చింది కీర్తిక.

"ఊరంతా బలాదూర్ తిరగటం పూర్తయిందా?" అంటూ కోపంగా అడిగింది పద్మ.

"అదేంటి మమ్మీ! నేను నీతో చెప్పే వెళ్ళానుగా!" కొంచెం బెదురుగా అంది కీర్తిక.

"ఆ! ఆ! చెప్పావు. ఏమని చెప్పావ్. ఊరు, పేరు, అడ్రసు లేకుండా చెబితే ఎక్కడికి, వెళ్ళావో! ఎవరితో వెళ్ళావో? ఎలా తెలుస్తుంది" కీర్తికని పరిశీలనగా చూస్తూ అంది.

"మమ్మీ! నీ మూడ్ బాగోలేనట్టుంది. డాడీ నిన్ను ఏమన్నా అన్నారా? చెప్పు. వెంటనే కోర్టులో దావా వేసేస్తాను. ప్లీజ్! చెప్పు మమ్మీ!" అంటూ మెడ చుట్టూ చేతులు వేసింది కీర్తిక.

"అబ్బ! ఉండు! నీకు ఎన్నేళ్ళు వచ్చినా చిలిపితనం, అల్లరి పోలేదు. పద! టిఫిన్ తిందువుగాని" అంటూ కిచెన్‌లోకి నడిచింది పద్మ.

కీర్తిక ఆకలి... ఆకలి... అంటూ డైనింగ్ టేబుల్ వద్ద కుర్చీలాక్కుని కూర్చుంది నీరసంగా.

టిఫిన్ ప్లేటులో పెట్టి కీర్తికకి ఇస్తూ "నువ్వు పార్టీకి వస్తావా? శ్రీవాత్సవ అంకుల్ పిలిచారు" అని కూతుర్ని అడిగింది.

కీర్తిక ప్లేటులోని పెరుగు వడల్ని చూసి 'ఓ మైడియర్ మమ్మీ యూ ఆర్ వెరీ గ్రేట్! తింటే నువ్వు చేసిన వడలే తినాలి. థాంక్యూ మామ్... థాంక్యూ" అంటూ అడిగిందానికి సమాధానం చెప్పకుండా తినడం మొదలెట్టింది. ఎంత కోపంగా ఉన్న మనిషైనా కీర్తిక మాటలకి నవ్వకుండా ఉండలేరు.

"నీ గొడవ నీదే గాని, నేనడిగిన దానికి జవాబు చెప్పవేం?" అంటూ పద్మ విసుగ్గామొహం పెట్టింది.

"ఓ! సారీమమ్మీ! ఈ వడలు, గారెలు ఉంటే యింకా పార్టీ ఏమిటి మమ్మీ! ఇంకా ఉన్నాయా? ఉంటే రాత్రికి ఆరగిస్తాను. పార్టీకి మాత్రం రాలేను. చాల అలసిపోయాను. రెస్టు తీసుకుంటాను. కోపం వద్దు మమ్మీ" అంటూ బుంగమూతి పెట్టింది.

"గారెలు తిని అలసిపోయావా? లేక..." అని యింకా ఏదో అనబోతుండగా,

"పద్మా! నువ్వింకా ఇలాగే ఉన్నావేమిటి? టైమవుతోంది. తొందరగా తయారవ్" అంటూ శ్రీకాంత్ తొందరచేయసాగాడు.

"కీర్తికా! నువ్వు రెడీయేనా?" అని తండ్రి పలకరించాడు.

"నో డాడీ! నేను రావటంలేదు" సంకోచిస్తూ చెప్పింది.

"రేపు ఆదివారమే గదా! రాకూడదూ!" అని అడిగాడు శ్రీకాంత్.

"లేదు డాడీ! ఆ పార్టీలంటే నాకు బోరు. ఇష్టం ఉండదు" గునుస్తూ అంది.

"సరే అయితే! నీ యిష్టం" అంటూ బయటకు వచ్చేసాడు. తరువాత శ్రీకాంత్, పద్మలు "ఇల్లు జాగ్రత్త, నువ్వూ జాగ్రత్త" అని హెచ్చరిస్తూ దీపికని వెంటపెట్టుకొని పార్టీకి వెళ్ళిపోయారు.

*

తల్లిదండ్రులు పార్టీకి వెళ్ళిపోయిన తరువాత కీర్తిక శుభ్రంగా షాంపూ పెట్టి తలస్నానం చేసింది. తెల్లని పల్చని నైటీ వేసుకుంది. జుట్టును 'హెయిర్ డ్రైయర్'తో డ్రై చేసుకుంది. ఇప్పుడు మనసెంతో హాయిగా ఉంది. ఫ్రిజ్‌లోంచి ఐస్‌క్రీమ్ తీసుకుని కప్పులో వేసుకుని డ్రాయింగ్ రూంలో సోఫాలో కూర్చుని తింటుంది. ఇంతలో సడన్‌గా ఏదో గుర్తుకురావటంతో లేచివెళ్ళి ఫోన్ ఎత్తి ఏదోనెంబర్ డయల్ చేసింది.

"హలో!"

"హలో!"

"హూ ఈజ్ దిస్?"

"హూ యామ్ ఐ?" అంది కొంటెగా.

"ప్రశ్నకి ప్రశ్న సమాధానమా?"

"యస్."

"యూ నాటీ! గుర్తుపట్టానులే! ఏమిటి వ్యవహారం? ఇంట్లో ఎవరూ లేరా?" అన్నాడు జాక్.

"ఊ! ఊ! మమ్మి, డాడీ పార్టీకి వెళ్ళారు!"

"అయితే ఇంటికి వచ్చేయనా?"

"ఏయ్! ఏమిటా చిలిపి మాటలు? ఇప్పటిదాకా కలసి ఉన్నది సరిపోలేదా?"

"నీతోఎంతసేపున్నా గంటలు క్షణాల్లా దొర్లిపోతాయ్ హనీ!"

"ఆ! ఆ!"

"ఊ! మరి చూడు. ఈ రోజు ఎంత ఆనందంగా గడిచి పోయిందో! మళ్ళీ అటువంటి అవకాశం ఎప్పుడు వస్తుందో? అంతవరకు నీ తీయని మధుర స్మృతులను స్మరించుకోవటమే కదా డార్లింగ్" అని విరహబాధగా అన్నాడు.

"ఏయ్! అప్పుడే డార్లింగ్ అనేస్తున్నావేంటి?''

"మరికాదా!''

"అవుననుకో! మరి మన పెళ్ళివిషయం ఆలోచించాలి గదా! అంతవరకు తొందరపడకుండా ఉంటే చాలు''

"నీకు పెళ్ళే కావలిస్తే నేను రెడీ!''

"ఆ! ఆ! మహాతొందరగా ఉందే!''

"మరి కాదా! నీవు వెళ్ళిన దగ్గరునుంచీ పరమ బోర్ కొట్టేస్తోంది. వీలుంటే రేపు ఈవినింగ్ రాకూడదూ...?''

"అమ్మో! అసలు ఈరోజుకే ఇంట్లో కొంచెం గొడవ జరిగింది. ఇంకా రేపు కూడానా...'' అని నసుగుతూ అంది కీర్తిక.

"ఒక్కదానివి ఏం చేస్తున్నావ్?''

"ఏముంది! వేడివేడి కాఫీ త్రాగుతున్నాను. హాయిగా తల స్నానం చేసాను.''

"స్నానం చేస్తున్నప్పుడు నేను గుర్తువచ్చానా?''

"ఏయ్ నాటీ! నీకు మరీ...!''

"అందుకే ఇప్పుడు మీ యింటికి వచ్చేస్తున్నా...''

"ఓకే!కీర్తీ! మరి ఉంటాను. గుడ్‌నైట్... '' అంటూ ఫోన్ పెట్టేసాడు జాక్.

జాక్ చాల అందంగా ఎత్తుగా చలాకీగా ఎప్పుడూ నవ్విస్తూ ఉంటాడు. మంచి ఉద్యోగం చేస్తున్నాడు. ఒకళ్ళనొకళ్ళు యిష్టపడి ప్రేమించుకున్నారు. తనకి కూడ చిన్న జాబ్ దొరికితే పెళ్ళి చేసుకుందామని అనుకుంది కీర్తిక. అతను మాట్లాడిన తియ్యని మాటల్ని తలచుకుంటూ మంచం మీదకు వాలి పోయింది.

"ఏ పరిస్థితులలోను ఈ మగాళ్ళకి మాత్రం లొంగిపోయి శీలాన్ని మాత్రం కోల్పోకూడదు'' అన్న మమ్మి మాటల్ని మాత్రం కీర్తిక మరచిపోలేదు. కాస్తకష్టంగానే ఉన్నా జాక్‌ని ఒక్కడుగా దూరంగానే వుంచుతోంది కీర్తిక. జాక్‌ని జాగ్రత్తగా అర్థం చేసుకునిగానీ ఒక నిర్ణయానికి రాకూడదు అనుకుంటూ నిద్రలోకి జారిపోయింది కీర్తిక.

## 44

జెర్సీ విషయం తెలిసిన తరువాత రెండు మూడుసార్లు ఫోన్‌లో మాట్లాడింది డయానా! కాని అసలు విషయాన్ని దాటేస్తూ మిగతా విషయాలు మాట్లాడేది. ఇంక ఇది కాదు పద్ధతి అనుకొని ఒకరోజు సాయంత్రం జెర్సీ అడ్రసు తీసుకుని వాళ్ళ యింటికి వెళ్ళింది డయానా. తలుపు తెరచిన జెర్సీ ఆశ్చర్యపోయింది. డయానాని చూసి సంతోషంతో లోపలకు ఆహ్వానించింది.

"హౌ ఆర్ యూ జెర్సీ!'' అంటూ డయానా పల్కరించింది.

"ఫైన్! ఏమిటి! వ్యాటే నైస్ సర్‌ప్రైజ్'' అంటూ నవ్వేసింది.

"ఆ! ఏముంది. జెర్సీ గారి దర్శనాలీమధ్య కరువయ్యాయిగదా! ఈ మధ్య మరి బిజీగా ఉంటున్నారు తమరు. ఎక్కడా మా వైపు చూడటంలేదు. ఏమిటి విశేషం?'' అని పల్కరించింది చనువుగా.

"విశేషం ఏముంది? ఇదిగో ఓ అయిదు నిమిషాలు ముందు యింటికి వచ్చాను. ఈ మధ్య ఆఫీసుపని ఎక్కువగా ఉంటోంది. వీకెండ్స్ కూడ పీక్కుతింటున్నాడు మా బాస్. ప్రొద్దున్నే 8 గంటలకు తగలబడతాడు ఆఫీసుకి. రాత్రి ఎనిమిదైనా కదలడు. మా ప్రాణాలు తీయడానికి కరెక్ట్‌టైం కు పోవాలి. ఏం చెప్పనులే నా బాధలు. సరేకాని కొద్దిగా కాఫీ కలుపుతాను అంటూ కిచెన్‌లోకి వెళ్ళింది జెర్సీ.

డయానా కూడ ఆమె వెంట వెళ్ళింది. కాఫీ కలుపుతూ "బ్రెంట్ గురించి ఏమైనా తెలిసిందా?'' అని అడిగింది జెర్సీ.

ఒక్కసారి డయానా ఉత్సాహమంతా నీరుగారి పోయిందా ప్రశ్నతో. "వాడి గురించి ఏమీ తెలియలేదు. చేయవలసిన ప్రయత్నాలన్నీ చేసాం. ఇంక ఆ దేవుడిదయ'' అని నిట్టూర్చింది డయానా.

"సారీ డయానా! అనవసరంగా నీ మనసు బాధ పెట్టాను'' అంటూ కాఫీ కప్పు, చిప్స్ ప్లేటు అందించింది జెర్సీ.

ఇంతలో తనని తాను సంభాళించుకుని మాట మారుస్తూ,

"ఇంకేమిటి విశేషాలు?'' అంటూ లివింగ్ రూంలోకి వచ్చి సోఫాలో కూర్చుంది డయానా!

జెర్సీ ఆమె ప్రక్కన కూర్చుంది. కాఫీ సిప్ చేస్తూ "ఏం ఉంది జీవితం. ఉదయం వర్క్‌కి పరుగెట్టటం, తినటం, పడుక్కోవటం. అంతకన్నా ప్రత్యేకంగా ఏం లేదు.'' అంటూ నిరాశగా మాట్లాడింది జెర్సీ.

"అదేంటీ? అప్పుడే అంత వేదాంతం వచ్చేసింది. నువ్వే అలా మాట్లాడితే మరి నా సంగతేమిటి చెప్పు. అది సరేగాని పింకీ వస్తున్నాడా? స్టీవ్ ఎలా ఉన్నాడు?'' అని అడిగింది డయానా.

"వాళ్ళకేం! వాళ్ళు బాగానే ఉన్నారు. నేను లేనని ఏమాత్రం బాధ లేదు.

పింకీ కూడ నన్ను కాదని వెళ్ళిపోయాడు. వాడికి వాళ్ళ డాడీయే కావాలిట. కన్న తల్లిని కాబట్టి నేను బాధ పడుతున్నాను. కాని వాడికే మాత్రం లేదు....'' అని రోషంగా అంది.

"నువ్వు ఈ మధ్య స్టీవ్‌ని చూసావా?''

"యేదీ చాలా రోజులైందనుకుంటా. అయినా నాకంత టైంలేదు.''

"మరి అలాంటప్పుడు వాళ్ళు హాయిగా ఉన్నారని ఎలా అనుకుంటున్నావ్? జెర్సీ నేను నీకు చెప్పేంత పెద్దదాన్ని కాదనుకో! నీవు మాత్రం ఒక్కదానివి ఏం సుఖంగా ఉన్నావ్ చెప్పు. మాట పట్టింపు తప్పితే అంతకన్నా ఏం లేదు. నీమనసులో ఉన్న స్టీవ్ ప్రతిమను చెరిపివేయగలవా? అతని గురించి ఆలోచించకుండా ఉండగలవా? పింకీని దూరం చేసుకోగలవా? వీటిలో ఏదీ నీకు సాధ్యపడదు. ఎందుకో నీకు తెలుసు. మీ మధ్య ఉండే అనుబంధం అలాంటిది. ఒక్కసారి స్టీవ్‌ని వెళ్ళిచూడు. నీకే అర్థం అవుతుంది. ఇలా మాట్లాడుతున్నానని ఏమీ అనుకోకు. భార్యాభర్తల మధ్య కోపతాపాలు రావటం సహజం. ఒకళ్ళనొకళ్ళు అర్థం చేసుకున్నా వాళ్ళెవరూ వాటిని శాశ్వతం చేసుకోరు. వారి ప్రేమానురాగాలతో ఎటువంటి తుఫానులైనా సమసిపోతాయి. ఇక్కడ ఒంటరిగా నువ్వు బాధపడటం, అక్కడ వాళ్ళు బాధ పడటం ఏం బాగాలేదు. నీ పిలుపు కోసం వాళ్ళు వేయికళ్ళతో ఎదురుచూస్తున్నారు'' అని ప్రేమగా జెర్సీ భుజం మీద చేయి వేసి నచ్చచెప్పింది డయానా. డయానా చెప్పినదంతా ఓపిగ్గా వింది జెర్సీ.

"డయానా! ఒక్క ప్రశ్న అడుగుతాను జవాబు చెబుతావా?'' అని అడిగింది జెర్సీ.

"వ్వాట్ ఈజ్ ఇట్?''

''తప్పంతా నాదే అంటావా? సాటి స్త్రీగా నువ్వు నన్ను అర్థం చేసుకోలేకపోయావా?'' అని బాధగా అంది.

"అపార్థం చేసుకోకు జెర్సీ. తప్పు నీదని నేనటం లేదు. కొన్ని విషయాల్లో మనం నిమిత్త మాత్రులం. నేను ఎవర్నీ సమర్థించటం లేదు. ఆఫీసు, వర్క్, బాస్ మొదలైనవి మన చేతుల్లో లేవు. అవునా? ఇంతకు ముందే నువ్వన్నావ్ గుర్తుందా? మీ బాస్ పీక్కుతింటాడని. స్టీవ్ విషయంలో కూడ ఆరోజు అదే జరిగింది. ఉద్యోగం పోతే ఎంత అవస్థపడాలో నీకు తెలుసుగదా! భార్యపుట్టిన రోజున ఆమెతో ఆనందంగా గడపాలని ఏ భర్త కుండదు చెప్పు. స్టీవ్ వచ్చే ఉద్దేశ్యంతోనే గదా నీకు ఉంగరం కొన్నాడు. నీవు అతన్ని ఆమాత్రం అర్థం చేసుకోలేకపోయావా? తనుపడుతున్న మనో వేదనను మొన్న యింటికి వచ్చినప్పుడు చెప్పాడు స్టీవ్. పింకీ సంగతి వేరే చెప్పక్కరలేదు. వాడికి నీవంటే ఎంతయిష్టమో వాడి మాటల్లో నాకర్థం అయింది. వాడున్న కాసేపు నీ గురించి, నీతో గడిపిన సంఘటనలు గురించే మాట్లాడాడు. ఏది ఏమైనా నీవు కాలయాపన చేయకుండా ఈ విషయం గురించి బాగా ఆలోచించు. జీవితంలో పోయిన కాలాన్ని మనం మళ్ళీ పొందలేము. స్నేహితురాలిగా నేను ఇంతకంటే ఏం చెప్పలేను. చక్కని జీవితాన్ని పాడు చేసుకోవద్దు.'' అని సీరియస్‌గా చెప్పింది డయానా. జెర్సీ కాసేపు మౌనంగా ఉండిపోయింది.

"ఓకే జెర్సీ! నేను వచ్చి చాలసేపయింది. మరి నేను వెడతాను'' అంటూ లేచింది డయానా.

"థాంక్స్ డయానా! నా గురించి ఇంతలా ఆలోచిస్తున్నావ్. కృతజ్ఞురాల్ని'' అంది జెర్సీ.

"ఇట్స్ ఓకే! గుడ్‌నైట్'' అంటూ బయటకు వచ్చి కారు స్టార్ట్ చేసింది డయానా!

నవ్వుతూ వీడ్కోలు పలికింది జెర్సీ.

## 45

ఆఫీసు నుండి శ్రీకాంత్ చాల హుషారుగా ఇంటికి వచ్చాడు. వచ్చీరావటంతోనే "పద్మాడార్లింగ్! ఎక్కడా? నీకో మాంచి శుభవార్త'' అంటూ సోఫాలో టై లూజు చేసుకుంటూ కూర్చున్నాడు.

"ఏమిటీ విశేషం ఈ వేళ? తుఫానులా దూసుకువచ్చారు'' నవ్వుతూ అంది పద్మ. "అబ్బ! ఏం నవ్వు నవ్వావోయ్! ఊం సరేకాని నీకో గుడ్ న్యూస్! చెప్పుకోచూద్దాం!'' అని కళ్ళెగరేసాడు.

"ఆ! ఏముంది! మీ బాస్ ఓ పదిడాలర్లు జీతం పెంచి ఉంటాడు'' అంతేనా అన్నట్టు చూసింది పద్మ.

"ఆ! ఆ! అదికాదు గదా! మరి నే చెప్పేయనా?''

అదేదో తొందరగా తెలుసుకోవాలనే ఉద్దేశ్యంతో "ఆ! చెప్పేయండి! ఎంత తొందరగా చెప్పేస్తే అంత మంచిగా వేడి వేడి ......!'' అంది.

"ఆ! వేడి... వేడి...''

"పకోడిలు'' అంది.

"ఓస్! పకోడీలా! నేను ఇంకా ఏదో... ఏదో... అనుకున్నాను"

"ఊ! మీకు పెళ్ళికి ఎదిగిన కూతురున్నా అల్లరిమాత్రం మానలేదు. అదిసరేగాని ఇంతకీ అసలు సంగతి దాటేస్తున్నారు."

"మరి నే చెప్పే శుభవార్తకి మరి నువ్వేం యిస్తావ్?"

"ఏమిస్తాను. టిఫిన్‌తో పాటు కాఫీ యిస్తాను."

"అంతమంచి వార్తకి కాఫీయేనా?"

"మరింకేం కావాలో చెప్పండి. ఆలోచిద్దాం" అంది పద్మ.

"శ్రీకాంత్ ఒక్క క్షణం అటుఇటూ చూసి ఎవ్వరూ లేరని గ్రహించి నే చెప్పేవార్తకి ఓ తియ్యటి ముద్దిచ్చుకోవోయ్" అంటూ ఆమెచేయి పట్టిలాగి దగ్గరగా తీసుకుని ఆమె పెదవుల్ని ముద్దాడాడు.

"ఉష్! ఏమిటిదీ! మరీ చిన్న పిల్లాడిలా చిలిపి చేష్టలు మరీను" అంటూ చీర చెంగుతో మూతి తుడుచుకుంటూ ఇంతకీ అసలు సంగతి అంటూ గుర్తు చేసింది పద్మ.

శ్రీకాంత్ గొంతు సవరించుకుంటూ 'మనం ఓ అందమైన నూతన గృహాన్ని కొన్నాము. అందులోకి శనివారం వెడుతున్నాము" అంటూ నాటకపక్కీలో మాట్లాడాడు శ్రీకాంత్.

'మీకేమన్నా మతి పోయిందా? మొన్ననే గదా కారు కొన్నారు. మళ్ళీ అంతలోనే ఇల్లు కొనడమేమిటి?" అంటూ ఆశ్చర్యంగా అడిగింది పద్మ.

"అవన్నీ తరువాత విన్నవించుకుంటాం దేవిగార్కి.. ముందు మాకు మంచి స్వీట్ ప్రసాదించండి" అని గబుక్కున లేచి మళ్ళీ ఆమెని అందుకోబోయాడు శ్రీకాంత్.

పద్మ చటుక్కున తప్పించుకుని కిచెన్‌లోకి వెళ్ళి ఫ్రిజ్ తెరచి 'బాసంతీ' స్వీటున్న కప్పుని ఒకటి బయటకు తీసి ప్రశాంత్‌కిచ్చింది. అది చూసి "ఓహ్! మైడియర్ స్వీటీ ఇంతమంచి స్వీట్ యిచ్చినందుకు అందుకో ఇంకోటి" అంటూ ఆమెబుగ్గని అందుకున్నాడు.

"ఏయ్! ఏమిటి మీ అల్లరి? మరీ మితిమీరి పోతోంది. ఇంట్లో పిల్లలున్నారన్న జ్ఞానం కూడ లేదు" అంటూ చిరుకోపంగా అంది పద్మ.

"మరి ఆవిషయం ముందుగా చెప్పవేం?" అంటూ నెమ్మదిగా అన్నాడు. తరువాత నెమ్మదిగా స్వీటు తినటం మొదలెట్టాడు.

"ఊ! ఇప్పుడు చెప్పండి అసలు విషయం?" అంది పద్మ.

"అసలు సంగతి ఏమిటంటే పద్మాజీ! నా ఫ్రెండొకడు ఇల్లు అమ్మేసి 'లాస్‌ఏంజెల్స్' వెళ్ళిపోతున్నాడు. ఇల్లు క్రొత్తది. వాడు నాతో చెప్పాడు. అసలు వాడికి ఆ యిల్లు అమ్మటం ఇష్టం లేదట. కాని తప్పని సరి పరిస్థితులలో అమ్మవలసి వచ్చిందిట. డబ్బంతా ఒకేసారి ఇవ్వక్కరలేదు. ఇప్పుడు సగం ఇమ్మన్నాడు. మిగతాది అయిదారు నెలల్లో యివ్వవచ్చు. ఎందుకో నాకు వెంటనే తీసుకోవాలనిపించింది. అగ్రిమెంటు వగైరా అన్నీ పూర్తి అయ్యాయి. మళ్ళీ మనకి ఇటువంటి అవకాశం రాకపోవచ్చు. అంతా దేవి అనుగ్రహం" అంటూ ఆమెవైపు ఓరకంటితో చూసాడు శ్రీకాంత్.

"వ్వాట్ డాడీ! మమ్మీ, మీరు సీక్రెట్స్ మాట్లాడేసుకుంటున్నారు." అంటూ మేడమీంచి క్రిందకి దిగుతూ అడిగింది కీర్తిక.

"సీక్రెట్సు ఏం ఉన్నాయి తల్లీ! నీకు తెలియకుండానా? మీ డాడీ ఇల్లు కొన్నారుట. ఆ విషయం గురించి చెబుతున్నారు"

"ఓహ్! కంగ్రాచ్యులేషన్స్ డాడీ!" అంటూ అందంగా భుజాలెగరేసింది కీర్తిక.

"థాంక్స్ హనీ!"

"కెనడియన్ స్టైల్స్‌కేమీ తీసిపోరు తండ్రీ కూతుళ్ళిద్దరూ" అని వ్యంగ్యంగా అంది పద్మ.

"ఏం డాడీ! నేనేమన్నా పొరపాటుగా అన్నానా?" బుంగమూతి పెట్టుకుని అంది కీర్తిక.

"లేదమ్మా! మీ మమ్మీ మంగళవారం నాడు పుట్టింది గదా అందుకనే కొంచెం చిరుబురులాడుతూంటుందిలే! అంతే! మాట కొంచెం కరకుగానీ మనసు నవనీతం" అంటూ కూతురికి వత్తాసుపలికాడు శ్రీకాంత్.

"ఆ! ఆ! దాన్ని అలాగే వెనకేసుకురండి! అది ఇంకా చిన్నపిల్లనుకున్నారా? ఏమిటి?"

"అదేంటి పద్మా! తల్లి దండ్రులకి పిల్లలెప్పుడూ చిన్న పిల్లలే"

ఇంతలో పద్మ మరొక స్వీటు కప్పు తెచ్చి కీర్తిక కిచ్చింది.

"అదీ కీర్తి అమ్మ మనసు, అర్థం అయిందా?" అంటూ నవ్వేడు శ్రీకాంత్.

కప్పులోనున్న బాసంతీని చూసి "ఓహ్ మమ్మీ! ఇదంటే నాకు ఎంత ఇష్టమో, ఇంకో కప్పు ఉంటే ఇయ్యిమమ్మీ!" అంటూ స్వీటుని తినసాగింది కీర్తిక.

"పిచ్చిపిల్ల, ఏ మాయా మర్మం తెలీదు" అని మనసులో అనుకుంది పద్మ.

*

శనివారం ఉదయమే క్రొత్త ఇంటిలో పాలు పొంగించారు శ్రీకాంత్, పద్మలు. సామానుని అక్కడ నుండి యిక్కడికి తేవటంలోను, సర్దటంలోను నీరజా, రాజశేఖర్‌లు సహాయం చేసారు. ఇల్లు చాల అందంగా ఉంది. నష్టం లేకుండానే కొన్నారని రాజశేఖరం మెచ్చుకున్నాడు. తరువాత అందరూ కలసి భోజనాలు ముగించారు.

"గృహప్రవేశం అయింది. ఇంక కీర్తిక 'వెడ్డింగ్ కార్డ్' అందివ్వాలి" అని నవ్వుతూ అంది నీరజ.

ఆమాటకి కీర్తిక ఎటో చూస్తుండిపోయింది. తరువాత రాజశేఖరం, నీరజలు సెలవు తీసుకొని వాళ్ళ యింటికి వెళ్ళిపోయారు.

## 46

డ్రాయింగు రూంలో గోడగడియారం పన్నెండు గంటలు కొట్టింది. చిక్కని చీకటి ఇల్లంతా పరుచుకుంది. ఇల్లంతా నిశ్శబ్దం స్వైరవిహారం చేస్తోంది. బెడ్‌రూంలు నిద్రపోతున్నాయి.

నెమ్మదిగా వీధి తలుపులు తెరుచుకున్నాయి. బయటనుండి ఓ నల్లని ముసుగుమనిషి లోనికి ప్రవేశించాడు. తలుపులు మూసుకోబడ్డాయి. మెల్లిగా ఆ ముసుగు మనిషి మేడ మీదున్న ఖీలా రూంలోకి ప్రవేశించాడు. మెట్ల క్రింద మత్తుగా నిద్రపోతున్న పెంపుడుకుక్క అటునుండి ఇటు ప్రక్కకు వత్తిగిలింది. ఎర్రగా వెలుగుతున్న బెడ్ లైటుని ఆర్పేసాడు. నెమ్మదిగా అతని కాళ్ళు ఖీలా వద్దకు నడుస్తున్నాయి. ఇంతలో అతని కాలు టీపాయ్‌కి తగిలి దాని మీదున్న అలారం టైం పీసు క్రిందపడింది. ఆ చప్పుడికి ఖీలాకి మెలకువచ్చింది. కళ్ళు తెరుచుకున్నా కనపడని కారు చీకటి. ఎవరక్కడ? ఎవరక్కడ? అని పిలిచింది. కాని ఎటువంటి సమాధానం రాలేదు. ఇంతలో రెండు సార్లు తుపాకీ పేలడం, వెంటనే ఎవరో పారిపోయిన శబ్దం వినిపించాయి. ఆ శబ్దానికి ఖీలా ఒక్కగావుకేకపెట్టి నేలకొరిగి పోయింది.

ఖీలా పెట్టిన గావుకేకకి ప్రక్క గదులలో నిద్రపోతున్న జాన్, స్టేసీలు పరుగెత్తుకుంటూ తల్లి గదిలోకి వచ్చి లైటువేసారు. ఖీలా ఎక్కిళ్ళతో ఏడుస్తూ నేను చచ్చిపోతున్నాను. జాన్... స్టే... స్టేసీ అంటూ ఆమె ఏమేమో మాట్లాడుతోంది.

ఒక్కసారి పిల్లలిద్దరికీ ఏం జరిగిందో అర్థంకాక భయంవేసింది. గదంతా కలయచూసారు. తలుపులన్నీ వేసేవున్నాయి.

"మమ్మీ... మమ్మీ..." అంటూ స్టేసీ తల్లిని తడుతూ పిలిచింది.

కాని ఖీలా ఇంకా మగతగానే పలవరిస్తోంది. ఇంతలో జాన్ ఐస్ వాటర్ తెచ్చి తల్లి ముఖం చల్లని నీటితో తుడిచి కొంచెం నీరు త్రాగించాడు.

ఖీలా నెమ్మదిగా కళ్ళు తెరచింది.

"జాన్... స్టేసీ... మీరిద్దరూ బ్రతికే ఉన్నారా? నేను కూడ బ్రతికే ఉన్నానా?" అంటూ భయం భయంగా వారి వంక చూసింది ఖీలా!

ఆమె మాటలు వాళ్ళకేమీ అర్థం కాలేదు. బహుశా పీడకల ఏమైనా వచ్చిందేమో అనుకుని "మమ్మీ! మేమిద్దరం బాగానే ఉన్నాం. నీవేం కంగారు పడక్కరలేదు. నీకు పీడకల వచ్చింది అంతే! అంతకంటే ఏం జరగలేదు. తలుపులన్ని వేసే ఉన్నాయి. నువ్వేం కంగారుపడక్కర లేదు" అంటూ ధైర్యం చెప్పాడు జాన్.

'ఓ! మైగాడ్! ఎంత భయంకరమైన కల వచ్చింది. ఊహించని విధంగా వచ్చింది" అని తనకు వచ్చిన పీడకలను పిల్లలిద్దరికీ వివరంగా చెప్పింది.

"మమ్మీ! అదంతా కలేగదా! నీకేం భయంలేదు. మేమిద్దరం యిక్కడే నీ ప్రక్కనే ఉంటాము. నీవు లేనిపోనివి ఆలోచించక హాయిగా నిద్రపో" అంటూ ఆమెకు ధైర్యం చెప్పి, కాసేపు ఆమె ప్రక్కన కూర్చుని కబుర్లు చెప్పి నిద్రపోయారు.

ఖీలా కళ్ళు మాత్రం నిద్రకి దూరంగానే ఉన్నాయి. ఆమె మనసులో అనేకమైన ఆలోచనలు దొర్లుతున్నాయి. తను ఇన్నేళ్ళ జీవితంలో భర్తతో ఏం సుఖపడిందో తనకే తెలియదు. కాని ఇప్పుడు పిల్లల ప్రేమానురాగాలను పొందుతూ వారితో జీవితం ఆనందంగా గడచిపోతోంది. తను వాళ్ళకి దూరం అవలేదు. వాళ్ళూ ఆమెని విడిచి ఉండలేరు. కాని... డేవిడ్ ఆలోచనలు ఎలా ఉన్నాయో? ఆరోజు జరిగిన సంఘటన తరువాత మళ్ళీ కనపడలేదు. కాని... మళ్ళీ,... ఎప్పుడైనా ఆకస్మాత్తుగా ఏదైనా జరిగితే... ఈ ఆలోచన ఆమె మెదడుని దొలిచేస్తోంది. ఒకవేళ పిల్లలకి ఏమైనా హానితలపెడితే... ఇలాంటి ఆలోచనలతో ఖీలాకి ఆ రాత్రి నిద్రలేక పాడికళ్ళు పడ్డాయి.

*

ఖీలా కారు 'మేపుల్ లీపు రెస్టారెంట్' వద్ద ఆగింది. ఖీలా తన కారుని లాక్‌చేసి, జాన్, స్టేసీలతో కలసి రెస్టారెంట్ లోపల కెళ్ళింది. సాయంత్రం కావటంవల్ల కుర్చీలన్నీ నిండుగా నవ్వుతున్నాయి. ఒక మూలగా ఉన్న టేబుల్ ఖాళీ ఉండటం

చూసి, తనూ, పిల్లలూ వెళ్ళి అక్కడ కూర్చున్నారు. 'హేమ్ బర్గర్, ఫ్రెంచి ఫ్రైస్ కి ఆర్డరిచ్చారు. ఆ రోజు స్టేసీ పుట్టిన రోజు కావటం వల్ల అందరూ కలసి సరదాగా వచ్చారు. చాల రోజుల తరువాత ఆమె ఆనందంగా ఉండటం చూసి పిల్లలు సంతోషించారు. పిల్లలతో సరదాగా కబుర్లు చెబుతూ టిఫిన్ తింటోంది ఖీలా. తరువాత కాఫీ సిప్ చేస్తూ రెస్టారెంట్ గాజు అద్దాలలోంచి బయట ప్రపంచాన్ని చూస్తోంది ఖీలా. చెదిరిన తేనె పట్టులా జనం రోడ్డంతా హడావుడిగా పరుగులు తీస్తున్నారు. ఆమె కళ్ళు అనుకోకుండా కారు పార్కింగ్ దగ్గర ఆగిపోయాయి. ఆమె గుండెలు ఒక్కసారి లయతప్పాయి. ఒళ్లంతా చెమటలు పట్టాయి. ఆమె కళ్ళు కారు పార్క్ చేసి లోపలకు వస్తున్న వ్యక్తిని పరికించాయి.

"ఓ మైగాడ్! అనుమానంలేదు. అతను.... అతను... '' అని అనుకుంటూ గబగబా పర్సులోంచి ఇరవై డాలర్ల నోటుని ప్లేటులో పడేసి పిల్లలిద్దర్ని ఒక్క ఉదుటున చెరోచేయి పట్టుకుని రెస్టారెంట్ లోంచి పరుగులాంటి నడకతో బయటకు వచ్చి, పిల్లల్ని ఆ కారులో కూర్చోమని, కారు స్టార్ట్ చేసింది ఖీలా. తల్లి ప్రవర్తన పిల్లలకేమీ అర్థం కాలేదు. కాని రెస్టారెంట్ లోపలకు వచ్చిన వ్యక్తి కళ్ళు ఆమెను చూడకపోలేదు. వెంటనే ఆ వ్యక్తి బయటకు వచ్చి తన కారులో ఖీలా కారుని అనుసరించాడు.

ఖీలా ఎలా డ్రైవ్ చేస్తోందో ఆమెకే తెలీటంలేదు. ఒళ్ళంతా చెమటతో తడిసిపోయింది. చేతులు వణుకుతున్నాయి. ఇదంతా చూస్తున్న జాన్ నెమ్మదిగా "మమ్మీ! ఏమైంది? ఏమిటాకంగారు? సడన్‌గా ఎందుకు బయటకు వచ్చేసావ్? ప్లీజ్ చెప్పు మమ్మీ!'' అంటూ బ్రతిమాలాడు.

"జాన్ ఒక్కసారి వెనక్కి తిరిగి చూడు. అంతా నీకే అర్థం అవుతుంది'' అని కంగారుగా అంది ఖీలా.

వెంటనే వెనక సీట్లో ఉన్న జాన్, స్టేసీలు ఒకేసారి వెనక్కి తిరిగి కారు అద్దాలలోంచి బయటకు చూశారు. వాళ్ళని వెంబడిస్తున్న వ్యక్తి డేవిడ్.

"మమ్మీ! నువ్వేం కంగారుపడకు. అతను మనల్ని ఏమీ చేయలేడు. మనమేమీ తప్పు చేయలేదు. నెమ్మదిగా డ్రైవ్ చేయి'' అని జాన్ అన్నాడు.

"మీకేమీ తెలియదు. ఇప్పుడు మీరేమీ మాట్లాడకండి. ముందు నే చెప్పినట్లు చేయండి'' అని ఆమె తన కారుని అనేక వీధులలోంచి మలుపు త్రిప్పి చిట్టచివరకి ఒక పబ్లిక్ టెలీఫోన్ బూత్ వద్ద ఆపి, తన బ్యాగ్‌లోంచి టెలిఫోన్ నెంబర్స్ పుస్తకం తీసి, అందులో ఒక నెంబర్‌కి డయల్ చేసి తనున్న ఏరియా, తన పేరు, అడ్రసు చెప్పింది. తరువాత జాన్, స్టేసీలను దగ్గరగా తీసుకుని "హనీ! ఇప్పుడు మీరు ఇంటికి వెళ్ళవద్దు. డైరెక్టుగా డయానా వాళ్ళ యింటికి వెళ్ళండి. నేను అన్ని విషయాలు రాత్రికి ఫోన్ చేస్తాను. ఇప్పుడు చెప్పడానికి టైం లేదు. నాకు, మీకు యిప్పుడు ఇంకేం భయంలేదు. మీరు ఏమిటి? ఎందుకు? అని ప్రశ్నలు అడగవద్దు'' అని పిల్లలకి చెబుతుండగానే ఒక కారు వచ్చి వాళ్ళ ముందు ఆగింది. అందులోంచి ఒకామె ఖీలాకి విజిటింగ్ కార్డు చూపించగానే ఖీలా పిల్లలకి టాటా చెప్పి, వాళ్ల కారు స్టార్ట్ అయ్యాక, తను అక్కడకు వచ్చిన ఆమెకారులో వెళ్ళిపోయింది.

*

డయానా యింటికి జాన్, స్టేసీలు వెళ్ళారు. ఆమెతో జరిగిన సంగతి వివరంగా చెప్పారు. "మమ్మీ ఎక్కడకెళ్ళి ఉంటుంది ఆంటీ!'' అని వాళ్ళు అడిగారు.

వాళ్ళు చెప్పినదంతా విన్నాక ఖీలా ధైర్యంగా ఎటువంటి నిర్ణయం తీసుకుందో డయానా అర్థం చేసుకుంది. ఆమె చిరునవ్వుతో "మమ్మీ గురించి మీరేమీ కంగారు పడక్కరలేదు. మమ్మీ తిరిగి వచ్చేదాకా మీరు మా యింట్లోనే ఉందురుగాని. మీ పుస్తకాలు వగైరా రేపు తెచ్చుకుందురుగాని. మీరు ఎటువంటి మొహమాటం లేకుండా మీ యింట్లో ఎలా ఉంటారో అలాగే యిక్కడ ఉండండి'' అంటూ వాళ్ళిద్దర్నీ దగ్గరగా తసుకొని నుదుటి మీద ముద్దెట్టుకుంది.

ఇంత మంచి మనసున్న వ్యక్తులు ఎక్కడన్న ఉంటారా?'' అని జాన్, స్టేసీల కళ్ళు కృతజ్ఞతా భావంతో డయానా వంక చూసాయి.

## 47

క్రొత్త యింటిలో దిగిన దగ్గర్నుంచీ ఒక్కక్షణం తీరిక ఉండటంలేదు పద్మకి. అవీ ఇవీ సర్దటంలో చాల రోజులు గడచిపోయాయి. కాని ఆమె మనసులో ఆరోజు కీర్తిక గదిలో ఫోటో చూసిన దగ్గర్నుంచి ఆ విషయం గురించి కీర్తికని అడుగుదామని అనుకుంటోంది. కాని ఎక్కడా తీరిక, టైం చిక్కటం లేదు. కీర్తిక ఇప్పుడు యింటిలోనే ఉంది. అడిగి తెలుసుకుంటే మంచిది. ఏదైనా కీడెంచి మేలెంచమన్నారు. మనసులో ఉన్న అనుమానాన్ని అడిగి తెలుసుకుంటే సగం భారం తగ్గుతుంది అని ఓ నిర్ణయానికొచ్చింది పద్మ.

కీర్తిక తన గదిలో మంచంపై పడుక్కుని ఏదో పుస్తకం చదువుకుంటోంది. ఇంతలో తలుపు మీద వ్రేళ్ళతో టక్... టక్... టక్... మని కొట్టి "మే ఐ కమీన్ ప్లీజ్"

అంటూ పద్మ గుమ్మం వద్ద నిలబడింది.

"ఎవరా?'' అని చదువుతున్న పుస్తకం లోంచి తన కళ్ళను ఓరగా గుమ్మం వద్ద నిలబడిన తల్లిని చూసి ఆశ్చర్యంతో 'అదేంటి మమ్మీ! ఈ క్రొత్త పద్ధతి ఎప్పట్నుంచి మొదలెట్టావ్' అంటూ మంచంపై నుంచి లేచింది కీర్తిక.

పద్మనవ్వుతూ లోపలికి వస్తూ 'ఆ! ఏం లేదు! పుత్రికా రత్నంగారు పుస్తక పఠనంలో దీర్ఘంగా మునిగిపోయారు కదా! అందుకని బహుశా డిస్టర్బ్ అయిందా?' అంటూ చేతిలో నున్న కాఫీ కప్పులలో ఒకటి కీర్తికకిచ్చి, మరొకటి తను తీసుకుని త్రాగుతూ కూతురి ప్రక్కనే కూర్చుంది పద్మ.

"ఏమిటి విశేషం మమ్మీ! ఈ రోజు తీరుబడిగా ఉన్నావ్'' అడిగింది కీర్తిక.

"విశేషం ఏమీలేదు! ఈ రోజు మనసు కొంచెం ప్రశాంతంగా ఉంది. నువ్వు చూస్తూనే ఉన్నావ్‌గదా! ఈ మధ్య మనం మాట్లాడుకుందుకు కూడా తీరుబడి లేకుండా ఏదో ఒక పని సరిపోతోంది. ఇదిగో! మళ్ళీ వచ్చే నెలలో తాతగారు, బామ్మ యిక్కడకు వస్తారు. వాళ్ళు వచ్చింతరువాత అక్కడకి, ఇక్కడికి తిరగటం సరిపోతుంది. మా బంగారు తల్లితో కాసేపు మాట్లాడుకుందామని వచ్చాను. నీకు అభ్యంతరమా అని సందేహంగా చూసింది పద్మ.

"అదేంటి మమ్మీ! నన్ను పరాయిదానిలా అలా అడుగుతావ్?'' అంటూ బాధగా తల్లి వంక చూసింది కీర్తిక.

"ఆ! అది సరేగాని మమ్మీ! తాతగారు, బామ్మ యిక్కడకు వచ్చేటప్పుడు గొంగూర పచ్చడి, పళ్ళకారం తెమ్మని ఉత్తరం వ్రాయి. బామ్మ తయారుచేసిన పచ్చళ్ళు చాల రుచిగా ఉంటయ్'' నోరు చప్పరించింది.

"అలాగేలే! ఇంతకీ నీ ఉద్యోగప్రయత్నం ఎంతవరకు వచ్చింది!''

"ఎప్పటికప్పుడు అన్నిచోట్ల ఎంక్వయిరీ చేస్తున్నాను. కొన్నిటికి అప్లై చేసాను. ఏదో ఒకటి తప్పక వస్తుందనే గట్టి నమ్మకం ఉంది నాకు మమ్మీ!'' అని గట్టినమ్మకంతో అంది.

"ఆ!ఆ! మీ ఫ్రెండ్స్ ఎలా ఉన్నారు?''

"గ్రాడ్యుయేషన్ అయిపోయింది గదా! ప్రస్తుతం ఎవరిళ్ళకు వాళ్ళు వెళ్ళిపోయారు. అది సరే గాని మమ్మీ! ఈ సమ్మరు మనం ఎక్కడికి వెడుతున్నాం?'' అని హుషారుగా అంది.

"ఇప్పట్లో అటువంటి ఉద్దేశం లేదు. మొన్ననే గదా ఇల్లుకొన్నాం. మళ్ళీ వచ్చేనెలలో బామ్మవాళ్ళు వస్తారు. ప్రస్తుతం ఖర్చుఎక్కువగానే ఉంది. ఆ! అన్నట్టు మర్చిపోయాను. మొన్న పార్టీలో ఫొటోలు తీయించుకున్నానని చెప్పావ్. అవి వచ్చాయా?'' అని ఆసక్తిగా అడిగింది పద్మ. అవి అడగటంలో పద్మ ఉద్దేశం వేరు.

"అవును గదా! నేను మర్చేపోయాను మమ్మీ! తెస్తానుండు'' అంటూ మంచంపై నుంచి లేచి షెల్ఫ్‌లో నుండి కొన్ని ఫొటోలున్న కవరుని తల్లి చేతి కందించింది.

కీర్తిక యిచ్చిన ఫొటోలను ఒక్కొక్కటి తీసి చూడసాగింది పద్మ. కాని తాను అనుకున్న ఫొటో ఎక్కడా కనపడలేదు. "చాల బాగా వచ్చాయి కీర్తి! అనకూడదుగానీ నీది మంచి ఫొటోజెనిక్ ఫేస్. యూఆర్ ఎ బ్యూటిఫుల్ గర్ల్!'' అంటూ కూతుర్ని ముద్దెట్టుకుంది పద్మ.

"నిజం మమ్మీ! జాక్‌కూడా నేను చాల అందంగా ఉంటానని అంటాడు'' అని గబుక్కున నాలిక్కరుచుకుంది కీర్తిక.

"జాక్ ఎవరు?'' కనుబొమ్మలు ముడుస్తూ ఆశ్చర్యంగా అడిగింది పద్మ.

కీర్తిక తడబడకుండా "నా బోయ్‌ఫ్రెండ్ మమ్మీ! చాల మంచివాడు. అందంగా, చాలాకీగా ఉంటాడు. మంచి ఉద్యోగం చేస్తున్నాడు. సరదాగా, నవ్వుతూ, నవ్విస్తుంటాడు'' అని గర్వంగా చెప్పింది కీర్తిక.

"ఆ! ఆ! ఇంకా.....!''

"ఆ! ఇంకా అంటే మేమిద్దరం చాల క్లోజ్‌గా ఉంటాం. నేనంటే తనకి చాల యిష్టం.''

"ఇష్టం అంటే?'' సందేహంగా అంది పద్మ.

"ఐ మీన్ ఇష్టం అంటే... అతను నన్ను ప్రేమిస్తున్నాడు. నాక్కూడా అతనంటే ఇష్టం. నాకు కూడా ఉద్యోగం వస్తే పెళ్ళిచేసుకుందామని అనుకుంటున్నాం'' అని చాల తాపీగా చెప్పింది కీర్తిక.

"అయితే అన్ని ముందే నిశ్చయించేసుకున్నారన్నమాట''

"ఉద్యోగం వచ్చిన తరువాత నిన్ను సర్‌ప్రైజ్ చేద్దాం అనుకున్నాం మమ్మీ!'' అంటే తన మనసులోని విషయాలన్ని తల్లికి చెప్పింది.

కీర్తిక మనసులో ఉన్న సంగతులన్నిటిని దాచకుండా ధైర్యంగా చెప్పినందుకు ఒక విధంగా సంతోషించింది పద్మ. కల్లాకపటంలేని నిష్కల్మషమైన మనసున్న కీర్తికకి మంచే జరగాలని తల్లిగా మనసులో అనుకుంది పద్మ.

"మరి జాక్ వాళ్ళ తల్లిదండ్రులు ఎక్కడున్నారో నీకు తెలుసా?''

"వాళ్ళు లండన్‌లో ఉన్నారని మాటల సందర్భంలో ఒకసారి చెప్పాడు''

"ఆ! ఆ!"

"మమ్మీ! నేనేమైనా తప్పుగా ప్రవర్తించానా? ఎటువంటి పరిస్థితిలోను నా హద్దును దాటి ప్రవర్తించలేదు" అని బేలగా అంది కీర్తి.

"తొందర పడి కాలు జారకుండా ఉన్నంతవరకూ పర్వాలేదు. అందులోను యిక్కడ వాళ్ళ మనసులు ఎప్పుడు ఎలా మారిపోతాయో తెలీదు మనకి. అన్ని విషయాలు నువ్వు ఆలోచించగల్గినప్పుడు నే చెప్పేదేమీలేదు. నాకన్న ఎక్కువ విషయాలే నీకు తెలుసు. ఈ సంగతి డాడీతో కూడ చెబుతాను" అంటూ ఇంకా ఏదో అనబోయేంతలో కాలింగ్ బెల్ మ్రోగటంతో డాడీ వచ్చినట్లున్నారు" అంటూ తలుపు తీయడానికి లేచి వెళ్ళింది పద్మ.

"అమ్మయ్య! ఎలా చెప్పాలా? ఎలా చెప్పాలా? అని అనుకుంటుండగానే సమస్య క్లియరై పోయింది. మమ్మీ గ్రీన్ సిగ్నెల్ యిచ్చినట్లే. మమ్మీ ఓకే అంటే డాడీ కూడ ఓకే" అనుకుంటూ హాయిగా ఊపిరిపీల్చుకుంది కార్తీక.

## 48

ఇంటిముందు గడ్డి బాగా పెరిగిపోవటంతో వీకెండ్‌లో ఒకరోజు గడ్డి కట్ చేస్తోంది పద్మ. అద్దె ఇంట్లో అయితే ఆ అవసరం ఉండేది కాదు. మరి సొంతయిల్లు అనేటప్పటికి అన్నీ సొంతంగా చేసుకోక తప్పదు. అదీకాక గడ్డి కట్‌చేయకుండా అశ్రద్ధ చేస్తే ఎప్పుడు ఏ మునిసిపాలిటీ వాడు వచ్చి ఫైన్ వేస్తాడో అనే భయం కూడ ఉంది. రూల్సు ప్రకారం ఇంటి చుట్టు ప్రక్కల లాన్, ఫెన్సింగ్‌ని ఒక లెవెల్‌దాకానే పెంచాలి. అశ్రద్ధ చేస్తే వాడిచ్చిన ఫైన్ బిల్లుని మాట్లాడకుండా కట్టాలి. అలాగే కారు పార్కింగ్ విషయంలో కూడ చాల జాగ్రత్తగా ఉండాలి. మూడు గంటలకు పైగా ఒక్కనిమిషం కూడ కారుని ఒకే చోటపార్క్ చేయకూడదు. ఏమాత్రం అశ్రద్ధ చేసినా చక్కగా 60డాలర్ల ఫైన్ వేసి, స్లిప్పుని కారుకి అతికించివెళ్తాడు. ఈ విషయాలలో లాలూచీలు, మొహమాటాలూ ఏవీ ఉండవు.

అప్పుడే బయటనుండి వచ్చిన ప్రక్కఅపార్ట్‌మెంటులో ఉంటున్న డయానా "హలో!" అంటూ పద్మని పల్కరించింది. పద్మకూడ చిరునవ్వుతో విష్ చేసింది.

కట్టు, బొట్టు చూసి "ఇండియనా?" అని అడిగింది డయానా.

"అవున"ని అంది పద్మ.

పద్మ పొడవాటి జడను చూసి చాల మెచ్చుకుంది డయానా.

"మీ చీర చాల బాగుంది" అంది కళ్ళెగరేస్తూ డయానా.

"ఇది ఆర్గండీ వాయిల్ చీర. వేసవిలో బాగుంటాయి ఇలాంటివి" అని తన చీరను ఓసారి సవరించుకుంటూ అంది పద్మ.

"ఆ! ఆ!" అంటూ ఆశ్చర్యంగా అంది డయానా.

తరువాత వాళ్ళిద్దరూ చాలసేపు పిల్లల గురించి. వాళ్ళ చదువుల గురించి మాట్లాడుకున్నారు. వీలున్నప్పుడు కలుస్తూ ఉండమని ఒకరితో ఒకరు చెప్పుకుని ఎవరి మటుకు వాళ్ళు లోపలకి వెళ్ళిపోయారు.

ఆ విధంగా మొదలయింది వారి పరిచయం. అప్పుడప్పుడు ఒకరింటికి ఒకరు వస్తూ పోతూండేవారు. ఇండియన్ కల్చర్ గురించి, వారి వేషభాషల గురించి చారిత్రాత్మక ప్రదేశాల గురించి చాల ఇంట్రస్ట్‌గా అడిగి తెలుసుకునేది డయానా. అలాగే పద్మ కూడా అడిగి తెలుసుకునేది.

ఇక్కడ మనుష్యులలో ఉండే సుగుణం ఏమిటంటే పిల్లలైనా, పెద్దలైనా అబద్ధం మాత్రం చెప్పరు. ఎదుటివాళ్ళు ఏమనుకున్నా ఉన్నది ఉన్నట్టు నిర్మొహమాటంగా చెబుతారు. ఒకవేళ చెప్పటం ఇష్టం లేకపోతే సారీ అని చెప్పేస్తారు. నచ్చినదేదైనా ఉంటే ఆనందంగా మెచ్చుకుంటారు. లేకపోతే 'నాట్ టూ బేడ్' అంటారు. తరువాత ప్రతి చిన్న విషయాన్కి పెద్ద పెద్ద మాటలతో అభినందిస్తారు.

ఒకటి రెండుసార్లు డయానా ఇంటికి పార్టీకి వెళ్ళినప్పుడు కొంతమంది కెనడియన్ ఫామిలీలతో పద్మకి పరిచయం అయింది. వారిలో జెర్సీ కూడ ఉంది. మగపిల్లలు లేని పద్మకి పింకీని చూడగానే వాడితో పరిచయం పెంచుకుంది.

*

ఒకరోజు డయానా ఒక షిఫాన్ చీర తెచ్చి ఎలా కట్టుకోవాలో చెప్పమని పద్మని అడిగింది.

"అరె! నన్నడిగితే నేనిచ్చే దాన్నిగా. అనవసరంగా ఎందుకు కొన్నారు?" అని పద్మ అడిగింది.

"ఒకరోజు 'న్యూక్రియేషన్' షాపుకి వెళ్ళినప్పుడు ఈ చీర షోకేసులో బొమ్మకి కట్టి ఉంది. చూపులకి చాల అందంగా ఉంది. వెంటనే ఆ చీరని కట్టుకోవటం రాకపోయినా కొనేసాను. నాకున్న బేడ్ హేబిట్ ఏమిటంటే నా మనసుకి ఏ వస్తువన్నా నచ్చిందీ అంటే వెంటనే అది కొనేస్తాను. అందుకే మా వారికి నాతో షాపింగ్‌కి రావాలంటే తగని భయం" అంటూ నవ్వేసింది.

డయానాకి చీర అందంగా వచ్చేటట్టు పిన్ను పెట్టి కట్టింది పద్మ. స్లీవ్‌లెస్

బ్లౌజు వేసుకుంది. అసలే తెల్లని తెలుపు అవటంతో ముదురు రంగు చీర అతికినట్టు సరిపోయింది. చీరలో ఆమె చాల అందంగా కనబడింది.

'మీరు చీరలో చాల అందంగా ఉన్నారు'' అంది పద్మ.

"రియల్లీ!'' అంటూ కళ్ళెగరేసింది డయానా.

"ఆ!ఆ!''

"చాల థాంక్స్ పద్మా! నాదో చిన్న కోరిక'' అంది డయానా.

"ఏమిటది''

"ఒక్కసారి ఇప్పుడు మా యింటికి రాగలవా?''

"ఎందుకు?''

"చిన్న పనుంది!''

"ఓ.కే!'' అంటూ తలుపు తీసి డయానా వెంట ఇంటిలోపలకి వెళ్ళిన తరువాత ఒక రూంలోకి పద్మని తీసుకెళ్ళి ఆటోమేటిక్ కెమేరాతో చీరలోఉన్న తనకి, పద్మకి కలిపి ఫొటో తీసింది.

"ఇందుకా అంత హడావుడిగా తీసుకొచ్చావ్?'' అని నవ్వింది పద్మ.

"ఆ! ఆ! అంటూ జస్ట్ఏ మినిట్'' అంటూ లోపలకెళ్ళి తాను స్వయంగా తయారు చేసిన కేరెట్ కేక్+టీ కలిపి తెచ్చింది.

"ఇప్పుడివన్నీ ఎందుకు?'' అంది పద్మ.

"నథింగ్'' అంటూ టీ సిప్ చేయసాగింది డయానా.

"ఈ చీరలో నాకే ముద్దొస్తున్నావ్. ఇంక స్కాట్ చూస్తే ఎవరా ఇండియన్? అని వెంటబడతాడు'' అంటూ వేళాకోళంగా అంది పద్మ.

"ఐ లైక్ యూ పద్మా! యూ ఆర్ ఎ రియల్లీ ఫ్రెండ్'' అని పద్మని మెచ్చుకుంది డయానా.

"ఓకే! మరి పిల్లలొచ్చేటైం అయింది. వెడతా'' నంటూ బయలుదేరి యింటికి వచ్చేసింది పద్మ.

## 49

ఒకరోజు ఆఫీసు నుండి వచ్చిన రాజశేఖరం కాఫీ త్రాగుతూ నీరజతో ఆ రోజు విశేషాలు మాట్లాడుతూ, మాటల మధ్యలో ఇండియాలో మనోహర్‌కి రెండు మూడు పెళ్ళి సంబంధాలు ఉన్నట్లు, అమ్మాయిల ఫోటోలు పంపుతూ ఉత్తరాలు వ్రాసారని ఆరోజు పోస్టులో వచ్చిన కవర్లని నీరజకి అందించాడు.

ఆమె ఉత్తరాల్ని చదివి, ఫోటోలను పరికించి చూసి "అన్ని బాగానే ఉన్నాయి. అయినా అప్పుడే వాడి పెళ్ళికి తొందరేముంది. ఇప్పుడేగా ఉద్యోగంలో స్థిర పడ్డాడు'' అని తన సంశయాన్ని వెలిబుచ్చింది నీరజ.

"పెళ్ళికి మనకి తొందర లేకపోయినా ఆడపిల్లల తల్లిదండ్రులకి తొందరే గదా! అందులోను విదేశాలలో పెళ్ళికొడుకు ఉన్నాడంటే మరి కాస్త తొందరగదా! ఇంకోమూడు నాలుగు సంవత్సరాలు పోతే ఆ పని మనమూ చేయాల్సి వస్తుంది'' అని శిల్పని దృష్టిలో పెట్టుకుని అన్నాడు రాజశేఖరం.

"అదీ నిజమే! ఏది ఏమైనా మనోహర్ యింటికి వచ్చాక పెళ్ళి విషయం కదిలిద్దాం. మరి వాడి అభిప్రాయాలు ఎలా ఉన్నాయో?'' అంటూ కిచెన్‌లోకి వెళ్ళింది నీరజ.

*

రాత్రి భోజనాల టైములో కొడుకుతో,

"మనోహర్! నీకు ఇండియా నుండి రెండు మూడు పెళ్ళి సంబంధాలు వచ్చాయి. ఎలాగూ వచ్చే సంవత్సరం ఇండియా వెడదామని అనుకుంటున్నాం గదా! ఆ టైములో చూడవచ్చును. మరి వాళ్ళకి జవాబు వ్రాయమంటావా?'' అని రాజశేఖరం అన్నాడు. చిరునవ్వు నవ్వుతూ "అప్పుడే పెళ్ళేమిటి డాడీ! అయినా ఇప్పుడు నా వయస్సెంత?'' అని ఎదురు ప్రశ్న వేసాడు మనోహర్.

"వయసుకేముందిలే! ఏ వయస్సులో ముచ్చట ఆ వయస్సులో తీరితేనే బాగుంటుంది'' అని కంచంలో కొంచెంకూర వస్తూ అంది.

"ప్రస్తుతం నాకా ఉద్దేశ్యం లేదు''

"పోనీ ఆ విషయమే వ్రాద్దాము. ఇంకా టైముందిగదా! అనవసరంగా వాళ్ళకి ఆశలు కల్పించటం ఎందుకు? మనం ఖచ్చితంగా ఏ విషయమూ వ్రాస్తే వాళ్ళు మరొక సంబంధం చూసుకుంటారు'' అని రాజశేఖరం అన్నాడు.

"అసలు నాకిప్పట్లో ఆ ఆలోచన లేదు డాడీ!''

"అంటే అసలు పెళ్ళే చేసుకోవా?'' కొడుకు వంక చూస్తూ.

"అని నేనలేదు. కాని నాకు....'' అంటూ మాట నాన్చేసాడు.

"ఊ! అసలు నీ మనసులో ఉద్దేశ్యం ఏమిటో చెప్పు''

"డాడీ! మీకు చాల రోజుల బట్టి చెబుదామనుకుంటున్నాను. ఆ అవకాశం యిప్పుడు వచ్చింది. నా కొలీగ్ ఒకమ్మాయి ఉంది. పేరు జెనిఫర్. చాల అందంగా

చలాకీగా ఉంది. మంచి తెలివి తేటలున్నాయి. మా యిద్దరి అభిప్రాయాలు, ఆలోచనలు కలిసాయి. మేము ఒకరిని ఒకరం ప్రేమించుకున్నాం. కొద్ది రోజుల తర్వాత వివాహం చేసుకోవాలనుకుంటున్నాం. నేను ఈ విధంగా మాట్లాడు తున్నందుకు మీరు అపార్థం చేసుకోవద్దు'' అని తన నిర్ణయాన్ని వెల్లడించాడు మనోహర్.

నీరజ మౌనంగా అన్నం తింటుంది. కాని శేఖరం 'అయితే అన్ని నిర్ణయించేసుకునే అడిగిందాకా చెప్పలేదన్న మాట, మాట వరసకైనా చెప్పలేద' ని మనసులో కలవరపడ్డాడు.

"నువ్వు ఇండియన్‌వి. ఆ అమ్మాయి కెనడియన్ మరియిద్దరి అభిరిచులు, అభిప్రాయాలు, ఆచార వ్యవహారాలు తెలుసుకున్నారా? ఇక్కడ కల్చర్‌కి మన కల్చర్‌కి చాల తేడా ఉంటుంది. ఆ విషయం నేను నీకు చెప్పక్కరలేదనుకో! పై పై మెరుగులు చూసి, మాట చమత్కారాలు చూసి వివాహం చేసుకున్నా తరువాత ముందు భవిష్యత్ గురించి, పుట్టబోయే పిల్లల గురించి ఆలోచించావా?'' అని సూక్ష్మంగా అడిగాడు రాజశేఖరం.

"వాటికేముంది డాడీ! ఎక్కడుంటే అక్కడే అలవాటు పడతాం. దానికి పెద్ద ఆలోచన ఏముంది. కాలం మారుతుంది. మనష్యులు మారుతున్నారు. మనమూ మారాలి'' అంతా ఆలోచించుకునే మాట్లాడాడు మనోహర్.

''అదికాదు మనోహర్! మనం ఎంత మోడరన్ సొసైటీలో ఉన్నా, మనవాళ్ళమ్మాయిని, ఇండియన్‌ని చేసుకుంటే బాగుంటుంది. రేపు ఏ కారణాల వల్లనైనా కుటుంబ సమస్యలొచ్చినా మేము సర్దిచెప్పడానికి, పరిష్కరించడానికి అవకాశం ఉంటుంది. అదే ఇక్కడేతై ఆ అవకాశం ఉండదు. మనం అంటే లెక్కఉండదు. పెళ్ళంటే నూరేళ్ళ పంట. జీవితంలో ఒకే ఒకసారి వస్తుందా అవకాశం. నేను చాదస్తంగా మాట్లాడుతున్నానని అనుకోకు!'' అని సీరియస్‌గా చెప్పాడు రాజశేఖరం.

"సారీ! డాడీ! నా నిర్ణయం ముందేచెప్పాను. ఇందులో ఇంక మార్పేమీలేదు. నేను జెనిఫర్‌ని వివాహం చేసుకోవటం ఖాయం. మీరు మా అబ్బాయికి పెళ్ళి కుదిరిపోయిందని వాళ్ళకి జవాబు వ్రాసేయండి. ఇలాంటి విషయాల్లో మొహమాటాలు పనికిరావు గదా!'' అంటూ చేయికడుక్కుందుకని వాష్ రూంలోకి వెళ్ళిపోయాడు మనోహర్.

దీర్ఘంగా ఓ నిట్టూర్పు విడిచి ''ఏమండీ! మీరు అలా నెమ్మదిగా ఊరుకున్నారేమిటి? కొంచెం గట్టిగా చెప్పాల్సింది'' అని భర్తతో అంది నీరజ.

"నీరూ! వాడు చిన్నవాడు కాదు. పాతికేళ్ళు దాటాయి. పదహారు సంత్సరాలు దాటిన తరువాత స్నేహితునిగానే చెప్పాలి కాని తండ్రిగా అధికారాన్ని చెలాయించకూడదు. చిన్నవాడు కాదుగదా కొట్టి చెప్పడానికి. అందులోను ఇక్కడి కల్చర్ అటువంటిది. చెప్పటం వరకే మనవంతు ఆ తరువాత వాళ్ళ అదృష్టం అంతే! పోనీలే ఎక్కడో అక్కడ వాడు సుఖంగా, ఆనందంగా ఉంటే చాలు. అంతకంటే మనకి మాత్రం ఏం కావాలి'' అంటూ భోజనం ముగించాడు రాజశేఖరం.

మనసులో బాధగా ఉన్నా భర్తని అర్థం చేసుకుంది నీరజ.

## 50

సమయం రాత్రి పది గంటలు.

హాలులో ట్రింగ్... ట్రింగ్... ట్రింగ్... అని ఫోన్ మ్రోగటంతో పరుగు పరుగున వచ్చి ఫోను ఎత్తింది స్టేసీ.

"హలో!''

"హలో! దిస్ ఈజ్ పోలీస్టేషన్! ప్లీజ్ కాల్ స్కాట్'' అని రెండవ వైపు గంతు గంభీరంగా పల్కింది.

"జస్ట్ ఎ మినిట్'' అంటూ స్టేసీ కంగారుగా స్కాట్ ఉన్న గదిలోకి వచ్చి "అంకుల్ మీకు ఫోన్'' అని చెప్పింది.

'ఈ సమయంలో ఎవరు చేస్తారు' అని అనుకుంటూ ఫోన్ వద్దకు వెళ్ళాడు.

ఫోన్‌లో స్కాట్ మాట్లాడుతున్నప్పుడు స్టేసీ అక్కడే ఉంది. పోలీస్ స్టేషన్ నుండి అయితే ఇదేదో సీరియస్ కేసే బహుశా ఖీలాకి ఏమన్నా అయిందేమో! ఈ ఆలోచన రాగానే స్టేసీ మనసులో ఒక్కసారి భయంతోపాటు కంగారు పుట్టింది. ఓ ప్రక్కనుండి మాట్లాడుతున్న స్కాట్ ముఖకవళికలను గమనిస్తూనే ఉంది. మనసులో కంగారుగానే ఉంది. తన తల్లికి ఎటువంటి ప్రమాదం జరగకూడదని మనసులో భగవంతుని ప్రార్థించుకుంది.

"థాంక్యూ! వెరీమచ్!'' అంటూ స్కాట్ హడావుడిగా డయానా! అంటూ ఎప్పుడూలేనిది గట్టిగా పిలుస్తూ తన గదిలోకి వెళ్ళి బట్టలు మార్చుకుని, కారు తాళాలు తీసుకుని హడావుడిగా, సీరియస్‌గా ముఖం పెట్టి,

"నేను అర్జంటుగా బయటకు వెడుతున్నాను. కొంచెం ఆలస్యం అవుతుంది. కంగారు పడవద్దు'' అని చెప్పి ఆమె వంక చూడటానికి కూడ టైంలేనట్లు తలుపు

తీసుకుని బయటకు వెళ్ళిపోయాడు.

భర్త ప్రవర్తన చూసి ఒక్కక్షణం ఆశ్చర్యపోయి తరువాత తలుపేసుకుని లోపలకు వచ్చింది డయానా!

"ఏమైంది స్టేసీ! అంకుల్ అంత హడావుడిగా ఎక్కడకు వెళ్ళివుంటారు?" అని అక్కడే నిలబడి ఉన్న స్టేసీని అడిగింది డయానా.

"రెండు నిమిషాల క్రితం పోలీస్ స్టేషన్ నుండి అంకుల్‌కి ఫోన్ వచ్చింది. అది విన్న వెంటనే బయలుదేరి వెళ్ళారు అంకుల్. మరి కారణం ఏమిటో తెలియదు" అంది స్టేసీ.

"పోలీస్ స్టేషన్ నుండా?" అని విస్మయంగా అంది డయానా.

"యస్ ఆంటీ!"

"విషయం ఏమై ఉంటుందో అర్థం అవటంలేదు.

"మే బీ మమ్మీకి ఏమైనా ప్రమాదం జరిగిందేమో!" అని తన మనసులోని అనుమానాన్ని భయంగా వ్యక్తం చేసింది స్టేసీ.

"నో! నో! హనీ! అటువంటిదేం జరగదు. నువ్వేం కంగారుపడకు" అని స్టేసీని దగ్గరగా తీసుకుని తల నిమిరింది డయానా.

ఆ ప్రేమకి చలించి స్టేసీ కళ్ళు చెమర్చాయి.

ఇంతలో మళ్ళీ ఫోన్ మ్రోగింది.

ఈసారి డయానాయే తీసింది.

"హలో! డయానా స్పీకింగ్"

"హలో డయానా! నేను షీలాని"

"ఆయ్ షీలా! ఎలా ఉన్నావ్?" అంటూ ఆనందంగా అడిగింది డయానా.

షీలా అనగానే మమ్మీయే ఫోన్ చేసిందని గ్రహించిన స్టేసీ వచ్చి డయానా ప్రక్కన నిలబడింది.

"నేను అన్ని విషయాలు యిక్కడ చెప్పాను. అన్ని రికార్డ్ వ్రాసుకున్నారు. నా అభిప్రాయం వాళ్ళకి చెప్పాను. నా తరపున లాయర్ని కూడ వాళ్ళే నిర్ణయిస్తానన్నారు. నేను కొన్నాళ్ళు యిక్కడ ఉండవలసి వస్తుంది. నీవున్నావన్న ధైర్యంతోనే నేను ఈ నిర్ణయం తీసుకున్నాను. పిల్లలిద్దర్ని నీకే అప్పగిస్తున్నాను. నీ ఋణం ఈ జన్మలో తీర్చుకోలేను. మిగతా విషయాలు తరువాత మాట్లాడుతాను. పిల్లలెలా ఉన్నారు?" అని ఎంతో ఉత్సాహంగా మాట్లాడింది షీలా.

"ఏమిటి అంత పెద్ద పెద్ద మాటలు మాట్లాడేస్తున్నావ్? మనిషికి మనిషి సహాయం చేయటంలో ఋణం ఏముంది. నిజానికి ఇందులో నే చేసిందేమీ లేదు. అంతా నీ ధైర్యం. అంతే! పిల్లలు పెద్దవాళ్ళే గదా! వాళ్ళ పనులు వాళ్ళు చేసుకుంటారు. నేనేమీ చేయక్కరలేదు గదా!

"ఏది ఏమైనా నువ్వు? చాల గొప్పదానివి. మనసులో ఎంత బాధ ఉన్నా నవ్వుతూ, నవ్విస్తూ మాట్లాడుతావ్. నిజంగా నీవు బ్రెంట్ గురించి ఎంత బాధ పడుతున్నావో నేను అర్థం చేసుకోగలను. మంచివాళ్ళకి చెడు ఎప్పుడూ జరుగదు. బ్రెంట్ తప్పక వెనక్కి తిరిగి వస్తాడు. ఆ నమ్మకం నాకుంది"

"నీ నోటి మాటవలన అదే నిజమైతే నాకు అంతకన్నా ఏం కావాలి?" అని మాట మారుస్తూ "అన్నట్టు స్టేసీ ఇక్కడే ఉంది. మాట్లాడుతావా?" అని అడిగింది డయానా.

"ఓ! ష్యూర్!"

డయానా ఫోన్‌ని స్టేసీకి యిచ్చింది.

ఆనందంతో స్టేసీ చాల సేపు తల్లితో మాట్లాడింది. షీలా తన ఫోన్ నంబరు, అడ్రసు చెప్పింది. స్టేసీని, జాన్‌ని జాగ్రత్తగా మసలుకోమని మరీ మరీ చెప్పి ఫోను పెట్టేసింది షీలా!

స్టేసీ, డయానాలు, స్కాట్‌కోసం ఎదురుచూస్తూ కూర్చున్నారు. అప్పుడే టైము ఒంటిగంట కావస్తోంది.

"స్టేసీ నువ్వెళ్ళి పడుక్కోమ్మా! మళ్ళీ ప్రొద్దున్నే లేవాలి గదా! అంది డయానా.

"నో! ఆంటీ! నిద్రరావటం లేదు. అంకుల్ వచ్చేదాకా ఉంటాను" అని అంది స్టేసీ.

ఇద్దరూ సోఫాలోనే కూర్చున్నారు. స్కాట్‌కోసం ఎదురుచూస్తూ-

## 51

తూర్పు తెలతెలవారుతోంది. కిచెన్‌లో అప్పటికే పాత్రల సంగీతాలు వినబడుతున్నాయి. ఎవరి మటుకు వాళ్ళు వచ్చి తమకు కావలసిన పనులు చేసుకుపోతున్నారు. షీలా నెమ్మదిగా తనున్న గదిలోంచి కిచెన్‌లోకి వచ్చింది. హీటర్ మీద ఒకామె కాఫీ తయారు చేసుకుంటోంది. షీలాని చూసి 'హలో! గుడ్ మార్నింగ్!' అంటూ విష్‌చేసిందామె.

"మీ పేరేమిటి?" అని అడిగింది షీలా!

"క్లాడియా!"

"ఆ! ఆ! వెరీ నైస్ నేమ్" నవ్వుతూ అంది ఖీలా!

'ఇక్కడ పద్ధతులు, ఎవరితో ఎలా మసలుకోవాలో రాత్రి మీకు వార్డెన్ చెప్పిందనుకుంటాను. ఇక్కడ రకరకాల మనస్తత్వాలుగల వాళ్ళుంటారు. ప్రతి వాళ్ళ జీవితంలో ఏదో విధంగా దెబ్బతిన్నవాళ్ళే. మనం ఇక్కడ కలసి మెలసి ఉండాలి. ఒంటరితనాన్ని, మనబాధల్ని మరచి పోవడానికి మనకి నచ్చిన, వచ్చిన పనులను చేసుకోవచ్చును'' అంది క్లాడియా.

"చాల థాంక్స్ క్లాడియా!'' అంది ఖీలా కృతజ్ఞతగా.

తరువాత నలుగురైదుగురు కిచెన్‌లోకి వచ్చి తమకి కావలసినవి తయారుచేసుకొని తింటూ, త్రాగుతున్నారు. ఒకరిద్దరు మాత్రం క్రొత్తగా వచ్చిన ఖీలాని పల్కరించారు. మరి కొందరు ఏమి పట్టించుకోనట్టు చూసి, చూడనట్టు చూసి వెళ్ళిపోయారు.

క్లాడియా మళ్ళీ కలుద్దాం అని చెప్పి వెళ్ళిపోయింది. ఒంటరిగా మిగిలిపోయింది ఖీలా. కాఫీ కలుపుకుని త్రాగుతూ పిల్లల గురించి ఆలోచిస్తోంది.

పిల్లలు ఏం చేస్తున్నారో ఏమిటో! ఎప్పుడూ వాళ్ళని విడిచి ఒక్కరోజు కూడ ఉండలేదు. కష్టమైనా సుఖమైనా వాళ్ళతోనే కలసి ఉండవలసింది. తను యిక్కడకు రావటం పొరపాటు చేసానేమో'' అని పిచ్చిగా ఆలోచించసాగింది ఖీలా!

ఇంతలో ఒకామె ఖీలా వద్దకు వచ్చి "వార్డెన్ సోఫియా పిలుస్తున్నారు'' అని చెప్పి వెళ్ళిపోయింది.

*

"గుడ్ మార్నింగ్ మేడమ్!''

"వెరీగుడ్ మార్నింగ్ ఖీలా! ఇదిగో ఈ ఫారమ్ పూర్తిచేసి ఇయ్యి. ఇక్కడ రకరకాల పనులుంటాయి. నీకు ఇంట్రస్ట్ ఉన్న దాంట్లో జాయినవ్వు. ఇక్కడ వాతావరణం, పరిస్థితులు, మనుష్యులు తొందరలో నీకు అర్థం అవుతాయి''

ఖీలా తనకిచ్చిన ఫారమ్‌ని పూర్తి చేసి సోఫియా చేతికిచ్చింది. సోఫియా టేబుల్ మీదున్న బెల్ నొక్కటంతో ఒకామె లోపలకు వచ్చింది.

"క్రిష్టియానా ఈమె పేరు ఖీలా. ఈమెకి ఇక్కడ అవసరమైనవన్నీ చూపించు. సాయంత్రం వరకు ఈమెతో ఉండు'' అని టేబుల్‌పై ఉన్న ఫైల్సు చూసుకోవడంలో నిమగ్నమైపోయింది సోఫియా!

"కమాన్ ఖీలా!'' అంటూ క్రిష్టియానా గుమ్మం బయటకు నడచింది.

సోఫియాకు థాంక్స్ చెప్పి క్రిష్టియానా వెంట నడచింది ఖీలా.

ఖీలాకి ఆ రోజంతా ఎక్కడెక్కడ ఏమేమి ఉంటాయో, ఏఏ పనులలో ఎవరికి యిష్టం ఉంటుందో, ఆ పనులు నేర్చుకుందుకు ఎవర్ని కలుసుకోవాలో, ఆహార విషయాలు ఇంకా అవసరమైన సంగతుల గురించి వివరంగా అన్ని చూపిస్తూ చెప్పింది క్రిష్టియానా.

*

బేటర్డ్ ఉమెన్స్ హోమ్ వాతావరణం, చుట్టు ప్రక్కల ప్రదేశాలు ఖీలాకి ఎంతో నచ్చాయి. ఇద్దరు ముగ్గురితో బాగా పరిచయం అయింది. టైము ప్రకారం లేవటం, ఎవరి పనులు వాళ్ళు చేసుకోవటం, తనకిష్టమైన పనిలో కాలం గడపటం, మధ్య మధ్యలో పిల్లలకి, డయానాకి ఫోన్ చేయటం మొదలగు వాటితో ఖీలాకి కాలం గడచిపోతోంది.

## 52

శ్రీకాంత్ తల్లిదండ్రులు అనుకొన్న తేదీకి ఆటవా వచ్చారు. వాళ్ళ రాకతో పద్మ చాల బిజీ అయిపోయింది. వాళ్ళకి చుట్టు ప్రక్కల ప్రదేశాలు చూపించటం భర్తకి తీరుబడిలేనప్పుడు ఊళ్ళో చూడవలసినవి చూపించటం, ఇంటికి వచ్చాక యింటిపని, బజారుపనితో ఊపిరాడకుండా టైము గడచిపోతోంది. ఇంక కీర్తిక గురించి ఆలోచించే తీరిక, టైము చిక్కలేదు పద్మకి.

"ఈ రోజు ఆదివారంగదా! సాయంత్రం 'గోవిందా' టెంపుల్ వెడదాం'' అని అత్తగారైన శారదాంబతో చెప్పింది పద్మ.

"అలాగేనే అమ్మాయ్. ఇక్కడ దేవుణ్ణి కూడ చూసినట్టవుతుంది. అది సరేగాని మనం ఎన్నింటికి బయలుదేరాలి''

"మరీ దూరం ఏమికాదులెండి. అయిదింటికి బయలుదేరితే సరిపోతుంది. ఓ పదినిమిషాల్లో అక్కడుంటాం. అయిదున్నర నుండి ఏడుగంటల వరకు భజన, హారతి, భగవద్గీత పారాయణ జరుగుతాయి. తరువాత అందరికి ప్రసాదం యిస్తారు. ప్రసాదం అంటే భోజనంతో సమానం'' అని నవ్వుతూ అంది పద్మ.

"మరి పిల్లలు వస్తారా మరి?''

"వాళ్ళిష్టం, ఆ టైముకి వస్తామంటే తీసుకువెడదాం'' అని అత్తగార్కి సాయంత్రం ప్రొగ్రామ్ గురించి చెప్పింది పద్మ.

*

శారదాంబ గార్కి ఊళ్ళు తిరగాలన్నా, క్రొత్త క్రొత్త ప్రదేశాలు చూడాలన్నా మహా సరదా! ఆవిడ సంప్రదాయ కుంటుంబంలో పుట్టి పెరిగింది. పుస్తకాలు చదవటం అంటే చాల యిష్టం. కాని ఆవిడకి ఎక్కువగా చదువుకునే అవకాశం లేకపోయింది. ఇంట్లోనే పురాణ గ్రంథాలు, తమ్ముళ్ళు చదువుకునే పుస్తకాలు చదివేది. అదృష్టం కొద్ది ఆమెకి జగన్నాధం గారితో వివాహం అయ్యింది. ఆయన భార్యను వంటింటి కుందేలుగాను, పడకింటి పడతిగాను గాక, స్త్రీగా, స్నేహితురాలిగా, ఆమె ఆలోచనలకి, అభిప్రాయాలకి గౌరవం యిచ్చేవాడు. ఎంతో ప్రేమగా చూసుకునేవాడు. వారి అన్యోన్య దాంపత్యానికి గుర్తుగా శ్రీకాంత్, కల్యాణి, శ్రీలక్ష్మి పుట్టారు. కొడుకుని ఇంజనీరు చదివించాడు. అందాల భరిణె పద్మనిచ్చి వివాహం చేసారు. ఆడపిల్లలిద్దరికీ ఉన్నంతలో మంచి సంబంధాలు చూసి పెళ్ళిళ్ళు చేసారు.

శారదాంబ కోడలు పద్మని కూతుళ్ళతో సమానంగా చూసేది. జగన్నాధం గార్కి రైల్వేలో ఉద్యోగం అవటం వల్ల ప్రతి సంవత్సరం భార్యతో ఎక్కడికో అక్కడికి వెళ్తుండేవారు. తన్ను తన్నుగా ప్రేమించే భర్త తనకు లభించినందుకు శారదాంబ ఎంతో మురిసిపోయేది. ఈనాడు కాలం కలిసొచ్చి కొడుకు విదేశాలలో ఉండటం వలన విమానయానం చేయటం జరిగింది.

*

"గుడికి నువ్వొస్తున్నావా కీర్తీ?" అని శారదాంబ అడిగింది కీర్తికని.

"లేదు బామ్మా! నాకు అక్కడ బోరు కొడుతుంది" గునుస్తూ అంది.

"బోరేమిటీ పిచ్చితల్లీ! అక్కడ చాల బాగుంటుందిట కదా! అమ్మ చెప్పింది"

"వచ్చేవారం వస్తాలే! అయినా ఇప్పుడు నాకు పనుంది" అని తప్పించుకుంది కీర్తిక.

"సరే నీఇష్టం"

ఇంతలో పట్టుపరికిణీ, పట్టుజాకెట్టు వేసుకొని జడగంటలతో జడవేసుకుని మేడమీంచి చెంగు చెంగున గంతులేసుకుంటూ "బామ్మా! నేనొస్తున్నాను గుడికి" అంటూ బామ్మ పక్కన చేరింది దీపిక.

"వెరీగుడ్. అలా ఉండాలి. బంగారు తల్లి మా దీపిక అంటూ మనవరాల్ని ముద్దెట్టుకుంది శారదాంబ.

"అయ్య బాబోయ్. నీకు ఇంగ్లీషు కూడా వచ్చా బామ్మా!" అంటూ కళ్ళు చక్రాల్లా తిప్పింది దీపిక.

"నేను చదువుకోలేదే తల్లీ! నువ్వు నాన్న వాళ్ళతో ఇంగ్లీషులో మాట్లాడుతుంటే విన్నాను" అని అమాయకంగా మనవరాలితో చెప్పింది శారదాంబ.

"అయితే బామ్మా! రేపట్నుంచి నేను నీకు ఇంగ్లీషు నేర్పుతాను. నువ్వు తాతయ్యతో ఇంగ్లీషులో దెబ్బలాడుదువు గాని! ఓకేనా" అంటూ 'నీకేం పర్వాలేదు. నేనున్నాను' అని హామీ ఇస్తున్నట్టు బామ్మకేసి చూసింది దీపిక.

"ఏమిటే! బామ్మకి డబ్బా కొడుతున్నావ్" అంటూ పద్మ అక్కడకి వచ్చి "పదండి అత్తయ్యగారు బయలుదేరుదాం. మామయ్య గారు అప్పుడే కారు వద్ద వెయిట్ చేస్తున్నారు" అని అత్తగారితో అంది.

"పదమ్మా దీపి" అంటూ మనవరాలి చేయిపట్టుకుని బయటకు నడిచింది శారదాంబ.

*

పద్మ వాళ్ళు గుడికి చేరిన ఓ అయిదు నిమిషాలకి భజన మొదలుపెట్టారు. అది ఒక పెద్దహాలు. అందులో ఒక ప్రక్క చూపులను ఆకర్షించుకునేలా అందమైన రాధాకృష్ణుల విగ్రహాలున్నాయి. వాటిని మంచి మెరుపుగ పట్టువస్త్రాలతోను, పువ్వులతోను, ముత్యాల హారాలతోను అలంకరించారు. దానికి ముందు పూజాద్రవ్యాలు, సామగ్రి ఉన్నాయి. ఎడమ ప్రక్కగా ఒక సింహాసనం మీద ఒకాయన కూర్చుని ఉన్నారు. ఆయన కాషాయ వస్త్రాలతోను, మెడలో పూల దండతో ఉన్నారు. మరియొక ప్రక్క పుస్తకాలు అమర్చబడిన ఒక పెద్ద అలమారు గోడకి అతికించబడి ఉంది. అందులో పురాణ గ్రంధాలు, భగవద్గీత, మానవ జన్మ చరిత్ర, ఇంకా కొందరు గురువులు వ్రాసిన పుస్తకాలు వరుసగా సర్దిఉన్నాయి. ఇష్టం ఉన్నవాళ్ళు వాటిని తీసి చదివి మళ్ళీ అక్కడ పెట్టేయాలి. కొన్ని పుస్తకాలు ఫ్రీగా యిస్తారు.

కదలక, మెదలక కుర్చీలో కూర్చున్న మనిషిని గమనిస్తూన్న శారదాంబ "ఆయనెవరే పద్మా! అంతసేపు అలా ఉలక్కుండా, పలక్కుండా కూర్చున్నారు?" అని కోడలిని నెమ్మదిగా అడిగింది.

"మీరు చూస్తున్నది మనిషికాదు అత్తయ్యా! అది గురువుగారి ప్రతిమ. ఆయన పేరు 'భక్తి వేదాంత స్వామి ప్రభుపాద'. కొందరు ప్రభుపాదానందస్వాముల

వారని అంటారు'' అని అత్తగారి సందేహాన్ని తీర్చింది పద్మ.

"నేను నిజంగా మనిషే అనుకున్నాను సుమా!'' అంటూ ఆశ్చర్యంగా మరోసారి పరికించి చూసింది శారదాంబ.

హాలంతా నెమ్మది నెమ్మదిగా జనంతో నిండిపోయింది. భగవద్గీత పారాయణ అయిపోగానే అనుమానం ఉన్న వాళ్ళు కొన్ని ప్రశ్నలు భగవద్గీత చదివినాయన్ని అడిగారు. ఆయన ఓపిగ్గా సమాధానాలు చెప్పారు. తరువాత అందరూ లైనుగా నిలబడ్డారు. ఒకప్రక్క చిన్న కిచెన్‌లా ఉంది. అక్కడ ఓ అయిదారు రకాల పదార్థాలతో పెద్ద పెద్ద పాత్రలున్నాయి. వానిముందు ఓ ముగ్గురు నిలబడి ఉన్నారు. వారు ప్లేట్లలో అన్ని పదార్థాలని గరిటతో వేసి క్యూలో ఉన్న జనానికి అందిస్తున్నారు. వాటిని తీసుకున్నవాళ్ళు ఆ హాలులోనే వాళ్ళకు నచ్చిన చోట కూర్చుని తింటున్నారు.

పద్మ వాళ్ళు కూడ ప్రసాదం తీసుకుని ఒకచోట కూర్చున్నారు.

"అమ్మాయ్! ఇదంతా శాఖాహారమే అనుకుంటాను''

"అవునత్తయ్యా! అంతా శాఖాహారమే. ఇక్కడికి ఎక్కువగా నార్త్ ఇండియన్స్ వస్తారు. దీనిని వాళ్ళే నడుపుతున్నారు.''

"కెనడియన్స్ కూడా వచ్చారమ్మాయ్''

"ఆ! అందరూ వస్తారిక్కడికి. అందులోను లేదనకుండా ఎనిమిదింటివరకు ఫ్రీగా యిస్తారు ప్రసాదం. మన భోజన రుచులంటే యిక్కడి వాళ్ళు చాల యిష్టపడతారు''

"దేవుడి ప్రసాదం ఎలా చేసినా దానికి మంచి రుచి వస్తుంది. ఇక్కడ వాతావరణం అదీ చాల బాగుంది. మన భోజనం లాగే ఉంది. భాష ఒక్కటే తేడా. అంతే''

''అందుకే అప్పుడప్పుడు యిక్కడికి వస్తూఉంటాం. మరి యింక బయలుదేరుదామా'' అంటూ వాచీ వంక చూసింది పద్మ.

"సరే పదండి'' అంటూ అందరూ బయటకు వచ్చి కారు ఎక్కారు.

పద్మ ఇంటికి వస్తూ వస్తూ మధ్యలో దారే కదా అని 'రిడూ నది' ప్రక్కనున్న పార్కు వద్ద కాసేపు కారు ఆపి, అత్తగార్కి, మామగార్కి పార్కుని, దానిప్రక్కనదిని చూపించింది. కాసేపు అక్కడ కూర్చుని ఆ తరువాత అందరూ కలసి యింటికి వచ్చేసారు.



# 53

ఒకరోజు సాయంత్రం మొక్కలకి నీళ్ళు పెడుతోంది డయానా. ఆ సమయంలో వాళ్ళ యింటి ముందు ఒక నీలం రంగు కారు వచ్చి ఆగింది. అందులోనుండి డేవిడ్ దిగి ఆమె వద్దకు వచ్చాడు.

"హలో''

"ఎవరది?'' అంటూ వెనక్కి తిరిగి చూసింది డయానా.

"హౌఆర్ యూ?'' అంటూ నవ్వుతూ పల్కరించాడు డేవిడ్.

డయానా అతనిని చూసి రవ్వంత ఆశ్చర్యపోయినా అతని పల్కరింపుకి ఆమెకి ఒంటిమీద తేళ్ళు, జెర్రులు పాకినట్లనిపించింది. అసహ్యం, కోపం, కసి కల్గాయి. కాని అది సంస్కారం కాదనుకుని తెచ్చిపెట్టుకున్న నవ్వుతో 'హలో!' అంటూ విష్ చేసింది.

"షీలా మీ యింటికి వచ్చిందా?'' అని వినయంగా అడిగాడు.

"నో! షి హేజ్ నాట్ కమ్'' అని సీరియస్‌గా అంది.

"ఎక్కడికి వెళ్ళిందో తెలుసా?''

"లోపలకి రండి మాట్లాడుకుందాం'' అంటూ వాటర్ ట్యాప్‌ని ఆఫ్‌చేసి అయిష్టంగానే లోపలికి నడిచింది. ఆమె వెనకాలే డేవిడ్‌కూడ లోపలకెళ్ళాడు.

"నేను ఉదయం పదింటికి యింటికి వెళ్ళాను. అప్పుడు షీలా లేదు. షాపింగ్‌కి వెళ్ళిందేమోనని కాసేపు బయటకు వెళ్ళి మళ్ళీ మధ్యాహ్నం వచ్చాను. కాని అప్పుడు కూడా యింట్లోలేదు. మళ్ళీ యిప్పుడు వచ్చాను. బహుశా మీకేమైనా తెలుసేమోనని యిక్కడకి వచ్చాను'' అని తను షీలాకోసం పాపం ఎంత కష్టపడ్డదీ చెప్పాడు.

'ఏం నటిస్తున్నాడు. నాటకాలకి బాగా పనికి వస్తాడు. భార్యని సుఖపెట్టలేని వాడు ఓ మనిషేనా? నరరూప రాక్షసుడు. భార్యని పిల్లల్ని ఎంతలా కాల్చుకుతిన్నాడు స్కాండ్రల్' అని మనసులో అనుకుంటోంది డయానా.

"మీరు దేని గురించో ఆలోచిస్తూన్నట్లున్నారు'' అని డేవిడ్ కొంచెం నసుగుతున్నట్లన్నాడు.

డయానా కొంచెం ఉలిక్కిపడి "నో! నో! అదేం లేదు. షీలా గురించి కదూ అడుగుతున్నారు. ఆమె ఓ పదిరోజుల క్రితం 'బేటర్డ్ ఉమెన్స్ హోమ్'లో చేరింది'' అని అతని వంక తీక్షణంగా చూస్తూ చెప్పింది.

"ఆ మాట వినడంతో అతని ముఖంలో కత్తి వాటుకి నెత్తురు బొట్టులేదు. కొంచెం తడబడుతూ "మ... మరి... మరి.... పిల్లలు ఎక్కడున్నారో తెలుసా?''

అని బాధగా ఆమె వంక చూసాడు.

'అబ్బ ఏం ప్రేమ ఒలకబోస్తున్నాడు. ఇన్నాళ్ళూ లేనిది ఇప్పుడు పిల్లల గురించి పుట్టుకొచ్చింది ప్రేమ' అని అనుకుంటూ ఎందుకైనా మంచిదని ఈ విషయంలో కొంచెం జాగ్రత్తగా ఉంటే మంచిదనుకుంది. అసలే కోపిష్ఠి ముండా కొడుకు. అసలు విషయం తెలిస్తే ఏం చేస్తాడో దుర్మార్గుడు అని అనుకుని "ఆరోజు ఖీలాతోనే కనబడ్డారు వాళ్ళు. మళ్ళీ తరువాత కనబడలేదు. బహుశా ఏ వూరన్నా వెళ్ళేరేమో మరి తెలియదు' అని డేవిడ్‌కి సమయోచితంగా చెప్పింది డయానా.

"ఓకే! థాంక్యూ వెరీమచ్! మరి వస్తానంటూ బయటకు వెళ్ళిపోయాడు డేవిడ్.

"అమ్మయ్య! పీడా విరగడైంది" అని ఒక్కసారి గట్టిగా ఊపిరి పీల్చుకుంది డయానా.

## 54

"క్రింగ్.... క్రింగ్... క్రింగ్..."

టేబుల్ మీదున్న ఫోన్ మ్రోగటంతో వర్క్‌లో ఉన్న పద్మ రిసీవర్ అందుకుంది.

"హెలో!"

"హెలో! మమ్మీ డియర్!" అంటూ కిసుక్కున నవ్వింది కీర్తిక.

"ఏయ్ నాటీ! ఏమిటీ నీ అల్లరి?" అని చిరుకోపంగా అంది.

"నీకో గుడ్ న్యూస్ మమ్మీ!"

"ఇది ఇల్లనుకుంటున్నావా? ఆఫీసనుకుంటున్నావా? ఇంతకీ అసలు విషయం ఏమిటో చెప్పు" అంది పద్మ.

"నాకు జాబ్ వచ్చింది మమ్మీ! ఈ విషయం ముందుగా నీకు చెప్పాలని ఫోన్ చేసాను అంతే" అంది హేపీగా.

"ఓహ్! స్వీట్ హనీ! అందుకో మరి కంగ్రాచ్చులేషన్స్. సాయంత్రం తొందరగానే వచ్చేస్తాను ఇంటికి. మంచి స్వీటు చేసుకుందాం. తొందరగా ఇంటికి చేరు. ఓకేనా" అంటూ ఫోన్ పెట్టేసింది పద్మ.

కీర్తిక ఆనందానికి అవధులు లేవు. ఈ వార్త జాక్‌కి ఫోన్ చేసి చెప్పటమా? లేక సడన్‌గా అతని గదికెళ్ళి సర్‌ప్రైజ్ చేయటమా? అని కాసేపు అటు యిటు తటపటాయించి చివరకి సర్‌ప్రైజ్ చేద్దాం అని అనుకుని సాయంత్రం అతని గదికి వెళ్ళడానికి నిశ్చయించుకుంది.

సాయంత్రం అయిదవుతుండగా ట్రిమ్‌గా తయారై జాక్ రూంకి బయలుదేరింది కీర్తిక. 'చెప్పకుండా వచ్చినందుకు ఆశ్చర్యపోతాడు జాక్. అంతకంటే ఎక్కువగా తనకి ఉద్యోగం వచ్చినందుకు ఇంకా సంతోషపడతాడు. కొద్ది రోజుల తరువాత ఓ మంచి రోజున ఇద్దరూ పెళ్ళిచేసుకుంటారు. క్రొత్త జీవితాన్ని ప్రారంభిస్తారు. ఇద్దరూ ఏ ఒడుదుడుకులూ రాకుండా ఒకవేళ వచ్చినా హాయిగా నవ్వుతూ వాటిని జయిస్తారు. జీవితాన్ని నందన వనంగా మార్చుకుని హాయిగా కాలం గడిపేస్తారు' అని ముందు జీవితాన్ని గురించి ఊహించుకుంటూ జాక్ అపార్ట్‌మెంటు చేరింది కీర్తిక. కాలింగ్ బెల్‌ని తన సున్నితమైన చేతి వ్రేలితో నొక్కింది.

"............"

రెండు మూడుసార్లు నొక్కిన తరువాత నెమ్మదిగా తెరుచుకోబడింది తలుపు. తెరచిన తలుపులోంచి కోసిన కందగడ్డలాంటి జాక్ మొహం 'ఎవరా? వచ్చింది?' అని తొంగి చూసిందటు యిటు.

ఎదురుగా బంగారు మెరుపు తీగలా నిలబడ్డ కీర్తికని చూసి ఒక్కసారి షాక్ తిన్నాడు జాక్.

కొద్దిసేపటికి తనని తాను సంభాళించుకుని హలో! కీర్తికా డార్లింగ్! ను.... నువ్వేనా వచ్చింది? ఇది కలా? నిజమా!" అంటూ లోపలికి ఆహ్వానించాడు జాక్.

"ఏమిటి సడన్ సర్‌ప్రైజ్?" అని కూర్చోమన్నట్టు సోఫా చూపించాడు.

"చెప్పుకో చూద్దాం" అంటూ కళ్ళు గుండ్రంగా త్రిప్పింది.

"ఆ... ఆ... నీకు జాబ్ వచ్చి ఉండవచ్చు" అని ఓరగా ఆమె వంక చూసాడు.

"అరె! కరెక్ట్‌గా చెప్పావ్! నీకెలా తెలిసింది! అంత కరెక్ట్‌గా ఎలా చెప్పగలిగావ్" అంది ఆశ్చర్యంగా.

"ఆ! ఏముంది! నీ ముఖంలోని సంతోషం చూడగానే అదే అని గెస్ చేసాను"

"ఆ! ఆ!"

"ఊ! మరి అంతే గదా! నీకు జాబ్ వస్తే మనం పెళ్ళి చేసుకోవచ్చు. అక్కడ యిక్కడ కలుసుకో అవసరం ఉండదు గదా! ఎప్పుడు కలసి ఉండవచ్చు గదా! అవునా! అంతేనా?" అంటూ ఆమె ప్రక్కన కూర్చున్నాడు.

"నిజం జాక్! మనం అందుకోసమే గదా ఇన్నాళ్ళు ఆగింది. ఇప్పుడు ఆ అడ్డు తీరిపోయింది. సోమవారం నేను జాబ్‌లో జాయినవ్వాలి. ఈ విషయం నీకు

స్వయంగా చెప్పి వెడదామని వచ్చాను" అని అంది.

"వెరీగుడ్! ఇంతమంచి వార్త చెప్పిన నీ నోటిని తీపి చేయొచ్చా" అంటూ ఆమె పెదవుల్ని అందుకోబోయాడు.

"ఆగాగు! మరీ అంత తొందరైతే ఎలా? నోరు తీపిచేసే పద్ధతి ఇది కాదు" అంటూ అతన్ని వారించింది.

"ఇదే నీతో వచ్చినగొడవ. ఎంత సంతోషంగా ఉన్నప్పుడైనా దగ్గరకి రానీయవు. మరీ ఏమిటో కట్టుబాట్లు" అంటూ సీరియస్‌గా మొహం పెట్టాడు జాక్.

"సారీ! డియర్! కొద్ది రోజులాగితే ప్రతీక్షణం మనదే. ఏ నిబంధనలు ఉండవు. అంతవరకు తప్పదు మరి. కోపం వచ్చిందా?"

"నో! నో! నీమీద కోపం ఏమిటి? నిన్ను, నీ అందాన్ని చూస్తూంటే దూరంగా ఉండలేకపోతున్నాను. ఇంకా ఎన్నాళ్ళో నాకీ బ్రహ్మచర్యం" అంటూ నవ్వేసాడు.

ఒక్కనిముషం అంటూ ప్రక్కనున్న మరొక గదిలోకి వెళ్ళాడు.

కీర్తిక అతని గదిని ఒక్కసారి కలయచూసింది. గదంతా అప్పుడే సర్దినట్లుంది. బెడ్‌సీట్‌గా క్రొత్త బెడ్‌షీట్‌తో వేయబడిఉంది. గదంతా నీలంరంగు మేచింగ్‌తో ఉంది. ఫ్రెంచి పెర్‌ఫ్యూమ్ సువాసనలు ముక్కు పుటాలను తాకుతోంది. మనసు ఎంతో ఉల్లాసంగా ఉంది కీర్తికకి. జాక్‌తో జీవితం ఎంత సుఖంగా ఆనందంగా ఉంటుందో అని ఆలోచిస్తూండగా "ఏమిటి అంత సీరియస్‌గా ఆలోచిస్తూన్నావ్? నా గురించేనా?" అంటూ తన చేతిలో ఉన్న ప్లేటుని కీర్తికకి యిచ్చాడు.

"ఏమిటి! ఇదంతా?" అంటూ ప్లేటు అందుకుంది.

"నథింగ్! స్వయంగా పీజా తయారుచేసాను. రుచిచూడు అంతే! అంతకన్నా ఏం లేదు. కావలిస్తే ఫ్రెంచి వైన్ ఓపెన్ చేస్తాను"

"వైన్ వద్దుగాని దీనిని టేస్ట్ చేస్తాను" అంటూ పీజా ముక్కను తినసాగింది.

"హూ! వండ్రఫుల్! చాల బాగా వచ్చింది. కుక్‌కూడా నువ్వే చేసావా?"

"ఆ! ఆ!"

"ఆ! ఆ! ఏమిటి? నీకు కుక్ చేయటం కూడ వచ్చన్నమాట"

"ఆ! ఆ! బ్రహ్మాండంగా వచ్చు"

"అయితే నేను చాల లక్కీ ఫెలోనన్నమాట"

"నీకేం! నువ్వన్నిటిలోను అదృష్టవంతురాలివే"

"ఏం? నువ్వుకాదా?"

"ఎందుకుకాదు! నీలాంటి అందాలరాశిని భార్యగా పొందటం అదృష్టం కాకమరేమిటి? అది సరేగాని కీర్తీ! ఈ సందర్భంలో నీకు రేపు స్కైలైన్ హోటల్‌లో పార్టీ యిస్తున్నాను. నువ్వు కాదనకుండా రావాలి. అంతే! నిన్ను నేను డ్రైవ్ చేస్తాను. భయం ఏమీ అక్కరలేదు. ఓకేనా?" అంటూ ఆమె వంక చూసాడు జాక్.

"ఇప్పుడు అనవసరంగా ఖర్చెందుకు జాక్? మరోరోజు చూద్దాం"

"నో! నో! అదేం కుదరదు. రేపు కాదంటే ఈరోజు నిన్ను ఇంటికి వెళ్ళనివ్వను. సరేనా" అన్నాడు కొంటెగా.

"ఓ మైగాడ్! అంత పనిచేయకు"

"మరి వస్తున్నట్లేనా?"

"తప్పుతుందామరి!" అంటూ నవ్వేసింది కీర్తిక.

"అబ్బ! ఆ నవ్వులో ఎన్ని నవరత్నాలు రాలుతాయో! ఏరుకో లేకపోతున్నాను బాబూ!"

"ఇంకా! నయం" అంటూ చేతికున్న వాచీవంక చూసుకుని "బాబోయ్! తెలీకుండా చాలా టైం గడచిపోయింది. మమ్మీ డాడీ కంగారు పడుతూంటారు. ఇంక నేను వెడతాను జాక్" అంటూ సోఫాలోంచి లేచింది.

"అప్పుడేనా? అసలు వచ్చినట్టులేదూ! వెళ్ళినట్లులేదు" అని బెంగగా మొహం పెట్టి అన్నాడు.

"మళ్ళీ రేపు కలుస్తాం గదా!"

"ఓకే మరి. గుడ్‌నైట్" అని చటుక్కున ఆమె బుగ్గమీద ముద్దుపెట్టుకున్నాడు జాక్.

"యూ నాటీ!" అంటూ చేత్తో బుగ్గ రాసుకుంటూ చిరుకోపంగా జాక్ వంక చూసింది.

"సారీ! కీర్తి! యూ ఆర్ ఎ బ్యూటీఫుల్ గర్ల్"

"ఊ! నీ కబుర్లకేంగాని మరి ఉంటాను" గుడ్‌నైట్ చెప్పి యింటికి బయలుదేరింది కీర్తిక.

*

రాత్రి పదవుతున్నా ఇంకా యింటికి రాని కీర్తిక గురించి అందరూ కంగారు పడుతున్నారు.

"ఏ స్నేహితురాలి యింటికైనా వెళ్ళిందేమో! వస్తుందిలే. చిన్నపిల్ల కాదుగదా! ఉద్యోగం వచ్చిన సందర్భంగా ఏ సినిమాకైనా వెళ్ళిందేమో! కంగారు పడక్కరలేదు" అని భార్యతో అన్నాడు శ్రీకాంత్.

"శ్రీకాంత్" అంటూ మెల్లిగా పిలిచింది పద్మ.

ఏమిటన్నట్టు ఆమె వంక చూశాడు.

"ఎప్పటి నుంచో చెబుదాం అనుకుంటున్నాను. నీకోవిషయం చెప్పాలి" అంది కొంచెం నెమ్మదిగా.

"ఏమిటి? ఈ రోజు రాత్రి ఏమైనా స్పెషల్...." అంటూ చిలిపిగా ఆమె ప్రక్కకు జరిగాడు.

"ఉష్! ఎప్పుడూ ఒకటే ధ్యాస. ఇంక వేరే ఏమి పనిలేదా. నేను సీరియస్‌గా చెబుదామనుకుంటే"

"ఓ! సారీ! నేనూ సీరియస్‌గానే వింటాను" అని బుద్ధిమంతుడిలా చేతులు కట్టుకుని సోఫాలో కూర్చున్నాక,

"ఏం లేదు. కీర్తిక..."

"కీర్తిక గురించి ఏం కంగారుపడవద్దని చెప్పాగా. ఈ పాటికి వచ్చేస్తుంటుంది. ఓ అరగంట చూసి అప్పటికీ రాకపోతే వాళ్ళ ఫ్రెండ్స్‌కి ఫోన్ చేసి కనుక్కుందాం. సరేనా!"

"అది కాదు శ్రీ! మనకీర్తికకి పెళ్ళీడు వచ్చింది. మరి పెళ్ళి గురించి ఆలోచించాలి గదా!"

"అప్పుడే ఏం తొందరొచ్చింది దాని పెళ్ళికి. అయినా ఇప్పుడు నీకా ఆలోచన ఎందుకు వచ్చింది" అని అనుమానంగా ఆమె వంక చూసాడు.

కీర్తిక, జాక్‌ల పరిచయం గురించి, వారి ప్రేమ గురించి, వివాహంపై వారిద్దరికీ ఉన్న అభిప్రాయాల గురించి అన్ని వివరంగా భర్తకి చెప్పింది పద్మ.

"ఓస్ ఇంతేనా! ఇందులో ఆశ్చర్యపడవలసినదేమీ లేదు. కీర్తిక వచ్చాక అన్ని విషయాలు నేను మాట్లాడుతాను. పెళ్ళి దాకా వచ్చిందంటే ఆశ్చర్యమే" అంటూ తేలిగ్గా మాట్లాడేసాడు శ్రీకాంత్.

"అదేంటి? అంత లేలిగ్గా మాట్లాడేశారు?" అంటూ వింతగా చూసింది పద్మ.

"మన కీర్తిక తెలివైంది.చదువుకున్నదీను. ఎందుకంటే ఇక్కడ స్నేహాలు ప్రేమలు ఎప్పుడు ఎలా ఉంటాయో ఎవరికీ తెలియదు. ఏ క్షణంలోనైనా మనసు మార్చుకోవచ్చు. ఏదైనా కొంచెం సీరియస్‌గానే ఆలోచించాలి. తొందరపడకూడదు" అంటూ సిగరెట్టు వెలిగించాడు.

ఇంతలో కాలింగ్ బెల్ మ్రోగటంతో పద్మ లేచి వెళ్ళి తలుపు తీసింది. వచ్చింది కీర్తిక.

"అమ్మయ్య" అంటూ ఊపిరి పీల్చుకుంది పద్మ.

"అయ్యాయా తల్లీ! పెత్తనాలు" అని కోపంగా అంది పద్మ.

"సారీ మమ్మీ! ఫ్రెండ్ యింటికెళ్ళాను. తొందరగానే వచ్చేద్దామని అనుకున్నాను. కాని మాటల్లో టైం తెలియలేదు. అందులోను బస్సు మీద వచ్చేటప్పటికి ఆలస్యం అయింది" అని సంజాయిషీ చెప్పుకుంది కీర్తిక.

"సరేలే పద! అన్నం తిందువుగాని" అంటూ లోపలకి వెళ్ళింది పద్మ.

"పద హనీ! నీకోసం మమ్మీ కూడ భోజనం చేయకుండా కూర్చుంది" అంటూ చిన్నగా నవ్వాడు శ్రీకాంత్.

"ఓకే డాడీ! ఒక్కక్షణం. బట్టలు మార్చుకువస్తాను" అంటూ తన గదిలోకి వెళ్ళింది కీర్తిక.

## 55

రాత్రి పన్నెండు గంటలు దాటుతున్నా స్కాట్ రాకపోయే సరికి డయానాకి భయంవేసింది. ఈ అర్ధరాత్రి ఏం జరిగిందో! ఏమో! ఎవరైనా మాట్లాడిస్తే ఏడుపు వచ్చేసేలా ఉంది.

ఆవలింతలొస్తుంటే స్టేసీ కిచెన్‌లోకి వెళ్ళి రెండు కప్పుల టీ కలిపితెచ్చి ఒకకప్పు డయానాకిచ్చి ఒకటి తను తీసుకుంది.

"థాంక్స్ హనీ! అయినా ఇప్పుడెందుకు కలిపావ్. కాసేపట్లో అంకుల్ వచ్చేస్తారు గదా!" అని మనసులో బాధను మ్రింగుతూ అంది డయానా.

"టైం రెండు గంటలవుతోంది. అంకుల్ ఎప్పుడు వస్తారో? ఏమిటో? అసలు ఏం జరిగిందో? అయినా వెళ్ళి చాల సేపయింది. బహుశా వస్తూండవచ్చు. మీరు ధైర్యంగా ఉండండి ఆంటీ!" అని ధైర్యం చెప్పింది స్టేసీ.

చిన్నతనం నుండి షీలా పిల్లల్ని ఎలా పెంచిందీ, భర్తని ఎలా ప్రేమగా, గౌరవంగా చూసేదీ, తల్లి పడ్డ బాధలు అన్నీ వివరంగా డయానాకి చెప్పింది స్టేసీ.

"ఐ నో స్టేసీ! షీలా అందరిలాంటి స్త్రీ కాదు. సాగరంలోని అలల లాగ అన్నిటిని తన గుండెలోనే దాచుకుంది. పైకి గంభీరంగా, నవ్వుతూ కన్పించేది.

ఆమె మంచితనమే  ఆమెను కాపాడింది'' అని ఇంకా ఏదో చెప్పబోతుండగా కాలింగ్ బెల్ మ్రోగటంతో ఒక్కసారి ఇద్దరూ ఉలిక్కి పడ్డారు.

స్టేసీ లేచివెళ్ళి ఎవరు వచ్చారో అని ముందు విండ్ మిర్రర్ లోంచి చూసి స్కాట్ అని తెలుసుకుని తలుపుతీసి బయట నిలబడ్డ వ్యక్తుల్ని చూసి ఒక్కసారి 'ఆంటీ' అంటూ గట్టిగా అరచింది స్టేసీ.

## 56

మనోహర్ ఒకరోజున తల్లిదండ్రులతో వచ్చే ఆదివారం చర్చిలో జెనిఫర్‌ని వివాహం చేసుకోబోతున్నట్లు చెప్పాడు. నీరజ, రాజశేఖరం ఒకరి మొహాలు ఒకరు చూసుకున్నారు. తను మాట్లాడవలసింది. ఇంక ఏమి లేనట్లు అక్కడ నుండి వెళ్ళిపోయాడు మనోహర్.

మనసులో బాధగా ఉన్నా ఏమి చేయలేని పరిస్థితి. ఇటు కాదనటానికీ వీలులేదు. అటుచేసుకోమనటానికి మనసొప్పటం లేదు. లక్షణమైన పిల్ల మన కుటుంబంలోది అయితే బాగుంటుందని వారి ఉద్దేశ్యం. ఏ ఒడుదుడుకులొచ్చినా పరిష్కరించడానికి అవకాశం ఉంటుంది. ఏది ఎలా జరగాలో అంతా దైవనిర్ణయం'' అని ఆ దంపతులిద్దరూ మనసుని రాయిచేసుకున్నారు.

*

ఆదివారం చర్చిలో మనోహర్ వివాహం వైభవంగా జరిగింది. అంతా అమ్మాయి వాళ్ళ పద్ధతిలోనే జరిగింది. సాయంత్రం నూతన దంపతులిద్దరూ యింటికి వచ్చారు. వారిని సహృదయంతో లోపలకు ఆహ్వానించింది నీరజ. చూడడానికి జంట ముచ్చటగా ఉంది.

రాత్రి భోజనాలటేబుల్ వద్ద అందరూ కూర్చున్నారు. అన్ని స్పెషల్‌గా క్రొత్త రకాల వంటలతో భోజనం ఏర్పాటు చేసింది నీరజ. ఇండియన్ వంటలు తింటుందో, తినదో అని జెనిఫర్‌కి కొన్ని ప్రత్యేకమైన కెనడియన్ ఫుడ్ కూడ తయారు చేసింది. వాటిని తింటూ చాల రుచిగా ఉన్నాయని మెచ్చుకుంది జెనిఫర్. జెనిఫర్ అందరితోను కలివిడిగా మట్లాడింది.

"డాడీ! మేము రేపు వేరే అపార్ట్‌మెంటులోకి వెడుతున్నాం. జెనీకి, నాకు దగ్గరగానే ఉంది ఇల్లు. అప్పుడప్పుడు వస్తుంటాం'' అని తండ్రితో చెప్పాడు మనోహర్.

"అప్పుడే ఏం తొందర మనోహర్. కొన్నాళ్ళిక్కడుండి వెడుదురుగాని'' అని నీరజ అంది.

"అవునురా! మనూ! కొన్నాళ్ళు కలసిఉంటే మాకు ఆనందంగా ఉంటుంది. జెనిఫర్‌కి మనతో కల్సి ఉన్నట్లుంటుంది. ''ఏమ్మా! జెనిఫర్ నువ్వేమంటావ్?'' అని కోడలిని లాలనగా అడిగాడు రాజశేఖరం.

జెనిఫర్ మౌనంగా తలదించుకుంది యిష్టం లేనట్లు.

''నో! డాడీ! వీకెండ్స్‌లో వస్తూంటాం గదా!'' అని తల్లి దండ్రుల అభిప్రాయాన్ని సున్నితంగా తిరస్కరించాడు మనోహర్.

"సరే! మీ యిష్టం'' ఇంక చేసేదేమిలేదన్నట్లుగా మౌనంగా ఉండిపోయాడు రాజశేఖరం.

నీరజ ప్రేమగా అందరికీ కొసరి కొసరి వడ్డించింది. భోజనాల అనంతరం మనోహర్, జెనిఫర్‌లు తమ రూంలోకి వెళ్ళిపోయారు.

నీరజ చాటుగా చీరచెంగుతో కళ్ళు తుడుచుకోవటం రాజశేఖరం చూడకపోలేదు. బాధగా ఓ నిట్టూర్పువిడిచాడు.

ఆ మర్నాడుదయం తల్లి దండ్రుల దగ్గర శెలవుతీసుకుని తన సామానుతో జెనిఫర్‌తో కలసి క్రొత్త అపార్ట్‌మెంటుకి వెళ్ళిపోయాడు మనోహర్.

## 57

స్టేసీ అరచిన అరుపుకి కంగారుగా 'ఏమైంది? ఏమైంది?' అంటూ గుమ్మం దగ్గరకు వచ్చి ఆగిపోయింది డయానా. ఎదురుగా ఉన్న దృశ్యాన్ని చూసిన ఆమెకు నోట మాట రాలేదు. తన కళ్ళను తానే నమ్మలేకపోతోంది. "ఇది కలా? నిజమా?'' అని అనుకుంటూ అలాగే నిలబడి పోయింది.

"లోపలకు రానిస్తావా? లేదా?'' అని స్కాట్ అడగటంతో,

"సారీ!'' అంటూ ప్రక్కకు తప్పుకుంది.

స్కాట్ లోపలకు వచ్చాడు. అతని వెనకాల వచ్చిన వ్యక్తిని చూసి బ్రె... బ్రెంట్ అంటూ అమాంతంగా కొడుకుని కౌగిలించుకుంది. అంతసేపు నిగ్రహించుకున్న బ్రెంట్ కూడ మమ్మీ అంటూ బావురుమన్నాడు. అలా ఆ తల్లీ కొడుకులు ఎంత సేపున్నారో తెలియదు. ఆమె మాతృహృదయం ఆనందంతో పొంగిపోయింది. "ఎన్నాళ్ళయిందిరా హనీ! నిన్ను చూసి. నాకు తెలుసు నువ్వు తప్పకవస్తావని. నువ్వు ఏ తప్పుచేయలేదు. ఐ లవ్ యూ హనీ!'' అంటూ కొడుకు

బుగ్గలపైన ముద్దుల వర్షం కురిపించింది.

ఇది గమనిస్తున్న స్కాట్ "ఇంక మనల్ని ఎవరూ పట్టించుకోరు స్టేసీ! పద లోపలకి పోదాం" అని స్టేసీ వంక చూసాడు స్కాట్.

"అదేంటి అంకుల్! అలా అంటారు? ఒక్కసారి బెంట్‌ను చూసిన నాకే ఎంతో సంతోషంతో నోటమాట రాలేదు. అలాంటిది కన్నతల్లి హృదయం ఎంత ఆనందపడుతోందో మనం అర్థం చేసుకోలేం. ఇన్నాళ్ళు ఎంత క్షోభ అనుభవించిందో ఆంటీ!" అని ప్రేమగా చూసింది.

'ఇంకనేం! మీరందరూ ఒకటైపోయారు. ఇంక నాకు డ్రాయింగు రూంలో సోఫాయే గతి" అంటున్న స్కాట్‌మాటలకి అందరూ ఒక్కసారి గొల్లున నవ్వారు.

కొంతసేపటికి తెప్పరిల్లిన డయానా కొడుకుని నఖశిఖ పర్యంతం చూస్తూ "ఎలా చిక్కిపోయావ్ హనీ! ఇన్నాళ్ళూ ఎక్కడికెళ్ళావ్. ఏమైపోయావ్? మేమేమైనా అంటామని భయం వేసిందా?" అని ప్రశ్నల వర్షం కురిపించింది డయానా!

"ముందు వాణ్ణి రెస్ట్ తీసుకోనీ. జరిగినవన్నీ తరువాత చెబుతాడు" అని సంభాషణని మధ్యలో కట్ చేసాడు స్కాట్.

"పర్వాలేదు డాడీ! నౌ అయామ్ ఆల్‌రైట్" అంటూ సోఫాలో అలసటగా కూర్చున్నాడు బ్రెంట్.

ఇంతలో స్టేసీ ఒక ప్లేటులో కూకీస్, నాల్గుకప్పుల కాఫీ తెచ్చి అందరికీ యిచ్చింది. కూకీస్ ప్లేటుని బ్రెంట్‌కి అందిస్తూ "తీసుకో బ్రెంట్" అంది. "థాంక్స్ స్టేసీ" అంటూ ప్లేటుని అందుకున్నాడు.

"టీ కలపలేకపోయావా స్టేసీ' అని స్కాట్ అన్నాడు.

"కాఫీ అయితే బ్రెంట్‌కిష్టం అని అదేకలిపాను అందరికీ"

"థాంక్యూ వెరీమచ్ స్టేసీ! కాఫీ చాల బాగుంది" అని మెచ్చుకోలుగా అన్నాడు బ్రెంట్.

"థాంక్స్" అంటూ భుజాలెగరేసింది స్టేసీ.

"నేను ఆరోజు రాత్రి పదకొండు గంటలకి ఫ్రెండ్స్‌ని వదిలేసి సినిమా నుండి యింటికి తిరిగి వస్తుంటే 'బ్లాక్ బర్న్ స్ట్రీట్' దగ్గర మలుపు తిరుగుతుంటే ఒకకారు సడన్ బ్రేక్‌తో వచ్చి ఫుట్‌పాత్ ప్రక్కన ఆగింది. ఆ కారులోంచి ఒకతనుదిగి ముందుకి నడుస్తూన్న నన్ను హలో! అంటూ పిలిచాడు. నేను వినికూడ వినపడనట్లు ముందుకు తొందరగా నడుస్తున్నాను. కాని అతను గట్టిగా ప్లీజ్! హెల్ప్ మీ! అంటూ అరిచాడు. దరిదాపుల్లో ఎవరూ లేరు. పోనీ వెడదాం అనుకుని వెనక్కితిరిగి కారు వద్దకు వెళ్ళాను. అతను ఒక అడ్రసు కాగితం చూపించి ఎక్కడ? అని అడిగాడు. నేను ఆ కాగితంలో ఉన్నది చదివి చెప్పబోయేంతలో అతను ఒక తెల్లని రుమాలుని జేబులోంచి తీసి నా ముక్కుకి అడ్డుగా బలవంతంగా అడ్డుపెట్టాడు. నేను వదిలించుకుందామని ప్రయత్నించాను. కాని అంతలో కారులోంచి మరొక వ్యక్తి దిగివచ్చి నన్ను కారు వెనకసీట్లో కూర్చోపెట్టటం మాత్రం నాకు తెలుసు. ఆ తరువాత ఏం జరిగిందో నాకు తెలీదు. నాకు స్పృహ వచ్చి చూచేటప్పటికి నా ఎదురుగా యిద్దరు వ్యక్తులున్నారు. వాళ్ళు నన్ను పల్కరిస్తూ,

"నువ్వు మేం చెప్పినట్లు చేస్తే నీకు చాల డబ్బు యిస్తాం. నువ్వు మా నుండి తప్పించుకుని వెళ్ళలేవు. ఏమైనా పిచ్చివేషాలు వేసినా పోలీసులకి ఫోన్ చేయడానికి ప్రయత్నించినా నీ ప్రాణాలు నీకు దక్కవు. నీవు ఎప్పుడు ఏం చేయాల్సినదీ వేమం నిర్ణయిస్తాం. నిన్ను ప్రతి నిమిషం ఒక మనిషి వెంటాడుతూంటాడు. పొరపాటున కూడ నీవు పారిపోడానికి ప్రయత్నించకు. చేస్తే చిక్కుల్లో పడతావ్. బీ కేర్‌ఫుల్" అని ఆ యిద్దరు నన్ను హెచ్చరించారు.

"నేను పౌరుషంగా అసలు నన్ను ఎందుకు పట్టుకొచ్చారు. మీకు ఇంకెవరూ దొరకలేదా?" అని గట్టిగా అరిచాను.

"నీ లాంటి వాళ్ళు మా దగ్గర చాలమంది ఉన్నారు. అందులో నువ్వొకడివి. మా పనులు సక్రమంగా జరగాలంటే మీలాంటి యువకులే కావాలి. మాకు ఎదురు తిరిగిన ఇద్దరు ముగ్గురు ఆకాశంలో మెరుస్తూన్నారు. అర్థం అయిందా! పిచ్చి వాగుడు వాగకచెప్పినట్లు నడుచుకో!" అని బెదిరించి వెళ్ళిపోయారు.

నాకు వెంటనే ఏం చేయాలో అర్థం అవలేదు. తొందర పడితే ప్రాణాలకే ముప్పు. అందుకని వాళ్ళు ఏం పని చెప్పినా నమ్మకంతో చేసేవాణ్ణి. నిజానికి నేనున్నది మరొక ఊళ్ళో. వీళ్ళుంటున్న ప్రదేశం ఊరికి చివర్లోఉంది. అందరికంటే ఎక్కువగా పనిచేసేవాణ్ణి. ఎటువంటి పరిస్థితిలోను వాళ్ళకి అనుమానం రాలేదు. అలా అని నన్ను ఫ్రీగా వదిలేవారు కాదు. ఇంకాస్త కట్టుదిట్టంగా ఉంచేవారు. నిజానికి వాళ్ళది ఒక పెద్ద స్మగ్లింగ్ ముఠా. ఆ ముఠాలో సుమారు పన్నెండు మందిదాకా ఉన్నారు. వీళ్ళలో యిద్దరు గ్రూపులీడర్లు. మిగతావాళ్ళు వయసులో ఉన్న యువకుల్నీ, యువతుల్నీ పట్టుకొచ్చి తమ పనులకి వాళ్ళని బెదిరించి, భయపెట్టి చేయించుకుంటారు. వాళ్ళకి మిగతా ప్రాంతాలలో కూడ కొన్ని సంస్థలున్నాయి. యువతులతోను, యువకులతోను 'బ్లూఫిలిమ్స్' తీసి పెద్ద

వ్యాపారం చేస్తున్నారు. అదంతా ఒక పెద్ద విషవలయం. అందులోంచి బయటపడాలంటే చాల కష్టం. వాళ్ళకి లొంగని వాళ్ళని వివిధరకాలుగా హింసించి లొంగదీసుకుంటారు. ఆ హింసించటంలో కొందరు ప్రాణాల్ని కూడ పోగొట్టుకున్నారు.

నాకు ఎందుకో ఒక విధమైన మొండిధైర్యం ఉండేది. మిమ్మల్ని తల్చుకున్నప్పుడల్లా ఏడుపు వచ్చేది. మీరు నా గురించి ఎంత ఆందోళన పడుతున్నారో అని. ఒక ప్రక్క నేను బ్రతికి బయట పడతానా? మళ్ళీ మిమ్మల్ని చూడగల్గుతానా? అని అన్పించేది.

అలాంటి పరిస్థితిలో నాకు ఎన్నాళ్ళనుంచో ఎదురుచూస్తున్న అవకాశం నిన్న దొరికింది.

నిన్న ఒక పనికి నన్ను పురమాయించారు. అదృష్టవశాత్తు నావెంట ఉండేవ్యక్తికి అకస్మాత్తుగా గుండె నొప్పివచ్చి దారిలో పడిపోయాడు. వెంటనే నాకు ఒక మెరుపులాంటి ఆలోచన వచ్చింది. కాని- మళ్ళీ అతన్ని అలాంటి పరిస్థితిలో విడిచి వెళ్ళిపోవటం మంచిదికాదేమో! అన్పించింది. కాని అలాంటి దుర్మార్గులకి నరరూప రాక్షసులకి సహాయం చేయటం ఎంత బుద్ధి తక్కువ పనో అని అనుకొని క్షణం కూడ ఆలస్యం చేయకుండా అక్కడ నుండి అతివేగంగా పరుగెట్టి పరుగెట్టి చివరకి ఆ ఊరిపోలీస్టేషన్‌కి చేరుకున్నాను. అక్కడ వాళ్ళకి నా అడ్రసు, మీ పేరు అదీ చెప్పాను. తరువాత జరిగిన సంగతంతా వివరంగా చెప్పాను. నేను చెప్పినవన్నీ వాళ్ళు రికార్డ్‌లో నోట్ చేసుకున్నారు.

తరువాత వాళ్ళు నన్ను చాలప్రశ్నలు వేసారు. ముఠాలో చూసిన మనుష్యుల రూపురేఖల్ని అడిగారు. నేను వాటికి సమాధానాలు చెప్పగా సి.ఐ షెల్ఫ్ లోంచి కొన్ని ఫోటోలను తీసి టేబుల్ మీద పెట్టి 'నువ్వు చూసినవాళ్ళు ఇందులో ఉన్నారా?' అని అడిగాడు. నేను వాటిని చూసి మూడు నాలుగు ఫొటోలని చూపించాను. తరువాత వాళ్ళు వెంటనే నన్ను వదలలేదు. గుండెనొప్పి వచ్చిన మనిషిని చూపించమని నావెంట బయలుదేరారు. అదృష్టవశాత్తు ఆ మనిషి మేము వెళ్ళేటప్పటికి అలా పడిపోయే ఉన్నాడు. అతన్ని కాప్స్ కస్టడీలోకి తీసుకున్నారు. నేను చెప్పిన వివరాల్ని బట్టి వెంటనే కొంతమంది సిబ్బందితో బయలుదేరి స్మగ్లర్ ముఠాని పట్టుకున్నారు. ఇదంతా పూర్తి అయేటప్పటికి చాల టైం పట్టింది. తరువాత నన్ను కొంత మంది కాప్స్‌తో మనవూరు పోలీసుస్టేషన్‌కి పంపించారు. అక్కడికి వచ్చాక మీకు ఫోన్ చేసారు'' అని బ్రెంట్ చెప్పటం కొంచెం ఆపాడు.

"ఆ! ఇంక నువ్వు కాసేపు ఆగు. తరువాత విషయం నేను చెబుతాను'' అంటూ స్కాట్ బ్రేక్ వేసాడు.

"చెప్పండి అంకుల్! చాల థ్రిల్‌గా ఉంది స్టోరీ'' అంటూ స్టేసీ సీరియస్‌గా వినటం మొదలెట్టింది.

"ఏముంది నేను స్టేషన్‌కి వెళ్ళగానే నన్ను ఎంతో గౌరవంగా ఆహ్వానిస్తూ బ్రెంట్‌ని రక్షించినపద్ధతీ అన్నీ వివరంగా చెప్పారు. వాళ్ళ సహాయానికి థాంక్స్ చెప్పి నీ సుపుత్రుణ్ణి జాగ్రత్తగా యింటికి తీసుకువచ్చాను. రేపు హెడ్ లైన్స్‌లో బ్రెంట్ ధైర్యాన్ని పొగుడుతు పత్రికలు రాస్తాయి చూడు'' అంటూ టూకీగా చెప్పాడు స్కాట్.

"అంతా సినిమా స్టోరీలా జరిగిపోయింది. ఇంక వాడికేం భయంలేదు గదా?'' అని కంగారుగా అడిగింది డయానా.

"ఇంక మనవాడికి ఎటువంటి భయంలేదు. ఎటువంటి పరిస్థితిలోనైనా పోలీసుల సహాయం ఉంటుంది. ఏది ఏమైన మన అదృష్టం బాగుండి వాడు మనకు దక్కాడు''

"అమ్మయ్య'' అని ఒక్కసారి అందరూ తేలిగ్గా ఊపిరి పీల్చుకున్నారు. వారి కన్నుల్లో ఆనంద దీపాలు వెలిగాయి. చర్చి అయిదు గంటలు కొట్టింది. అందరి హృదయాలలోను బాలభానుని కిరణాలు ఉదయించాయి.

*

బ్రెంట్ వచ్చిన సందర్భంగా స్కాట్ పెద్ద పార్టీ ఏర్పాటు చేసాడు.

ఆ పార్టీకి ఆత్మీయులనందర్ని ఆహ్వానించాడు.

అందరూ బ్రెంట్ చాల అదృష్టవంతుడని మెచ్చుకున్నారు. మనిషికి మంచితనం రక్షణ కవచంగా ఉంటుందని డయానాకి ఓ గట్టి నమ్మకం.

స్టీవ్, పింకీలు కూడ పార్టీకి వచ్చారు.

పార్టీ రోజున హడావుడి అంతా జాన్, స్టేసీ, బ్రెంట్, మెర్సీలదే.

ఆ లేత హృదయాల ఆనందానికి అవధులులేవు.

కానీ- స్టీవ్, పింకీల కళ్ళు జెర్సీ కోసం ఎదురుచూసి నిరుత్సాహంగా పార్టీలో కల్సిపోయాయి.

## 58

"ట్రింగ్.... ట్రింగ్.... ట్రింగ్..."

"హలో!"

"హలో! ఖీలా! ఎలా ఉన్నావ్?"

"ఆయ్! డయానా! ఏమిటి విశేషం?" అంటూ హేపీగా మాట్లాడింది ఖీలా.

"నీకో గుడ్ న్యూస్"

"ఏమిటదీ?" అని ఆశ్చర్యంగా అంది.

"బ్రెంట్ తిరిగొచ్చాడు" అని సంతోషంగా చెప్పింది.

"ఓహ్! హార్టీకంగ్రాచ్చులేషన్స్. ఐ యామ్ వెరీ వెరీ హేపీ టు నో దట్!" అంటూ తన ఆనందాన్ని వ్యక్త పరచింది.

ఇంతలో ఖీలాని ఎవరో పిలవటంతో "తరువాత మాట్లాడుతాను డయానా" అంటూ ఫోన్ పెట్టేసింది ఖీలా!

"మిమ్మల్ని 'సూపరింటెండెంట్' పిలుస్తున్నారు" అని చెప్పి వెళ్ళిపోయింది బెట్టీ.

*

"ఈయన మీకు తెలుసా?"

"తెలుసు"

"మీకేమవుతారు?"

"ఆయన ఒకప్పుడు నన్ను వివాహం చేసుకున్న వ్యక్తి" అంది ఖీలా.

"ఆయన మిమ్మల్ని తిరిగి తీసుకువెళ్ళడానికి వచ్చారు. మీకిష్టమేనా?"

"నో! నేను అతని నుండి రక్షణ పొందేందుకే యిక్కడకు వచ్చాను. మా యిద్దరి మధ్య చాల భిన్నాభిప్రాయాలున్నాయి. తొందరలో ఆయనకి విడాకులు యివ్వదలచుకున్నాను" అని ధైర్యంగా చెప్పింది ఖీలా.

"డేవిడ్ మీరేం అంటారు?"

"ఆమెనా భార్య. పొరపాటునా ఏదో చిన్న చిన్న తప్పులు చేసాను. దానికి నేను చాల పశ్చాత్తాపపడుతున్నాను. అంతమాత్రాన నా నుండి దూరం అవటం నేను భరించలేను. ఆమె లేకపోతే నేను జీవించలేను" అని ఎంతో బాధగా చెప్పాడు.

"నో! అదంతా నాటకం! మీరు నమ్మకండి. అతని వలన నేను ఎంత నరకం అనుభవించానో మాటల్లో చెప్పలేను. దయచేసి నన్ను అర్థం చేసుకోండి. ఇంతకన్నా నేను చెప్పేదేమిలేదు" అని కళ్ళ నీళ్ళెట్టుకుంది ఖీలా.

ఇదంతా విన్న సూపరింటెండెంట్ ఖీలా తరపున లాయర్ని ఏర్పాటు చేసి ఆమెకి భర్తతో విడాకులు పొందటానికి సహాయం చేస్తానని చెప్పింది ఖీలాకి.

దాంతో డేవిడ్ తోక త్రొక్కిన కోతిలా చిందులు వేస్తూ కోపంగా బయటకు వెళ్ళిపోయాడు. కొద్ది రోజులకి ఖీలా వైపు ఎక్కువ ఆధారాలుండటం వల్ల డేవిడ్‌నుండి ఆమె విడాకులు పొందడానికి కోర్టువారు అనుమతించారు. ఆ విషయం తెలిసిన ఖీలా ఆనందంతో వెంటనే డయానాకి ఫోన్ చేసి తెలియపరచింది.

తరువాత ఖీలాకి 'బేటర్డ్ ఉమెన్స్ హోమ్' వాళ్ళు కొద్దిరోజులలో ఆమెకి ఏదో ఒకజాబ్ యిస్తామని చెప్పారు. చితికి పోయిన తన జీవితాన్ని చిగురింపచేసిన వాళ్ళకి తన కృతజ్ఞతలు చెప్పుకుంది ఖీలా.

## 59

"మమ్మీ! ఈరోజు సాయంత్రం నా ఫ్రెండ్ సూజన్ నాకు ఉద్యోగం వచ్చిన సందర్భంగా పార్టీ ఇస్తోంది. వచ్చేటప్పటికి కొంచెం ఆలస్యం అవుతుంది. నువ్వు కంగారుపడకు" అని పద్మతో చెప్పింది కీర్తిక.

"ఎవరా సూజన్? ఏమాకథ?" అంటూ అనుమానంగా కూతురి వంక చూసింది పద్మ.

"నా క్లాస్‌మేట్ మమ్మీ! నీకు తెలుసుగదా!"

"సరే! జాగ్రత్త. ఎటువంటి పరిస్థితులలోను ఏ పాడుపనీ చేయకు"

"ఓకే మమ్మీ! నీకు నా గురించి అటువంటి భయమేమి అక్కరలేదు. నేను పద్మ, శ్రీకాంత్‌ల పుత్రికా రత్నాన్ని" అని గర్వంగా అంది.

"ఊఁ ఊఁ! సరేలే! మాటలు నేర్చావ్ బాగా" అంటూ తనపని చూసుకోసాగింది పద్మ.

గులాబీరంగు చూడీదార్, కుర్తా అదే రంగు చున్నీ వేసుకుంది. తన పొడవైన జుట్టుని పోనీ టైల్‌లా పైకి పింక్ కలర్ రిబ్బన్‌తో కట్టుకుంది. చెవులకి పొడవుగా వ్రేలాడే రింగులు పెట్టుకుంది. లేలేత గులాబీరంగు పెదవులకి లైట్‌గా లిప్‌స్టిక్ వేసుకుని తన అందాన్ని ఒక్కసారి అద్దంలో చూసుకుని తనకుతానే మురిసి పోయింది కీర్తిక. కాళ్ళకి హైహీల్సు వేసుకుని టక... టక...లాడిస్తూ 'స్కైలైన్ హోటల్' వైపు దారి తీసింది.

సాయంత్రపు నీరెండలో అద్దాలతో నిర్మించబడిన 'స్కైలైన్' క్రొత్త పెండ్లి

కూతురులా తళతళా మెరిసిపోతోంది. వచ్చేపోయే జనాలతో, కార్లతో పెండ్లి పందిరిలా నిండుగా నవ్వుతోంది. ఆ నవ్వులో ఎన్నో నవ్వులు కలిసిపోతున్నాయి. గాజు గ్లాసుల్లో ఐస్ ముక్కలు కరిగిపోతున్నాయి. కొందరు జంటలు జంటలుగా డాన్స్ చేస్తున్నారు. మైకంలో ఒకర్ని ఒకరు హత్తుకుపోతున్నారు. అటువంటి తరుణంలో కీర్తిక హోటల్ లోపలకి అడుగుపెట్టింది. గ్లాస్ డోర్సు ప్రక్కగా ఉన్న ఒక కార్నర్‌లో ఉన్న టేబుల్ వద్ద కుర్చీలో వచ్చి కూర్చుంది. 'జాక్ ఇంకా రాలేదేమిటీ? టైం అప్పుడే ఏడుగంటలు కావస్తోంది' అని అనుకుంటూ ఓసారి నాలుగు వైపులా తనకళ్ళను చక్రాల్లా త్రిప్పి చూసింది. "ఊఁ ఊ! ఎక్కడా సూచనలు కనపట్టం లేదు'' అని అనుకుంటూ చేతి బ్యాగ్‌లోంచి 'మేన్ ఆఫ్ ది లవ్' అనే నవల్ని తీసి చదవసాగింది.

ఇంతలో వెనకనుంచి "హలో! బ్యూటిఫుల్ యంగ్‌లేడీ!'' అంటూ ఎవరో పల్కరించటంతో ఎవరా? అని వెనక్కి తిరిగి చూసింది కీర్తిక.

"హలో! మీరా! వెనకనుండి ఎవరో అనుకున్నాను'' అంటూ ఆశ్చర్యాన్ని వ్యక్తం చేస్తూ కీర్తికని పల్కరించాడు జస్టిన్.

"హలో! జస్టిన్! హౌ ఆర్ యూ?'' అంటూ నవ్వుతూ పల్కరించింది కీర్తిక.

"ఫైన్! ఏమిటి? ఇలా వచ్చారు? ఎవరి కోసమో ఎదురు చూస్తున్నట్లున్నారు?''

"జాక్ వస్తానన్నాడు. నేను రావటమే కొంచెం లేటైయింది.''

"ఏమిటి విశేషం?''

"నాకు ఉద్యోగం వచ్చింది. ఆ సందర్భంగా తను పార్టీ యిస్తానన్నాడీరోజు''

"వాడికి తీరుబడి ఎక్కడండీ? ఎప్పుడూ బిజీగా ఉంటాడు. ఫ్రెండ్స్ సర్కిల్ ఎక్కువ. వాణ్ణి తొందరగా వదలరు. అందులో ఆడగాళ్ళి వాడసలు వదలడు. బహుశా! మిమ్మల్ని పిలిచినట్లు వాడికి గుర్తుందో లేదో? మరచిపోయి ఏ గర్ల్ ఫ్రెండ్‌తోనైనా ఎంజాయ్ చేస్తూ ఉండి ఉంటాడు'' అని అన్నాడు.

"మీరు పొరబడుతున్నారు. జాక్ గురించి అంతగా తెలీదనుకుంటాను. ఏమేమో మాట్లాడుతున్నారు'' అని కొంచెం నొచ్చుకున్నట్టు మాట్లాడింది కీర్తిక.

''వాడి గురించి నాకు తెలీక పోవడమేమిటీ? 'అమ్మ పుట్టిల్లు మేనమామకెరుక' అన్నట్లు- నేను వచ్చిన కొత్తల్లో మేమిద్దరం రూం మేట్స్‌మి. వీకెండ్స్‌లో మా రూంకి ఒక ఆఫ్రికన్ గర్ల్ వాడికోసం వస్తూండేది. పెళ్ళి తప్పించి అన్ని వ్యవహారాలు జరిగాయి. పోనీ యిద్దరూ యిష్టపడుతున్నారు గదా! పెళ్ళి చేసుకోకూడదు. అని నేనంటే నన్ను కొట్టినంత పనిచేశాడు. 'జీవితాన్ని ఎంజాయ్ చేయాలి. అందినంత వరకూ అనుభవించాలి. అందనిదాన్ని అందేంత వరకు ప్రయత్నించాలి. అంతేగాని పెళ్ళి చేసుకుని ఒక పరిధిలో బ్రతకటం నాకు విరుద్ధమైన పని' అని ఓ పెద్ద ఉపన్యాసం యిచ్చాడు! వాడితో ఆ గొడవ పడలేక నేను వేరే రూంలో ఉంటున్నాను. సారీ! మిమ్మల్ని నొప్పించి ఉండొచ్చు. కాని ఒక మంచి స్నేహితునిగా మీకు అన్యాయం జరగటం నేనూహించలేను'' అని ఎంతో ఆప్యాయంగా చెప్పాడు జాస్టిన్.

"మీ మాటలు వింటూంటే నాకు సొంత అన్నయ్య చెప్పినట్లుంది. ఇంత మంది స్నేహితులున్నా ఇంత ఆప్యాయంగా మాట్లాడేవారు నాకు ఎవ్వరూ కనపడలేదు. అందులోను నా మంచి కోరి చెప్పేవారు మీరు ఒక్కరే కనపడ్డారు. చాల థాంక్స్ మీకు. జాక్ గురించి కొంచెం సీరియస్‌గానే ఆలోచిస్తాను'' అని చెప్పింది కీర్తిక.

"మీరేమన్నా తీసుకుంటారా?'' అని అడిగాడు జాస్టిన్.

"నో! థాంక్స్''

అతను కాఫీ త్రాగి బయటకు వెళ్ళిపోయాడు.

"జాక్ గురించి చెప్పినదంతా నిజమేనా? లేక జలసీతో అలా చెప్పాడా?'' అని ఆలోచిస్తోంది కీర్తి. జస్టిన్ మంచివాడు. నెమ్మదస్తుడు. ఎప్పుడు కనపడినా మర్యాదగా, మంచిగా మాట్లాడుతాడు. ఉన్నకాసేపు ఆత్మీయంగా ఉంటాడు. అలాంటివాడు జాక్ గురించి చెడుగా ఎందుకు చెబుతాడు. ఏదైనా తొందరపడకూడదు. నిదానంగా ఆలోచించడం మంచిది'' అని అనుకుంది కీర్తిక.

"హలో! కీర్తి! ఐయామ్ వెరీ వెరీ సారీ! చాల ఆలస్యం అయిపోయింది'' అని ప్రక్కగానున్న కుర్చీలో కూర్చుంటూ కీర్తిక వంక చూసి ఆశ్చర్యంతో,

"ఓ మై గాడ్! ఏం బ్యూటీ? ఏమిటి ఈ రోజు యింత అందంగా ఉన్నావ్? వెరీ నైస్ డ్రస్'' అంటూ తెగమెచ్చుకున్నాడు.

కీర్తిక మౌనంగా వింది.

"కోపం వచ్చిందా కీర్తీ! ఏం చేయను చెప్పు. సరిగ్గా బయలుదేరే టైంకి యిద్దరు ఫ్రెండ్స్ అనుకోకుండా రూంకు వచ్చారు. వాళ్ళు, నేను కలసి చదువుకున్నాం. అందుకనే వాళ్ళని నిరుత్సాహ పరచటం యిష్టంలేక కాసేపు వాళ్ళతో గడిపి, తరువాత వాళ్ళకి ఏదో ఒకటి సర్ది చెప్పి ఉరుకుల పరుగుల మీద నీకోసం వచ్చేసాను. అక్కడ ఉన్నంతసేపు నా మనసు నీమీదే ఉంది. నువు యిక్కడ నాకోసం ఎదురుచూస్తుంటావ్ అని. మరి నన్ను క్షమించలేవా?'' అంటూ

బ్రతిమాలాడు.

"బోయ్ ఫ్రెండ్సా, గర్ల్‌ఫ్రెండ్సా?" అని వ్యంగ్యంగా అడిగింది.

"వ్వాట్ కీర్తీ!" అంటూ అనుమానంగా చూసాడు.

"నో! నో! జస్ట్ ఫన్" అంటూ నవ్వేసింది.

"అమ్మయ్య! అలక తీరిందన్నమాట. సరే! నువ్వు ఏం తీసుకుంటావ్. ఐస్ క్రీమ్ తెప్పించనా?"

"ఓ య్యా! ఐ లవ్ ఇట్!" అంది.

"ఏమన్నా సాఫ్ట్ డ్రింక్స్?"

"నో! నో!"

"అయితే నేను కొంచెం... తీసుకుంటాను. నీకు ఏమైనా అభ్యంతరమా?"

"నో!"

"థాంక్యూ" అంటూ బార్ బీ క్యూ, ఐస్ క్రీమ్, ఫ్రెంచ్‌ఫ్రైస్ + విస్కీ పట్టుకొచ్చాడు.

ఫ్రెంచ్ ఫ్రైస్ తింటూ "మీ ఫ్రెండ్స్ ఉన్నారా? వెళ్ళిపోయారా?" అని అడిగింది కీర్తిక.

"మళ్ళీ రేపొస్తానన్నారు"

"ఊం ఊం"

"మనం అనుకున్న ప్రాజెక్ట్స్ అన్నీ అయిపోయాయి గదా! మరి మనం వివాహం ఎప్పుడు చేసుకుందాం?" అని అడిగింది కీర్తిక.

"ప్రొద్దస్తమానూ నీకు పెండ్లి గురించేనా ఆలోచన. అది తప్పితే మరో ధ్యాసలేదా నీకు?" కొంచెం విసుక్కున్నట్టు అడిగాడు జాక్.

ఒక్కసారి షాక్ తిన్నట్టు జాక్ వంక చూసింది.

"అవును మరి. సరదాగా కాసేపు ఎంజాయ్ చేద్దాం అంటే సవాలక్ష ఆంక్షలు విధిస్తావ్. కలసి కాసేపు కాలం గడుపుదాం రూంకి రమ్మంటే బాబోయ్ అంటావ్. పోనీ జతగా డాన్స్ చేద్దాం రమ్మంటే నావల్ల కాదంటావ్. అన్నిటికి అడ్డులు. ప్రేమించుకుంటూ కూడ మరీ అంత స్ట్రిక్ట్‌గా ఉంటే ఎలా చెప్పు. జీవితాన్ని ముందుగా ఎంజాయ్ చేయాలి. ముద్దుపెట్టుకుంటేనే శీలం పోతుందా? చెప్పు" అని కొంచెం సీరియస్‌గా అన్నాడు.

"ఈరోజు నీకు మూడ్ బాగోలేనట్లుంది"

"అదేం లేదులే"

"మరి లేకపోతే ఏమిటి నీ ఉపన్యాసం. వచ్చిందగ్గర్నుంచీ చూస్తున్నాను. నువ్వేమనుకున్నా నా దృష్టిలో వివాహం అంటే నూరేళ్ళపంట. మనం రోజుకో రకంగా మార్చుకునే డ్రస్‌లాంటిది కాదు. దానిమీద కొన్ని నిశ్చితమైన అభిప్రాయాలున్నాయి నాకు" అని ఖచ్చితంగా చెప్పింది.

"ఓకే! వాటిని నేను కాదనటం లేదు. కాని..." అంటూ రెండో రౌండ్ పూర్తి చేసాడు.

జాక్‌ని చూస్తుంటే అనుమానంగానే ఉంది. అవకాశం ఉంటే మరో రెండు రౌండులు త్రాగేలా ఉన్నాడు. ఇంతలో హాయ్! జాక్! ఇక్కడున్నావా? అంటూ ఓ యిద్దరు అమ్మాయిలు అక్కడకు వచ్చారు.

వాళ్ళని చూసి తడబడుతూ హాయ్! అంటూ విష్ చేసాడు.

"సాయంత్రం సినిమాకెళ్ళాలన్నావ్? మరి వెళ్ళలేదా?" అని వాళ్ళడిగారు.

జాక్ మాట మారుస్తూ "అన్నట్టు మర్చిపోయాను. ఈమె కీర్తిక. నా ఫ్రెండ్. ఈమెకి జాబ్ వచ్చిన సందర్భంగా పార్టీ తీసుకుంటున్నాం" అని కీర్తికని వాళ్ళకి పరిచయం చేస్తూ మత్తుగా నవ్వేసాడు.

కీర్తికకి ఇదంతా అయోమయంగా ఉంది. ఏం మాట్లాడాలో తోచటంలేదు. బహుశా సాయంత్రం ఫ్రెండ్స్ వీళ్ళేనేమో! ఎన్ని అబద్ధాలు చెప్పాడో.

"కమాన్ జాక్! మనం డాన్స్ చేసి చాల రోజులయింది" అంటూ ఒకామె జాక్ చేయి పట్టుకుని లేవదీసింది. జాక్ త్రాగిన మత్తులో సరే అంటూఆమెతో డాన్స్ చేయడానికి లేస్తూ "ఎక్స్‌క్యూజ్‌మీ కీర్తి! ఓన్లీ ఫైవ్ మినిట్స్. ఇప్పుడే వచ్చేస్తాను" అంటూ వచ్చినామెతో డాన్స్‌చేయడానకి లేచాడు.

కీర్తికకి జాక్ ప్రవర్తన అసహ్యం వేసింది. అతను వెళ్ళిన వేపు కోపంగా చూసింది. తన సున్నితమైన హృదయం మీద ఎవరో సూదితో గ్రుచ్చినట్లనిపించింది. తాను ఎంతోఉన్నతంగా ఊహించుకున్న జాక్ తన ఎదురుగానే మరొక స్త్రీతో డాన్స్ చేయటం తను సహించలేదు. ఇది తనకి తప్పుకాకపోవచ్చు. కాని....

"ఎదురుగా ఆమెతో నవ్వుతూ అడుగులో అడుగువేస్తూ గుసగుసలాడుతూ డాన్స్ చేస్తున్నాడు జాక్. సాయంత్రం ఆలస్యంగా వచ్చినందుకు అబద్ధాలు చెప్పాడు. కొంచెం కొంచెం జస్టిన్ చెప్పిన మాటల బట్టి అతని నిజ స్వరూపం బయటపడుతోంది. అదృష్టం కొద్దీ దైవం తనకి మేలేచేసాడు. అయినా మనసు ఎందుకో బాధగా మూల్గుతోంది. మమ్మీ అందుకే పదేపదే చెబుతూండేది. ఏమైనా ఒక విధంగా ఈరోజు మంచిరోజు. ఇంక యిక్కడ ఒక్కక్షణం ఉండకూడదు"అని

అనుకుని వెంటనే ఒక కాగితం మీద జాక్‌కి ఒక ఉత్తరం వ్రాసిపెట్టేసి, బయటకు వచ్చి యింటికి బయలుదేరింది కీర్తిక.

## 60

షీలా జీవితం సాఫీగానే గడచిపోతోంది. తీరిక సమయాల్లో పెయింటింగ్ వేయటం, రకరకాల కత్తిరింపులతో బట్టలు కుట్టటం చేస్తోంది. ఒకరోజు సాయంత్రం తాను మొదలుపెట్టి వదిలేసిన పెయింటింగ్‌ని తీసుకుని పూర్తి చేయడానికి ప్రయత్నిస్తోంది. అటుగా వచ్చిన క్లాడియా షీలా వేస్తున్న ఆర్ట్‌ని చూసి 'వండ్రఫుల్ ఆర్ట్' అంటూ మెచ్చుకోలుగా కళ్ళెగరేసింది.

"ఎవరా?'' అని ఒక్కసారి వెనక్కి తిరిగి చూసి "హలో!' అంటూ క్లాడియాని పల్కరించింది షీలా.

"చాల బాగుంది షీలా! ఇంత కళ నీ చేతిలో వుందని తెలీదే!'' అంది.

"థాంక్స్. ఏమిటి విశేషాలు? ఇలా వచ్చావ్?''

"ఏదీ రోజూ ఒకరినొకరు చూసుకుంటూన్నా, మాట్లాడుకుందుకు టైముండటం లేదు మనకి'' అని అంటూ ఆమె ప్రక్కనే ఉన్న బెంచీ మీద కూర్చుంది''

"య్యా! దట్స్ ట్రూ'' అని తనుచేస్తున్న పనిని ఆపి క్లాడియాప్రక్కన వచ్చి కూర్చుంది షీలా.

"సారీ! నిన్ను డిస్టర్బ్ చేసినట్టున్నాను''

"నో! నో! ఐయామ్ వెరీ హేపీ. అది సరే గాని నువ్వు ఈ సంస్థలోకి వచ్చి ఎన్నాళ్ళయింది?''

"రెండు సంవత్సరాల బట్టి యిక్కడ ఉంటున్నాను''

"పిల్లలు లేరా?''

"అదృష్టవశాత్తు లేరు''

"అదేంటి? అలా మాట్లాడుతున్నావ్?'' అంది వింతగా.

"అదంతే షీలా! దేనికైనా అదృష్టం ఉండాలి. నాకు పిల్లలంటే చాలయిష్టం. పిల్లలున్న యిల్లే యిల్లు. లేకపోతే జీవితానికి నిండుతనం ఏం ఉంటుంది. కాని నా భర్తకి పిల్లలంటే యిష్టంలేదు. ఈ విషయంలో మేమిద్దరం పోట్లాడుకోవటం జరిగేది''

"మరి ఎందుకు విడిపోయారు?''

"నన్ను పెళ్ళి చేసుకున్న నా భర్త కొన్నాళ్ళు నాతో జీవితం బాగానే గడిపాడు. కాని తరువాత తరువాత అతనికి స్నేహితుల ద్వారా త్రాగుడు బాగా అలవాటయింది. రాత్రిళ్ళు బాగా త్రాగివచ్చి చచ్చేలా కొట్టేవాడు. ఒకరోజు స్పృహలేని స్థితిలోనున్న నన్ను ఓ పుణ్యాత్ముడు యిక్కడకు తీసుకువచ్చి, తన ఋణం తీరిపోయినట్టు వెళ్ళిపోయాడు. ఆ తరువాత నా భర్త విడాకులు తీసుకుని మరొక ఆమెను వివాహం చేసుకున్నాడు.''

"ఓహ్! ఐయామ్ వెరీ సారీ! అనవసరంగా నిన్ను బాధ పెట్టాను'' అని నొచ్చుకుంది షీలా.

"నో! నో! మనసులోని బాధని మనసున్న వాళ్ళకి చెప్పుకుంటే కొంత ఊరటకల్గుతుంది. ఆ! మరిచాను పిల్లలెలా ఉన్నారు? ఫోన్ చేస్తున్నారా?''

"ఆ! వాళ్ళు ఉద్యోగప్రయత్నంలో ఉన్నారట. ఉద్యోగం వచ్చిన తరువాత వచ్చినన్ను తీసుకువెడతారుట''

"మరి వాళ్ళు యిప్పుడెక్కడ ఉన్నారు?''

"ఓ అమృత మూర్తి యింట్లో ఉంటున్నారు. ఆమె వాళ్ళని కడుపులో పెట్టుకుని కాపాడుతోంది.'' అని డయానా గురించి క్లుప్తంగా చెప్పింది షీలా.

"అయితే డయానా నీకు మంచి స్నేహితురాలన్న మాట. మంచి స్నేహితులు దొరకాలన్నా అదృష్టం ఉండాలి. అందుకే జీవితంలో అన్నిటికన్నా గొప్పది స్నేహం అన్నారు. నువ్వు చాల అదృష్టవంతురాలివి. నీ గురించి తపించే పిల్లలు, అవసరానికి ఆదుకునే స్నేహితురాలు ఉన్నారు. ఇప్పుడిప్పుడే నీతో కొంచెం స్నేహం పెరుగుతోంది అనుకుంటూంటే నువ్వు కూడ కొద్ది రోజులలో వెళ్ళిపోతున్నావ్. నాలాంటి దురదృష్టవంతులెక్కడా ఉండరు'' అంది బాధగా!

"అదేంటి క్లాడియా? అలా నిరుత్సాహంగా మాట్లాడుతావ్. నా మాటలు ఏమన్నా నిన్ను బాధ పెట్టాయా?''

"లేదు షీలా! నాకు సన్నిహితులవుతున్న వాళ్ళందరూ వెళ్ళిపోతున్నారు. జీవితంలో నాకు ప్రతిచోటా ఓటమే ఎదురవుతోంది. పుట్టగానే తల్లిని పోగొట్టుకున్నాను. తరువాత తండ్రి ప్రేమకు దూరమైనాను. అదీ తీరని కోరికే అయింది. ఏదో ఈ సంస్థలో నా బాధలన్ని మరచి చేతనైన సహాయం చేస్తున్నాను. వసంతంలో కోయిలలాగ నీలాంటి వారి స్నేహం అందినట్టు అంది దూరమవుతూంటుంది. ఏడాది క్రితం 'జేసికా' అనే ఓ ఫ్రెండు ఉండేది. ఆమె నన్ను విడిచి ఒక్కక్షణం ఉండేదికాదు. ఎంతో ప్రాణానికి ప్రాణంగా ఉండేవాళ్ళం

కాని దురదృష్టవశాత్తు ఆమె విధి చేతుల్లో కీలు బొమ్మయిపోయింది'' అంది బాధగా.

"అరే! అలా బేలగా మాట్లాడకు. నేను ఎక్కడికి వెడుతున్నాను. ఊరివిడిచి వెళ్ళటం లేదుగా. వీకెండ్స్‌లో మాయింటికి వద్దువుగాని. మా పిల్లలు నిన్ను చూసారంటే వదిలిపెట్టరు. నువ్వు చేసిన సహాయాన్ని మర్చిపోలేను. ఆ! అన్నట్టు మరిచాను జేసికా ఎవరు?''

"ఎవరని చెప్పమంటావ్? ఏమని చెప్పమంటావ్? ఒక్కొక్కప్పుడు మృత్యువు అదృష్టంలా వచ్చి తీసుకుపోతూంటుంది. అదే జరిగింది ఆమె విషయంలో. ఆమె జీవితంలో ఓడిపోయిన స్త్రీ. ఎన్నోముళ్ళ కంచెల్ని, రాయిరప్పుల్ని దాటుకుంటూ, కష్ట సముద్రాల్ని ఈదుకుంటూ, ఏదో వ్యాపకంతో గతాన్ని మర్చిపోయి బ్రతుకుదామని యిక్కడకు వచ్చింది. అందరితోను ఎంతో కలివిడిగా ఉండేది. తనకి చదువంటే చాల యిష్టం. ఎప్పుడు పుస్తకాలు చదువుతూండేది. అందుకే తను లైబ్రరీ పనిచూస్తూండేది. కొన్నాళ్ళు బాగానే గడిచిపోయాయి. నాలుగైదు నెలల క్రితం ఒక రోజున ఆమె భర్త యిక్కడకు వచ్చి సూపరింటెండెంట్‌కి, జేసికాకి ఏం చెప్పాడో గానీ జేసిక అతని వెంటవెళ్ళిపోయింది. వెళ్ళేముందు నా దగ్గరకు ఆనందంగా వచ్చి, చెప్పి వెళ్ళింది. నేను మనసులో చాల సంతోషించాను. ఒక జీవితం చిగురించినందుకు. కాని నా సంతోషం ఎక్కువకాలం. ఉండలేదు'' అని ఆగింది.

"ఏమైంది?'' అని కంగారుగా అడిగింది ఖీలా.

"ఇక్కడి నుండి వెళ్ళిన తరువాత కొన్నాళ్ళు హాయిగానే గడిచాయి రోజులు. ఎన్నో తీయని కబుర్లు చెప్పాడు ఆమె భర్త. 'నిన్ను విడిచి ఉండలేను. ఇన్నాళ్ళు ఎంతో నరకం అనుభవించాను. నీకు నచ్చిన కోర్సులలో జాయిన్ అవుదుగానీ, పిల్లల్ని నేను చూసుకుంటాను. నిన్నెప్పుడు కొట్టి బాధించను. చేసిన తప్పుల్ని క్షమించు'మని ఆమెను బ్రతిమాలాడుట. ఆమె అతని మాటలను నమ్మి, జీవితంలో తనంత అదృష్టవంతురాలు లేదనుకొని మురిసిపోయింది.

తరువాత నెమ్మదిగా ఓ రోజు,

"యూనివర్సిటీలో జాయిన్ అవుతాను, వచ్చే నెల నుండి కోర్సులు మొదలవుతున్నాయి'' అని భర్తని అడిగింది జేసికా.

ఆ మాటకి అతను రయ్‌మని కోపంతో "నువ్వు చదువుకోడానికి వెడితే పిల్లల్ని ఎవరు చూస్తారనుకున్నావ్? నేను యింటికి వచ్చేటప్పటికి నువ్వు లేకపోతే ఎలా? అయినా యిప్పుడు నువ్వు చదువుకోవలసిన అవసరం ఏం ఉంది. అయినా ఫీజులకి చాల డబ్బు ఖర్చవుతుంది. కనుక నీకటువంటి ఆలోచన ఉంటే మానుకో'' అని గట్టిగా అరచినట్టు మాట్లాడాడు.

"ముందు మీరేగా అన్ని మాటలు చెప్పి, నన్ను యింటికి తీసుకువచ్చారు'' అని పౌరుషంగా అంది జేసికా. ఆమె అలా అడగటంతో ఆమె భర్తకి కోపం వచ్చి మాటమాట పెంచుకున్నారు. అతను ఆవేశంలో ఆమెని ఒళ్ళు తెలియనంతగా కొట్టి, విసురుగా త్రోసేసాడు. ఆ విసురుకి ఆమె అక్కడున్న టీపాయ్ మీద పడి ఒక్క గావుకేక పెట్టి నేల మీద పడిపోయింది'' అని కేసి చూసింది క్లాడియా.

ఖీలా కళ్ళు ఎర్ర కలువలయ్యాయి. అది చూసి సారీ ఖీలా! అంటూ ఆమె చేయి తన చేతిలోకి తీసుకుంది క్లాడియా.

"మరి వెంటనే ఆస్పత్రికి తీసుకువెళ్ళలేదా?'' అని బొంగురుపోయిన కంఠంతో అడిగింది ఖీలా.

"వెంటనే తీసుకువెళ్ళారు. కాని ప్రయోజనం లేకపోయింది. నడుంమీద ఎక్కువగా కొట్టడంతో ఆమె వెనుకభాగంలోని 'స్పైనల్ కార్డ్' బాగా దెబ్బతిని నెమ్మదిగా ప్రాణం పోయింది'' అని ముగిస్తూ కళ్ళు తుడుచుకుంది క్లాడియా!

"ఓహ్! పూర్ వుమెన్! హెల్ విత్ దట్ బ్రూట్'' అంటూ క్లాడియాని కౌగిలించుకుని ఏడ్చేసింది.

కొద్ది సేపటికి క్లాడియా తెప్పరిల్లి మనసులోని బాధను ఆపుకోలేక నీకు చెప్పేసాను. నాకు ఈ విషయాలన్ని వాళ్ళ పిల్లలు ఉత్తరం వ్రాసారు. తండ్రి వాళ్ళని కూడ ఎప్పుడైనా కోపంలో ఏం చేస్తాడో అని భయపడి యింటి నుండి బయటకు వచ్చేసి హాస్టల్‌లో ఉంటున్నారుట. ఏమిటో తలుచుకుంటుంటే మనసంతా వికలమై పోతుంది.ఇంత స్వేచ్ఛ ఉన్న సమాజంలో కూడ కొందరి జీవితాలు ఒడుదుడుకుల పాలవుతూనే ఉంటాయి. చివరి దశలో మనకి నా అన్న వాళ్ళెవరూ దగ్గరకి రారు. ఉండరు. గవర్నమెంటు ఏదో కొంత ధనసహాయం చేసినా మానసికంగా దగ్గరకి వచ్చి,మన బాధల్ని తీర్చకపోయినా, కనీసం విని ఓదార్చేవారే ఉండరు''

"అవును. అది నిజమే! జీవితంలో ఎప్పుడూ ఏదో ఒక సమస్యలు వస్తూనే ఉంటాయి. కొన్ని కాలంతో పాటు సద్దుకుంటాయి. కొన్ని పట్టు విడవక చివరిదాకా వెంటాడుతూనే ఉంటాయి'' అని ఏదో గుర్తువచ్చిన దానిలా ఒక్కసారి టైం వంక చూసింది. ఓ మై గాడ్! చాల టైం అయింది. పద సప్పర్‌కి టైం అయింది!!'' అంటూ తన చేతి బ్యాగ్‌ను తీసుకుని అందులో తన పెయింటింగ్ సామగ్రిని సర్దుకుని క్లాడియాతో కలిసి తన రూం వైపు నడిచింది ఖీలా.

## 61

అందమైన ఆకాశంలో నల్ల మేఘాలు తెల్లమేఘాలతో ఆటలాడు కుంటున్నాయి. అనుకోకుండా అమెరికా ప్రధాని వస్తున్నట్లు మేఘ సమూహాలు నగర రోడ్లను నగ్నంగా స్నానం చేయించేస్తున్నాయి. చెట్లు పులకరించి ఆనందంగా తలలూపుతూ నాట్యం చేస్తున్నాయి. చల్లని వాతావరణంతో జనాలు హాయిగా ఊపిరి పీల్చుకుంటున్నారు. ఈ సంబరాలకి రోడ్ల మీద జన సమూహాలు, కార్లు, సైకిళ్ళు, హడావుడిగా పరుగులు తీస్తున్నాయి. పనితో అలసిన శరీరాలు బయటకు వచ్చి తొందరగా యిల్లు చేరుకోవాలనే ఆరాటంతో పరుగులు తీస్తున్నాయి.

జెర్సీ కారు కొండచిలువ లాంటి రోడ్డు మీద మెత్తగా ప్రాకుతోంది. కాని ఆమె మనసులో మాత్రం గజిబిజిగా అర్థంలేని ఆలోచనలు సాలెగూడులా అల్లుకుపోతున్నాయి. 'ఇప్పుడు యింటికెళ్ళి ఏం చేయాలి. ఏమైనా ఫైల్స్ వర్క్ ఉంటే చూసుకోవటం, సప్పర్ తినటం, నిద్రపోవటం. మళ్ళీ ఉదయం నుండి రొటీన్ వర్క్- అంతా యాంత్రికమైన ఒంటరి జీవితం. పింకీ, స్టీవ్ యిప్పుడు ఏం చేస్తూంటారో?' అనుకోకుండానే తన ఆలోచనలు వాళ్ళ వైపుకి మళ్లాయి. ఇంతలో సడన్ బ్రేక్ వేయటంతో ఆమె ఆలోచనలకి కూడ బ్రేక్ పడింది. వికలమైన మనసుతో యిల్లు చేరింది. ఇల్లంతా చీకటి, నిశ్శబ్దం. లోపలకి వచ్చి లైటు వేసి, చేతిబ్యాగ్, ఫైల్సు సోఫాలో పడేసింది. శారీరకంగానూ, మానసికంగాను చాల నీరసంగా ఉంది. కిచెన్‌లోకి వెళ్ళి కాఫీ కలుపుకుని కప్పులో పోసి తెచ్చుకొని కిటికీలోంచి బయటకు చూస్తూ కాఫీని సిప్ చేస్తోంది.

తండ్రి అన్న మాటలు తనకి పదే పదే గుర్తుకు వస్తున్నాయి. నిజానికి తప్పంతా నాదేనా? స్టీవ్ పొరపాటేమీ లేదా? స్టీవ్ స్థానంలో తనే ఉంటే....! ఉంటే...? అనుకొని ఈ ప్రశ్నలతో మనసు చికాకుగా ఉంది.

ఆమె కళ్ళు ఆగదిలోనున్న టేబుల్‌పై ఉన్న ట్రే వంక చూసాయి. జెర్సీ నెమ్మదిగా అక్కడకు వెళ్ళి ప్లాస్టిక్ ట్రేలో ఉన్న ఉత్తరాల్ని చూసింది. అవి స్టీవ్, జెర్సీలు విడిపోయిన తరువాత స్టీవ్, జెర్సీకి వ్రాసిన ఉత్తరాలవి. కాని కోపంతో వాటిని చింపి, చదవనైనా చదవకుండా ఎలా వచ్చినవలా ట్రేలో పడేసింది. ఇప్పుడు వాటిని తీసి సోఫాలో కూర్చుని ఒకటొకటే చదువుతోంది.

మైడియర్ స్వీట్ హనీ!

నీవు లేని జీవితం ఎంత నరకప్రాయంగా ఉందో ఎలా చెప్పను. నీ వియోగం భరించలేకుండా ఉన్నాను. ఏ పనీ చేయబుద్ధి పుట్టటం లేదు. ఇల్లంతా మౌన సామ్రాజ్యం ఏలుతోంది. ఎప్పుడు నీ గురించే నా ఆలోచనలు. నా కళ్ళు నీకోసం గుమ్మం వద్ద ఎదురుచూస్తున్నాయి. చిన్న పొరపాటుకి నాకింతటి శిక్ష వేయటం న్యాయమేనా? తెలిసి చేసినదికాదు. అయినా నన్ను క్షమించమని వేడుకుంటున్నాను. నీవు లేకపోతే నాకు జీవితమే లేదని నీకు తెలుసు. కనీసం పింకీ కోసమైనా రా! వాడి పసిహృదయం ఎంతలా అల్లాడిపోతోందో! నన్నర్థం చేసుకుని మనయింటికి తిరిగి వస్తావని వేయి కళ్ళతో ఎదురుచూస్తూ...

ప్రేమతో,
నీ స్టీవ్.

మైడియర్ స్వీట్ డార్లింగ్!

నేను వ్రాసిన ప్రతీ ఉత్తరం నీకు అందే ఉంటుందని తలుస్తున్నాను. కనీసం జవాబైనా వస్తుందని ఆశించాను. కాని నా ఆశ నిరాశే అయింది. పింకీ నీకోసం బెంగపెట్టుకున్నాడు. నాకు తెలుసు. పైకి నీవు ఎంత మొండిగా ఉన్నా, మమ్మల్ని ఎంతకాదనుకున్నా నీవు మనసులో ఎంత క్షోభ పడుతున్నావో నేను అర్థం చేసుకోగలను. ఆత్మాభిమానంతో మనసుని చంపుకుంటున్నావు. మనం కలసి అనుభవించవలసిన జీవితాన్ని, బంగారు భవిష్యత్‌ను వృధాచేయకు. ప్రతీక్షణం మనది కావాలి. మన బంగారు పింకీ, మన కలల పంట ఉన్నతంగా పెరగాలి. ఒక్కసారి మనం గడపిన జీవితాన్ని గురించి గుర్తుచేసుకో! అవన్నీ మరచిపోయావా హనీ!

నా పవిత్రమైన హృదయంలో నీకు తప్ప మరెవరికీ స్థానం లేదు. అది నీకు తెలుసు. కనీసం పార్టీలలోనైనా మరొకరితో డాన్స్ చేయడం నువ్వు చూసావా! నా ప్రతి అణవులోను, నా జెర్సీయే ఉంది. మనం ఒకరిలో ఒకరం ఎంతలా కలసి పోయామో! నీతో తప్ప నాకు ఆనందం, సుఖం మరెక్కడా లేదు. నన్ను క్షమించి, నా ప్రేమను అర్థం చేసుకుని నీ ప్రేమ సముద్రంలో నన్ను ఉక్కిరి బిక్కిరి చేస్తావని ఆశిస్తూ...

నీ కోసం ఎదురుచూసే-
నీ స్టీవ్.

ప్రతి ఉత్తరంలోను స్టీవ్‌కి తనపై ఉన్న ప్రేమానురాగాల్ని వ్యక్తం చేసాడు. అవి చదువుతున్న జెర్సీ మనసు మంచులా కరిగిపోయింది. ఆమె కళ్ళలో కన్నీటి

బిందువులు చెంపలు మీదుగా జారి ఆమె గుండెల్లో చోటు చేసుకున్నాయి.

'ఐ యామ్ వెరీ సారీ స్టీవ్ వెరీ వెరీ సారీ...! ఐ లవ్ యూ హనీ! ఐ లవ్ యూ టూ మచ్' అంటూ జెర్సీ తనకు తెలీకుండానే తనలో తను గొణుక్కుంది.

స్టీవ్‌తో గడిపిన మధురక్షణాలు ఆమె కళ్ళముందు కదలాడసాగాయి. తీయని మధుర స్మృతులలో ఆమె ఆరాత్రి సోఫాలోనే నిద్రపోయింది.

*

ఆ మర్నాడు లంచ్ టైంలో పింకీని చూద్దామని స్కూలుకి వెళ్ళింది జెర్సీ! కాని పింకీ నాలుగైదు రోజులబట్టి స్కూలుకి రావటం లేదని సెక్రటరీ చెప్పింది. 'బహుశా ఏదైనా ఊరు వెళ్ళారేమో! స్టీవ్‌కి క్యాంపులు వెళ్ళటం అలవాటు గదా! పింకీ ఒక్కడూ యింట్లో ఉండలేడని కూడ తీసుకెళ్ళి ఉంటాడు' అని అనుకుంది. సాయంత్రం అయిదు గంటల తర్వాత యింటికి ఫోన్ చేసింది. కాని యింట్లో కూడ ఎవ్వరూ లేరు. 'తను అనుకున్నదే జరిగిఉంటుంది' అని అనుకుంది.

ఓసారి స్టీవ్ యింటికెళ్ళి చూద్దాం. ఎలాగూ ఎవరూ లేరు అని అనుకొని వెంటనే కారు తీసుకుని స్టీవ్ యింటికెళ్ళిందా సాయంత్రం. డూప్లికేటు 'కీ' తన వద్ద ఉండటం వల్ల లోపలకి వెళ్ళటం సమస్య కాలేదు. తాళం తీసి లోపలకెళ్ళింది. అంతా చీకటిగా ఉంది. అలవాటుపడిన యిల్లే కాబట్టి లైటు ఆన్ చేసింది. మేడమీదకెళ్ళి పింకీ రూం చూసింది. పుస్తకాలు, ప్రక్క అన్నీ నీటుగా అమర్చబడి ఉన్నాయి. కిటికీకి దగ్గరగా పెయింటింగ్స్ గీసుకునే స్టాండ్‌కి సగం సగం వేసిన చార్ట్ అమర్చబడిఉంది. జెర్సీ ఆ చిత్రాన్ని పరికించి చూస్తోంది. ఒక ఎత్తైన కొండ మీద ఒక స్త్రీ ఆకారం మసక మసకగా ఉంది. కొండకి దిగువగా ఒక దట్టమైన అడవి. అక్కడ ఒక పిల్లవాడు చేతులు చాపి ఆమెని పిలుస్తున్నట్లుంది. ఆ చిత్రాన్ని చూడగానే 'మమ్మీ... మమ్మీ!.... అని పింకీ తనని పిలుస్తున్నట్లు అన్పించింది జెర్సీకి.

"ఓహ్! హనీ! నీ మనసులో, ఊహల్లో ఎంత చక్కటి భావాలున్నాయి' అని అనుకుంటూ అక్కడున్న పింకీ ఫోటోని ముద్దెట్టుకుంది.

తరువాత స్టీవ్ గదిలోకి వెళ్ళకూడదనుకుంటూనే వెళ్ళింది. గదిలో లైటువేసి ఒక్కసారి నలువైపులా కలయచూసింది. ఒక్కసారి జెర్సీ కళ్ళు మిరుమిట్లు గొల్పాయి. ఏం చూస్తున్నదో తనకే తెలీటం లేదు. ఆ గదిలో ఎటుచూసినా వివిధ భంగిమల్లో నిలువెత్తు ఎన్‌లార్జ్‌మెంటు ఫొటోలే! ప్రతీచోటా తనే!... అంతా జెర్సీమయం.

టేబుల్ మీద వ్రాస్తూవ్రాస్తూ వదిలేసిన డైరీ...! చదవటం సభ్యత కాకపోయినా మనసు, కళ్ళూ అటువైపు పరుగెట్టాయి. పేజీలు ఒక్కొక్కటి త్రిప్పుతూ చదవసాగింది.

జూన్ **6:** ఈ మధ్య నా మనసు మొద్దు బారి పోతోంది. ఏ పనిలోను మనస్సు నిలవటం లేదు. నా జీవితంలో అమృతం కురిపించిన అనురాగదేవత నన్నపార్థం చేసుకుని నాకు దూరంగా వెళ్ళి పోయింది. నా బ్రతుకంతా చీకటిమయం చేసింది. చీకటి సముద్రంలో చుక్కానిలేని నావలా అయింది నా బ్రతుకు....!

జూన్ **17:** ఆనందమయమైన నా జీవితంలో పెను తుఫానులు చెలరేగాయి. తల్లి ప్రేమ కరువైన కన్నబిడ్డ పింకీ చిగురుటాకులా విలవిల్లాడిపోతున్నాడు.

జూలై **29:** అనుకోని పరిస్థితుల ప్రభావంగా విధి చేతిలో కీలుబొమ్మనయ్యి జెర్సీకి దూరమయ్యాను.

ఆగష్టు **25:** మనసు విప్పి మనం ఎన్నో విషయాలు గత జీవితంలో మాట్లాడుకున్నాం. వాటినన్నిటినీ నీవు మర్చిపోయావా జెర్సీ. నా నిష్కల్మషమైన ప్రేమని, నన్ను అపార్థంచేసుకున్నావ్.

సెప్టెంబర్ **15:** నేను ఎంత దగ్గరవుదామనుకున్నా నీవు నన్ను తూలనాడి దూరం చేస్తున్నావ్. నీవు లేని నేను యింక బ్రతకటం వ్యర్థం అనుకున్నాను. అందుకే చచ్చిపోదామని నిశ్చయించుకున్నాను. కాని... మన ప్రేమకి గుర్తుగా, మన కలల పంటగా నీవు వదలివెళ్ళిన పసిడి మొగ్గ పింకీ కోసం ఆ పనిచేయలేకపోయాను. అందుకే ఎంతటి బాధనైనా ఈ నా గుండెల్లో పెట్టుకుని భరిస్తున్నాను. ఎప్పుడు పగిలిపోతుందో తెలీదు. అప్పుడు పింకీకి నీవే దగ్గరవుతావని తలుస్తున్నాను. నాకా అదృష్టం లేదు. అయినా ఎక్కడో ఓ చిన్న వెర్రి ఆశ మొలకెత్తుతూనే ఉంది. 'ఎప్పటికైనా నీకు నా మీద ప్రేమ కలగక పోతుందా' అనే ఆశతో ఎదురు చూస్తున్నాను. నా నిరీక్షణకి ఫలితం ఉంటుందనే ఆశ ఉంది.

సెప్టెంబర్ **18:** నీవు కోపంలో, ఆవేశంలో వెళ్ళిపోయావే గాని నా మీద ద్వేషం నీకు లేదు. అవునా? కాని ఆత్మాభిమానంతో తిరిగిరావడానికి వెనుకాడుతున్నావ్. నా మీద నీకు ఎంతటి ప్రేమానురాగాలున్నాయో నాకు తెలుసు. నీవు ఎప్పుడు ఏ క్షణంలో వచ్చినా నా హృదయకవాటాలు నీకోసం, నా మధురమంజుల మూర్తికోసం తెరచుకునే ఉంటాయి....!

పేజీలు తిరగేస్తున్న జెర్సీ కళ్ళు నయాగరా జలపాతాలయ్యాయి.... "నేను

ఎంత పెద్ద పొరపాటు చేసాను. సిల్లీ విషయంపై ఎంత రభస చేసాను. పండంటి జీవితాన్ని చేజేతులా పాడుచేసుకుని స్టీవ్ హృదయాన్ని ఎంతలా నొప్పించాను. లేనిపోని మనస్పర్థతో స్టీవ్‌కి , పింకీకి దూరం అయ్యాను. నాకోసం, నాప్రేమకోసం పరితపించే మనుషుల్ని ఎంత కష్టపెట్టాను. ఇప్పటికే చాల కాలం వ్యర్థం అయింది. వాళ్ళ మనసులు ఎంత క్షోభించాయో! తనుకూడ ఒంటరిజీవితంతో ఎంతగానో నలిగిపోయింది. తనని ప్రేమగా దగ్గరకు తీసుకుని ఓదార్చే హృదయం కావాలి. దానిని తను మూర్ఖంగా దూరం చేసుకుంది. ఇక ముందు అలా జరుగకూడదు. జరుగనివ్వను. నాకు స్టీవ్, పింకీలు కావాలి. వాళ్ళ ప్రేమానురాగాలు నాకు కావాలి" అని గట్టిగా నిర్ణయించుకుంది జెర్సీ.

తన ఆలోచనా పరంపరల నుండి బయటకు వచ్చి 'ఇంతకీ వీళ్ళు ఎక్కడకి వెళ్ళినట్లు' అని అనుకుని తను తీసుకున్న నిర్ణయాన్ని వెంటనే డయానాకి చెబుదామని ఫోన్ డయల్ చేసింది.

"హెలో! దిస్ ఈజ్ డయానా స్పీకింగ్!"

"హెలో! డయానా! నేను జెర్సీని మాట్లాడుతున్నాను."

"ఆయ్! జెర్సీ! ఎలా ఉన్నావ్?"

"ఫైన్"

"సప్పర్ అయిందా?"

"ఇంకా లేదు"

"పింకీకి ఇప్పుడెలా ఉంది?"

"వ్వాట్? ఏమిటి నువ్వు మాట్లాడుతున్నది? పింకీకి ఏమైంది?" అని కంగారుగా అడిగింది జెర్సీ.

"అదేంటి? నీకు తెలీదా? వాడికి కారు యాక్సిడెంట్ అయింది. నీకు ఫోన్ చేసానని చెప్పాడు స్టీవ్" అని ఆశ్చర్యంగా అంది.

"ఓ మైగాడ్! నేనీ మధ్య ఊరెళ్ళాను. నిన్ననే వచ్చాను. ఈ రోజు పింకీని చూద్దామని స్కూలుకెళ్ళాను. కాని వాడు స్కూలుకి నాలుగైదు రోజుల బట్టి రావటం లేదని చెప్పారు. నేను ఎక్కడికైనా వాళ్ళు వెళ్ళేరేమో అని అనుకున్నాను. కాని ప్రమాదం జరిగిందని నాకు తెలీదు. ఇంతకీ ఏ ఆస్పత్రిలో ఉన్నాడు?"

"చిల్డ్రన్స్ ఆస్పత్రిలో స్పెషల్ వార్డులో ఉన్నాడు."

'థాంక్స్ డయానా! నేను యిప్పుడే ఆస్పత్రికి వెడతాను తరువాత మాట్లాడుతాను" అంటూ కంగారుగా ఫోన్ పెట్టేసి ఆస్పత్రికి బయలుదేరింది జెర్సీ.

# 62

ఒకరోజు తలస్నానం చేసిన కీర్తికకి చిక్కు తీస్తూ 'ఏమంటున్నాడు నీ బోయ్‌ఫ్రెండ్?" అని అడిగింది పద్మ. అద్దంలో మొహం చూసుకుంటున్న కీర్తిక తల్లి ప్రశ్న విని కూడ విననట్లు ఊరుకుంది.

"ఏయ్ కీర్తీ! నిన్నే! నిద్రపోతున్నావా?" అంటూ ఒక్క కుదుపు కుదపటంతో అప్పుడే ఈ లోకంలోకి వచ్చినట్లు "వ్వాట్ మమ్మీ?" అని అడిగింది.

"అదే జాక్ ఏమంటున్నాడు? పెళ్ళి, పెళ్ళని గొడవపెడుతున్నాడా? నీకు ఉద్యోగం వచ్చేసింది గదామరి. ఏమంటావ్" అని ప్రశ్నమీద ప్రశ్నలు అడిగింది.

కీర్తిక అన్నిటిని విని మౌనంగా ఊరుకుంది.

"ఏమిటి మాట్లాడటం లేదు? మీరిద్దరూ ఏమన్నా పోట్లాడుకున్నారా? లేక ఊళ్ళోలేడా?" అని అనుమానంగా కూతురివంక చూసింది.

"అదేం కాదు మమ్మీ! ఇంక ఆ విషయం మర్చిపోవటం మంచిది" అని సీరియస్‌గా అంది.

"అదేం?"

"జాక్ ప్రవర్తన మంచిది కాదు. అతనికి చాల మంది గర్ల్ ఫ్రెండ్స్ ఉన్నారు. అంతేకాదు. అతను త్రాగుబోతు. తిరుగుబోతు. అబద్దాలకోరు. క్యారెక్టర్‌లేని మనిషిని ఎలా వివాహం చేసుకోను. అదేకాకుండా పెళ్ళికి ముందు శీలాన్ని ఎవరు అర్పిస్తారు! ఆ విషయంలో నేను కొంచెం స్ట్రిక్ట్‌గా ఉండటం వలన అతనికి కోపం వచ్చింది. నా ముందే మరొకామెతో డాన్స్‌లు, నవ్వులు. ఇవన్నీ కళ్ళముందు చూస్తూ నేను ఎలా భరించగలను?" అని చెప్పింది.

"ఇవన్నీ నీకు ఎవరైనా చెప్పారా? లేక..."

"నో! మమ్మీ! నిప్పులేనిదే పొగరాదు అని అంటూ హోటల్‌లో అతని ప్రవర్తన, జస్టిన్ చెప్పిన సంగతులు, రెండు రోజుల క్రితం పార్కులో తనకళ్ళ ముందే భాగోతం ఒకే దుప్పట్లో జాక్, మరొకామెతో కలసి పడుక్కొన్న సంఘటన తల్లికి ఏదీదాచకుండా అన్ని వివరంగా చెప్పేసింది కీర్తిక.

"కూతుర్ని దగ్గరగా తీసుకుంటూ అనవసరపు ఆలోచనలతో మనసు పాడుచేసుకోకు. ఏది జరిగినా మన మంచికే అనుకోవాలి" అంటూ ఓదార్చింది.

"అలాంటి భయమేమీ అక్కరలేదు మమ్మీ! నా మనసు చాల ధైర్యం గలది. నా తనువు నిగ్రహం గలది. అదే నా ప్రత్యేకత" అని గర్వంగా అని,

"అయినా ఈ విషయంలో జాక్‌ని తప్పు పట్టవలసిన పనిలేదు."

"మళ్ళీ అదేం మాట?" ఆశ్చర్యంగా అంది.

"అవును మమ్మీ! ఇక్కడ కల్చర్‌కి, మన కల్చర్‌కి చాల తేడా ఉంది. ఇక్కడ హైస్కూల్లో పద్నాలుగేళ్ళ దగ్గర్నుంచీ బాయ్‌ఫ్రెండ్సనీ, గర్ల్‌ఫ్రెండ్సనీ విచ్చలవిడిగా తిరుగుతారు. వీళ్ళ స్నేహాలు, ప్రేమలు పెళ్ళి వరకూ వచ్చాయంటే చాల ఆశ్చర్యపడవలసిన విషయమే. పదహారు సంవత్సరాల నుండి 'డేటింగ్' పేరుతో శుభ్రంగా ఎవరికి నచ్చిన వాళ్ళతో వాళ్ళు శీలం గురించి లెక్కచేయకుండా తిరిగేస్తారు. ఏదీ పెర్మనెంటుగా ఉండదు. అంతా టెంపరరీయే. నచ్చినవ్వాళ్ళు తిరగటం పొరపాటున ఏ విషయంలోనైనా అభిప్రాయభేదాలు వస్తే ముందువెనకలు ఆలోచించకుండా విడిపోతారు. పిల్లల గురించి కాని, కుటుంబ గౌరవ మార్యాదల గురించి గాని ఏమి ఆలోచించరు" అని అంటూ మధ్యలో తల్లి వైపు మౌనంగా చూసింది కీర్తిక.

మౌనంగా కళ్ళప్పగించి కూతురివంక చూస్తోంది పద్మ. ఇన్ని విషయాల్ని చక్కగా అర్థం చేసుకుని, తన శీలాన్ని కాపాడుకున్నందుకు పద్మ మనసు గర్వంతో నిండిపోయింది. తన కూతురి ఆలోచనలకూ, అభిప్రాయాలకు మెచ్చుకోకుండా ఉండలేకపోయింది.

"మమ్మీ! నేను చెప్పింది వింటున్నావా? లేక..."

"ఆ! ఆ! వింటున్నాను. చెప్పు"

"అందువల్ల ప్రస్తుతానికి పెళ్ళి ప్రస్తావనకి కొన్నాళ్ళు విశ్రాంతినిస్తున్నాను. టైం వచ్చినపుడు నన్ను మెచ్చిన వాణ్ణి, ప్రేమించే వాణ్ణి పెళ్ళి చేసుకుంటాను. మమ్మీ! ఈ విషయంలో నా పొరపాటుగాని, తొందరపాటుగాని ఏమైనా ఉందా?" అని అమాయకంగా తల్లి కళ్ళలోకి చూస్తూ అడిగింది.

"నో! హనీ! యూ ఆర్ ఆల్వేజ్ కరెక్ట్" అని అంటూ కీర్తిక నుదుటిమీద ముద్దుపెట్టుకుంది పద్మ.

*

ఒకరోజు మాటల సందర్భంలో "అమ్మాయికి అప్పుడే పెళ్ళిచేయవేమిట్రా అబ్బాయ్" అని శారదాంబ.

"చెయ్యాలమ్మా! మొన్ననే గదా ఉద్యోగం వచ్చింది. ఇంక పెళ్ళి ప్రయత్నం చేయాలి" అంటూ పద్మ వంక చూసాడు శ్రీకాంత్.

"ఇండియా వెళ్ళిన తరువాత అక్కడ ఏమన్నామంచి సంబంధాలుంటే చూడమంటావా?"

"అలాగే చూడండి అత్తయ్యా! మీరు పెద్దవారు. అన్ని విషయాలు మాకంటే మీకు ఎక్కువగా తెలుస్తాయి. రెండు మూడు సంబంధాలు చూస్తే ఏదో ఒకటి నిశ్చయించుకోవచ్చు" అని అత్తగారితో అంది పద్మ.

"ఏయ్ కీర్తీ! నువ్వేమంటావ్?" అంటూ కూతురి వైపు చూసాడు శ్రీకాంత్.

"మీ యిష్టమే డాడీ! నాకంటే ఎక్కువగా మీకే తెలుసు" ఆ సమాధానానికి ఒక క్షణం ఆశ్చర్యపోయి పద్మ వంక చూసాడు శ్రీకాంత్.

"తరువాత చెబుతాను అన్నట్టు భర్తకి కళ్ళతో సైగ చేసింది పద్మ.

"ఆ! మరిచానురా అబ్బాయ్! మన సరోజా వాళ్ళ బావగారి అబ్బాయి ఇంజనీరు చదివాడుట. కుర్రాడు లక్షణంగా ఉంటాడు. ఇంకా ఏవో పై చదువులు చదవాలనుకుంటున్నాడుట. చదువు, అందం ఉన్న అమ్మాయి కావాలిట. కట్నం పట్టింపులు అంతగా లేవు. వాళ్ళు బాగా ఉన్న వాళ్ళే. సీత పెళ్ళిలో కనపడి చెప్పింది సరోజ"

"మీరు వెళ్ళాక ఫొటోలు మిగిలిన వివరాలు పంపించండి. కీర్తిక ఫొటోలు కూడ ఇస్తాను. వచ్చే సంవత్సరం ఇండియా వస్తాం గదా! అప్పుడు ఏదో ఒకటి సెటిల్ చేసుకుని అక్కడే వివాహం జరిపించవచ్చు"

"అలాగేరా అబ్బాయ్! మా అందాల భరిణెకోసం ఏ భగీరథుడో తపస్సు చేస్తూనే ఉంటాడు. అవునా! బంగారు తల్లీ!" అంటూ కీర్తికని ముద్దెట్టుకుని మెరికలు విరిచింది శారదాంబ.

పెళ్ళంటే అర్థం తెలీని దీపిక "బామ్మ! మరి నా పెళ్ళెప్పుడు? పట్టుచీరలు, పట్టుపరికిణీలు కొనుక్కోవాలిగా మరి" అని అమాయకంగా అడిగింది. తనకి చీర కట్టుకోవాలన్నా, పట్టుపరికిణీ, ఓణీలు వేసుకోవాలన్నా, జడగంటలు వేసుకుని పూలజడ కుట్టుకోవాలన్నా మహాసరదా!

దీపిక మాటలకి అందరూ ఒక్కసారి గొల్లున నవ్వారు.

## 63

జెర్సీ ఆస్పత్రికి చేరేటప్పటికి విజిటర్స్ అందరూ ఒక్కొక్కరే వెళ్ళి పోతున్నారు. వాతావరణం అంతా ప్రశాంతంగా ఉంది. సూపరింటెండెంటు వద్దకు వెళ్ళి పింకీ పేరు చెప్పి, గది నెంబరు తెలుసుకుని ఆ గదిలోకి వెళ్ళింది జెర్సీ. ఆ రూములో రెండు బెడ్స్ ఉన్నాయి. వాటిపక్కనే రెండు కుర్చీలు, ఒక చిన్న టీ

పాయ్ ఉంది. ఆ గదికి అటాచ్డ్ బాత్ రూం ఉంది. మంచంమీద పడుక్కుంటే ఎదురుగా కనబడేలా ఒక చిన్న సైజు టి. వి. అమర్చబడిఉంది. అది మనం ఏ యాంగిల్‌కి కావాలంటే ఆ యాంగిల్‌కి లేవకుండా మార్చుకోవచ్చు. పిల్లలకి బోరు కొట్టకుండాను, బాధని మరచిపోడానికి ఉపయోగపడుతుంది. ఒక బెడ్ మీద పింకీ మత్తుగా నిద్ర పోతున్నాడు. ప్రక్కన కుర్చీలో నర్స్ మాత్రం ఉంది.

జెర్సీ నర్స్‌ని పరిచయం చేసుకుని,

"ఎలా ఉంది పింకీకి?" అని అడిగింది.

"చాల అదృష్టవంతుడు. మృత్యువుని జయించాడు. ఇంతకీ మీ పేరు ఏమిటి?"

"నా పేరు జెర్సీ! పింకీ వాళ్ళ ఫాదర్ ఎక్కడకి వెళ్ళారు?"

"ఓ! స్టీవా? ఆయన డాక్టరుతో మాట్లాడటానికి వెళ్ళారు. చాల మంచిమనిషి"

"అసలు ఈ ప్రమాదం ఎలా జరిగింది?" అని కంగారుగా అడిగింది.

"ఒకరోజు సాయంత్రం బయట గార్డెన్‌లో బంతి ఆట ఆడుతున్నాడుట. ఆడుతుంటే ఆది చేతిలోంచి జారిదొర్లుకుంటూ రోడ్డు మీదకు వెళ్ళింది. దానిని పట్టుకునే ఉద్దేశంతో దానివెంట పరుగెట్టుకుంటూ వెళ్ళాట్ట. అంతలో సడన్‌గా ఒక కారు స్పీడ్‌గా అటురావటంతో ఈ యాక్సిడెంట్ జరిగింది. తలకు బాగా దెబ్బ తగిలి చాల రక్తం పోయింది. రక్తం అవసరం అయితే స్టీవ్ రక్తం తీసి ఎక్కించారు. నిన్ననే కొంచెం స్పృహ వచ్చింది. డాక్టర్లు చాల కష్టపడవలసి వచ్చింది. ఏది ఏమైనా చాల లక్కీ ఫెలో! స్పృహవచ్చిన తరువాత 'మమ్మీ!... మమ్మీ!... అంటూ కలవరిస్తున్నాడు. మళ్ళీ మగతలోకి వెళ్ళిపోయాడు. బాధ భరించలేకపోతున్నాడు. చిన్న వాడు గదా! అందుకే మత్తు మందు యిచ్చారు డాక్టరు. మరి వీళ్ళ మమ్మీ ఎక్కడుందో తెలియదు. ఇంతవరకు చూడటానికి కూడ రాలేదు" అని వివరంగా అన్ని విషయాలు చెప్పింది నర్స్.

"ఆ దురదృష్టవంతురాల్ని నేనే" అని మనసులో అనుకుని కళ్ళు తుడుచుకుంది జెర్సీ. పింకీ ప్రక్కన కూర్చుని వాడి ఒళ్ళు నెమ్మదిగా ప్రేమగా నిమిరింది.

"మరింకేమీ ప్రమాదం లేదుగదా నర్స్?"

'నో! నో! కాని పూర్తిగా ఆరోగ్యం చేజిక్కటానికి చాల టైం పడుతుంది."

"చాల థాంక్స్. నేను మళ్ళీ రేపు వస్తాను" అని నర్స్‌తో చెప్పి పింకీ నుదుటిపై నెమ్మదిగా ముద్దెట్టుకుని గది బయటకు వచ్చి ఒకవేళ స్టీవ్ వస్తున్నాడేమో అని అటు యిటు చూసింది. కాని ఎక్కడా అటువంటి సూచనలు కనపడక పోయేటప్పటికి యింటికి బయలుదేరింది.

## 64

నీరజ చేస్తున్న ఉద్యోగం కాంట్రాక్ట్ అయిపోవటంతో ప్రస్తుతం ఖాళీగానే ఉంది. ఈ దేశంలో అదొక రూలు. ఎంత పెద్ద చదువులు చదివినా, ఎన్ని డిగ్రీలున్నా ఉద్యోగం మాత్రం పెర్మనెంట్‌గా ఉండదు. అంతా కాంట్రాక్ట్. అది అయిపోగానే యిష్టం ఉంటే మళ్ళీ పొడిగిస్తారు. లేకపోతే గుడ్ బై చెబుతారు. అందుకే ఒక జాబ్‌లో ఉండగానే మరోజాబ్ కోసం ప్రయత్నం చేయాలి. బ్రతకంతా అక్కడ నుండి యిక్కడికి, అందులోంచి యిందులోకి మారుతూండాలి. ఒక విధంగా ఆలోచిస్తే వీళ్ళ జీవితాలు కూడ అంతే! ఎందుకంటే పద్ధతి ప్రకారం వివాహం చేసుకున్న భార్యగాని, భర్తగాని ఏమైనా మనస్పర్థలొస్తే విడిపోడానికి వెనుకాడరు. ఇష్టం ఉన్న వాళ్ళతో కాలం గడిపేస్తారు. ఒకే భార్య అన్న రూలేమి లేదు. అందుకే ఉద్యోగం టెంపరరీయే. భార్య టెంపరరీయే. ఏది ఎప్పుడు వదిలేస్తుందో తెలీదు.

ఇంట్లో బోరు కొట్టడంతో నీరజ, రాజశేఖరం దంపతులు పద్మవాళ్ళ యింటికి ఓ రోజు సాయంత్రం బయలుదేరారు. ఎప్పుడన్నా బోరుకొడితే రెండు ఫామిలీలు కలసి పిక్‌నిక్‌లకి వెళ్ళటం, దగ్గర్లో ఉన్న ప్రదేశాలు చూడడానికి వెళ్ళటం, ఒకరింట్లో ఒకరు కలసి కబుర్లు చెప్పుకుంటూ భోజనాలు చేయటం చేస్తుంటారు.

వానరాకలాగ అనుకోకుండా, ఫోన్ కూడ చేయకుండా వచ్చిన వాళ్ళని చూసి ఆశ్చర్యంతోను, ఆనందంతోను లోపలకి ఆహ్వానించింది పద్మ.

"ఏంటీ! మా గురుడు యింట్లోలేడా?" అని శ్రీకాంత్‌ని గురించి అడుగుతూ సోఫాలో కూర్చున్నాడు రాజశేఖరం.

"రెండురోజుల క్రితం కారు రిపేరుకిచ్చారు. దాన్ని ఈ రోజు యిస్తానన్నాడు మెకానిక్. అందుకని దాన్నితేవడానికి వెళ్ళారు" అని చెబుతూ ప్రక్కనే టీ పాయ్‌మీదున్న ఇంగ్లీషు మేగజైన్ తీసి తిరగేస్తుండమని అతని చేతికిచ్చింది పద్మ.

"థాంక్స్" అంటూ దానిని అందుకున్నాడు శేఖరం.

"పిల్లలు ఇంట్లోలేరా?" అని అడిగింది నీరజ.

"కీర్తిక ఇంట్లోనే ఉంది. దీపిక స్విమ్మింగ్‌కి వెళ్ళింది. శిల్పరాలేదేం" అని అడిగింది పద్మ.

"ప్రాజెక్ట్ వర్క్ ఉందని యింట్లోనే ఉండిపోయింది. మనం కలుసుకుని

చాల రోజులయింది కదా అని ఫోన్ కూడ చేయకుండా బయలుదేరాము"

ఇంతలో కాఫీ, కప్పులతో డ్రాయింగు రూములోకి వచ్చింది కీర్తిక. 'అంకుల్ అండ్ ఆంటీలకి నమస్కారములు' అంటూకాఫీ మగ్‌లోంచి కాఫీని కప్పులలో పోసి అందరికీ యిచ్చింది.

"థాంక్యూ... " అని కాఫీ కప్పు అందుకుంటూ కంగ్రాచ్యులేషన్స్ కీర్తీ, మంచి ఉద్యోగం దొరికింది" అని రాజశేఖరం అన్నాడు.

"థాంక్స్ అంకుల్" అంటూ లోపలకు వెళ్లిపోయింది.

"కాఫీ త్రాగుతూ... మీ అత్తగారు, మామగారు వెళ్ళిపోయినట్లున్నారు. ఇంకా కొద్దిరోజులుండాల్సింది' అని అంది నీరజ.

"అవును నీరజా! అనుకోకుండా అర్జంట్‌గా వెళ్ళవలసివచ్చింది"

"ఇండియాలో అందరూ కులాసాగానే ఉన్నారా?"

"ఈ మధ్య మా చిన్న ఆడబడుచుకి కారు యాక్సిడెంట్ జరిగింది. సీరియస్‌గా ఉందని ట్రంకాల్ వచ్చింది. అందుకే వెంటనే మా అత్తగారు, మామగారు బయలుదేరి వెళ్ళారు"

"ఏ వూర్లో ఉంటున్నారు వాళ్ళు?"

"హైద్రాబాద్‌లో ఉంటున్నారు"

"ప్రమాదం ఎలా జరిగింది"

"హైద్రాబాద్ నుండి తిరుపతి ఫామిలీతో కారులో వెళ్ళివస్తూండగా జరిగిందిట. మా ఆడబడుచుకి, పిల్లలకి కొద్దిగా దెబ్బలు తగిలాయిట. కాని ఆయన మాత్రం ప్రమాద స్థితిలో ఉన్నారుట."

కాలింగ్ బెల్ మ్రోగటంతో వాళ్ళ సంభాషణకు అంతరాయం కల్గింది. కీర్తిక లేచి వెళ్ళి తలుపు తీసింది. శ్రీకాంత్ లోపలకి అడుగుపెట్టూ "ఏమిటీ థండర్ షవర్స్' అని నవ్వుతూ వచ్చిరాజశేఖరం ప్రక్కన కూర్చున్నాడు.

"ఊఁ! ఎలా ఉంది నీ రథం?" అంటూ మాట కలిపాడు.

"నా రథానికేం! బ్రహ్మాండం. ఏమిటి గాలి ఇటు తిరిగిందీవేళ? ఏమిటి విశేషం?" అంటూ రాజశేఖరం వీపుమీద వేళాకోళంగా చరిచాడు శ్రీకాంత్.

"ఆఁ! ఏముంది! మీ చెల్లెలు ఉద్యోగానికి కొంత కాలం విశ్రాంతి దొరికింది. ఇంక నా ప్రాణాలు పీకేస్తోంది. ఎక్కడకన్నా వెడదామని. అందుకని మా రథాన్ని ఇటు మళ్ళించాను"

"వీళ్ళు మాటల్లో పడితే మనం గుర్తుండంగానీ లోపలకు వెడదాం పద నీరజా!" అంటూ లోపలకి నడిచింది పద్మ.

"అయినా వచ్చి చాలా సేపయింది. ఇంక వెడతాం. శిల్ప ఒక్కత్తీ యింట్లో ఉంది" అంటూ నీరజలేచి నిల్చుంది.

"ఈ పూట అందరకీ నా చేతి వంట రుచి చూడవలసిందిగా నేను విన్నవించుకుంటున్నాను. కొద్దిసేపట్లో శిల్పకూడవస్తుంది" అని చెప్పి ఇంక నామాటకు తిరుగులేదు అన్నట్లు సమాధానం కోసం ఎదురుచూడకుండా తుర్రున కిచెన్‌లోకి వెళ్ళిపోయింది కీర్తిక.

ఇంక తప్పదన్నట్లు పద్మ, నీరజ వంక చూసింది.

"కీర్తికలో ఇదివరకటికన్నా యిప్పుడు చాల మార్పు వచ్చింది. ఏమిటి విశేషం?" అంటూ నవ్వింది నీరజ.

"ఆ! ఏముంది! వయసు వస్తున్నకొద్దీ మనిషిలో మార్పు సహజమే కదా!"

"ఓ య్యా! అదీ నిజమే! మరి పెళ్ళి గురించి ఏమన్నా ఆలోచిస్తున్నారా?"

"ఆ! మా అత్తగారితో ఏమన్నా సంబంధాలుంటే వాకబు చేయమని చెప్పాము. ఏదీ పాపం! వాళ్ళు సరదాపడి వచ్చినంత కాలం పట్టలేదు వెళ్ళడానికి. ఏది ఏమైన ఇండియా సంబంధమే చేయాలనుకుంటున్నాం.

"అదీ నిజమే! ఎంత మోడరన్ సొసైటీలో ఉన్నా యిక్కడి సమస్యలు యిక్కడున్నాయి. ఏదైనా మన ప్రయత్నం మనం చేయాలి గదా!"

"నీరజ ఎందుకు అలా మాట్లాడుతోందో అర్థం చేసుకున్న పద్మ చనువుగా "నువ్వు యింకా మనోహర్ గురించే ఆలోచిస్తున్నట్లున్నావ్! ఎక్కడో అక్కడ వాళ్ళు సుఖంగా ఉంటే అదే మనకానందం. అంతకన్నా ఏం కావాలి మనకి. అదృష్టవశాత్తు కీర్తిక అటువంటి పరిస్థితిలోంచి బయట పడింది" అంటూ జాక్ గురించి టూకీగా చెప్పింది పద్మ.

"ఇక్కడ స్నేహాలే అంత. అవకాశం ఉంటే శుభ్రంగా ఉపయోగించుకుంటారు. మనకుపయోగం లేదూ అని తెలిస్తే నిర్మొహమాటంగా గుడ్‌బై చెప్పేస్తారు" అని కొందరి గురించి చెప్పింది నీరజ.

భోజనం తయార్ అంటూ కంచం మీద స్పూన్‌తో చప్పుడు చేస్తూ అందరికీ 'సిగ్నల్' యిచ్చింది కీర్తిక. మాటలు ముగించి అందరూ డైనింగ్ హాలులోకి వచ్చారు. అన్నం తింటూ "వంటకాలు చాల రుచిగా ఉన్నాయి. పెళ్ళి చేసుకోబోయే వాడు చాల అదృష్టవంతుడే కీర్తీ" అంటూ కీర్తికకి సర్టిఫికేట్ యిచ్చింది నీరజ.

"థాంక్స్ ఆంటీ, ఏదో సింపుల్‌గా చేసాను" అని నెమ్మదిగా, "మిమ్మల్ని

చేసుకున్న అంకుల్ కూడా చాల లక్కీఫెలో ఆంటీ'' అని కొంటెగా అంది.

"ఆ( ఆ( మాటలు బాగా నేర్చావ్'' అని బుగ్గమీద చిటిక వేసింది.

"అరె! మర్చేపోయాను. ఒక్కనిమిషం అంకుల్ అంటూ డిష్‌లోఉన్న మిరపకాయ బజ్జీలని తీసి రాజశేఖరం ప్లేటులో వేసింది కీర్తిక.

"ఓహ్ కీర్తి! ఏమి నా అదృష్టం ఈ రోజు. నీకు ఎలా థాంక్స్ చెప్పాలో అర్థం అవడంలేదు. అందులోనూ ఉల్లిపాయ చెక్కు+ నిమ్మరసం వేసి బాగా దట్టించావ్. అసలు ఎన్నాళ్ళయిందో బజ్జీలు తిని. కారం ఎక్కువ తినకూడదంటూ మీ ఆంటీ అన్నిటినీ కంట్రోల్ చేసేసింది'' అంటూ బజ్జీ తింటూ భార్య వంక ఓరగా చూసాడు రాజశేఖరం.

"ప్రస్తుతానికి మీకాభయం లేదు అంకుల్. కానీ... ఇంటికెళ్ళాక ఆంటీతో కొంచెం జాగ్రత్తగా ఉండండి. అయినా రేపు షాపింగ్‌కి వెడతానంటున్నారు గదా! అప్పుడు 'బే' లో మంచి డిజైన్‌ఉన్న ఒక డైమండ్ సెట్ ఒకటికొని ప్రెజెంట్ యిచ్చేయండి'' అంటూ ఆంటీ వంక చూస్తూ అంది కీర్తిక.

నీరజ కళ్ళతోనే శభాష్ అంటూ మెచ్చుకోలుగా కీర్తిక వంక చూసింది.

డైమండ్ సెట్ మాట వినేసరికి మిరపకాయబజ్జీ తింటున్న రాజశేఖరానికి గొంతుకలో అడ్డుపడి పొలమారింది.

"ఎంతైనా మీ ఆడవాళ్ళందరూ ఒకటైపోయి మా వాణ్ణి ఆటపట్టించటం ఏం బాగోలేదు'' అంటూ పాపం రాజశేఖరం మీద సానుభూతి చూపాడు శ్రీకాంత్.

"ఏదైతేనేం కీర్తీ! నీ పుణ్యమా అంటూ బజ్జీలు తినే అవకాశం దొరికింది'' అంటూ మరో రెండు బజ్జీలు లాగించి, మరోసారి థాంక్స్‌చెప్పి "మరింక యింటికి వెళ్లాలి. లేకపోతే రేపు ఆఫీసుకి అంతే సంగతులు అవుతుంది!'' అంటూ లేచాడు రాజశేఖరం.

"చాల థాంక్స్ పద్మా! చాల రోజుల తరువాత ఈరోజు కాస్త మనసు హాయిగా ఉంది'' అంటూ "అయితే తరువాత శుభవార్త శుభలేఖ అందివ్వాలి కీర్తీ! బజ్జీలు పెట్టి తప్పించుకున్నాననుకోకు'' అంటూ నవ్వేసింది నీరజ.

"అలాగే ఆంటీ! ఫొటోలు వచ్చిన తరువాత సెలక్షన్ మీరే చేద్దురుగాని'' అంటూ తనూ నవ్వేసింది కీర్తిక.

"ఓకే! అంటూ గుడ్‌నైట్ చెప్పి బయలుదేరారు రాజశేఖరం దంపతులు.

"వెల్‌కమ్'' అంటూ వారికి వీడ్కోలిచ్చారు శ్రీకాంత్, పద్మలు.



# 65

ఆ మర్నాడు ఆఫీసు అయిపోగానే తిన్నగా ఆస్పత్రికి వెళ్ళింది జెర్సీ. కాని పింకీ ఉన్న రూము ఖాళీగా ఉంది. బెడ్‌మీద పింకీ లేడు. స్టీవ్ కూడ ఆ పరిసరాల్లో కనపడలేదు. మనసులో ఏదో కీడు శంకించింది జెర్సీ. వెంటనే గది బయటకొచ్చి అటుఇటు చూసింది. అటుగా వస్తున్న ఓ నర్స్‌ని పిలిచి అడిగింది.

"ఈ గదిలో ఉన్న పేషంట్‌ని ఎక్కడికి తీసుకువెళ్ళారు?'' అని అడిగింది జెర్సీ కంగారుగా!

"జస్ట్ ఎ మినిట్'' అంటూ ఒకటేబుల్ దగ్గరకు వెళ్ళి అక్కడున్న ఫైల్సులో ఒక దానిని తీసి చూసి, మళ్లీ జెర్సీ వద్దకు వచ్చి 'ఇప్పుడు ఆ పేషెంట్ ఇంటెన్సివ్ కేర్ యూనిట్‌లో ఉన్నాడు' అని చెప్పి వెళ్ళిపోయింది నర్స్. "థాంక్స్'' అంటూ రూములోకి వచ్చి కూర్చుంది. మనసంతా కంగారుగా, ఆందోళనగా ఉంది. స్టీవ్ కనపడతాడేమోనని కాసేపు ఎదురుచూసింది. ఆగదిలో టీపాయ్‌కి ప్రక్కగా - ఒక ఎరుపు రంగు సంచి ఒకటి ఉంది. దానిమీద స్టీవ్ అడ్రసు ఉండటంతో దాని జిప్ తీసి చూసింది. అందులో కొన్ని ఆఫీసు ఫైల్సు, కొన్ని సగం సగం వ్రాసి వదిలేసిన కాగితాలు ఉన్నాయి. వాటిని తీసి చదివి మళ్ళీ వాటిని సంచిలో పెట్టేసింది. చెక్కిళ్ళపై జారిన వెచ్చటి కన్నీటిని నేప్‌కిన్‌తో తుడుచుకుంది. తను అనవసరమైన పట్టుదలకు పోయి మూర్ఖంగా తనని ప్రేమించే భర్తని, తన ప్రేమకోసం పరితపించే కొడుకుని దూరం చేసుకుంది. ఒక్కసారి స్టీవ్ కనపడితే బాగుండును'' అని మనసులో అనుకుంది జెర్సీ.

ఇంక ఇంటికి వెడదామని లేస్తుండగా స్ట్రెచర్ మీద పింకీని తీసికొచ్చి బెడ్‌మీద పడుక్కోబెట్టారు. కావలసిన వస్తువుల్ని నర్స్ సర్ది వెళ్ళిపోయింది. పింకీ మత్తులో ఉన్నాడు.

జెర్సీ పిచ్చిగా వాడివైపే చూస్తోంది.

"వెరీ వెరీ సారీ హనీ! నా అంత కఠినాత్మురాలు ఎక్కడా ఉండదు. నేను తల్లిని కాను. రాక్షసిని. నీ పసి హృదయాన్ని ఎంతలా గాయపరిచానో'' అని పశ్చాత్తాపంతో కుమిలి కుమిలి ఏడుస్తోంది. ఇంతలో గబగబా గదిలోకి వచ్చాడు స్టీవ్.

పింకీ ప్రక్కన ఉన్న జెర్సీని చూసి ఒక్కసారి ఆశ్చర్యపోయాడు.

లోపలికి వచ్చిన స్టీవ్‌ని చూసి తన కళ్ళని తానే నమ్మలేకపోయింది. లోపలకి వచ్చింది స్టీవేనా... లేక... మరోవ్యక్తా అని అనుమానం కలిగింది. పీక్కుపోయిన

ముఖం, చెల్లా చెదురుగా ఉన్న జుట్టు లోతుకుపోయి గుంటలుపడిన కళ్ళతో నీరసంగా ఉన్నాడు. జెర్సీ మనసు ఒక్కసారి విలవిల్లాడింది.

"ఆయ్ హనీ! హౌఆర్ యూ" అని ముందుగా తానే పల్కరించాడు స్టీవ్.

"నాట్ టూ బేడ్" అని బాధ నిండిన గొంతుతో అంది.

"ఐయామ్ వెరీ సారీ స్టీవ్" అంటూ కళ్ళ నీళ్ళు పెట్టుకుంది.

"వ్వాట్ హేపెండ్? ఇప్పుడేమైయిందని ఆ కన్నీళ్ళు?" ఓదారుస్తూ అన్నాడు.

"అసలు ఇదంతా నావల్లే జరిగింది. దీనికంతకూ కారణం నేనే"

"అలా ఎందుకనుకోవాలి? కాలం కలసి రాకపోతే జరిగేది ఏదీ తప్పదుగదా" అని నిరాశగా మాట్లాడాడు.

"పింకీకి యిప్పుడు ఎలా ఉంది?" అని కళ్ళు తుడుచుకుంటూ అడిగింది.

"అదృష్టవశాత్తు ప్రాణాపాయం తప్పింది. వాడికి ఏ మాత్రం తెలివి వచ్చినా నీ గురించే పలవరిస్తున్నాడు. ఈరోజు తలకి తగిలిన గాయం బాధ ఎక్కువగా ఉండటంతో భరించలేకపోయాడు. అందుకే ఎమర్జన్సీ వార్డ్‌కి తీసుకెళ్ళాల్సి వచ్చింది. ఇంజక్షన్లూ అవీ యిచ్చారు. ప్రస్తుతం కంగారుపడవలసిన అవసరం లేదు" అని చెప్పి తేలిగ్గా ఊపిరిపీల్చుకున్నాడు.

జెర్సీ మౌనంగా కూర్చుంది.

"నువ్వేమిటి అలా అయిపోయావ్? ఒంట్లో బాగోలేదా?" అని ఆమెని పరికిస్తూ అడిగాడు.

తను అడగవలసిన ప్రశ్నని స్టీవ్ అడగటంతో మనసులోని ప్రేమ ఒక్కసారి పెల్లుబికి అమాంతంగా స్టీవ్‌ని కౌగిలించుకుని "నన్ను క్షమించు స్టీవ్! నేను జీవితంలో యిప్పటికీ చాల పోగొట్టుకున్నాను. మళ్ళీ తెలుసుండి ఇటువంటి పొరపాటు చేయను. ఐలవ్‌యూ స్టీవ్! ఐలవ్‌యూ! ప్లీజ్" అంటూ జవాబు చెప్పనీయకుండా అతని ముఖాన్ని ముద్దులతో తడిపేసింది.

అనుకోని ఈ సంఘటనకి స్టీవ్‌కి ఏం చేయాలో అర్థం అవలేదు. "ఐ లవ్ యూ టూ హనీ! ఎంతటి వియోగాన్ని శిక్షగా వేసావ్?" అంటూ ఆమెని మరింత దగ్గరగా తీసుకుని ఆమె పెదవుల్ని ముద్దాడాడు.

అలా ఎంతసేపున్నారో వాళ్ళకి తెలీలేదు.

"మ... మ్మీ... మమ్మీ!... " అని పింకీ పెదవులు కదలటంతో జెర్సీ తనని తను నిగ్రహించుకుని, మెల్లిగా స్టీవ్ కౌగిలిని విడిపించుకుని పింకీ వద్దకు వచ్చింది జెర్సీ.

"హనీ! చూడు! నెమ్మదిగా కళ్ళు తెరు! ఎవరొచ్చారో చూడు" అంటూ జెర్సీ వాడి చెవి వద్దమాట్లాడింది.

"మెల్లిగా కళ్ళు తెరిచాడు పింకీ! మసక మసకగా తల్లి రూపం ఎదురుగా కనపడటంతో మమ్మీ!... మమ్మీ!" అని ఆమె చెయ్యి గట్టిగా పట్టుకున్నాడు.

"అవును హనీ! మమ్మీనే. నేను నీకోసం వచ్చేసాను"

"మమ్మీ! నన్ను విడిచి మళ్ళీ వెళ్ళిపోకు. నేను చచ్చిపోతాను మమ్మీ! మమ్మీ! మరి డాడీకి ఎవరుంటారు!" అని పిచ్చి పిచ్చిగా మట్లాడుతున్నాడు.

"నో హనీ! ఏమిటా మాటలు. నిన్ను విడిచి ఎక్కడకీ వెళ్ళను. మనం అందరం కలిసే ఉంటాం. ఐ లవ్ యూ హనీ! నీకు తొందరలోనే ఆరోగ్యం చేకూరుతుంది. డాక్టరు యిందాక చెప్పారు. నీకేం భయం లేదు. నువ్వు, నేను, డాడీ కలసి మన యింటికి వెడదాం" అని వాణ్ణి ప్రేమగా సముదాయించింది.

"నిజంగా మమ్మీ!" అని నమ్మలేనట్టు తల్లి వంక చూసాడు.

"అవును. నిజంగా. ప్రామిస్" అంటూ వాణ్ణి ముద్దెట్టుకుంది.

"మరి డాడీ మీద కోపం పోయిందా!

"ఆ! పోయిందిగా! ఇదిగో ఇటుచూడు! నీకోసం ఏం తెచ్చానో" అంటూ తాను తెచ్చిన కథల పుస్తకాలు, 'బిగ్‌బేర్' స్పాంజ్ బొమ్మని వాడిచేతికిచ్చింది"

''థాంక్స్‌మమ్మీ! ఐ లవ్ యూ మామ్'' అంటూ ఆమె చేతిని గట్టిగాపట్టుకున్నాడు. మత్తు ఇంజక్షన్స్ యివ్వటం వలన పింకీ మాటలు తేల్చేస్తు మెల్లిగా మత్తులోకి జారాడు.

జెర్సీవాణ్ణి నెమ్మదిగా చేయి విడిపించుకుని వాణ్ణి సరిగ్గా పడుక్కోబెట్టి బెడ్ షీట్ కప్పింది జెర్సీ.

"జెర్సీ! ఇంక నువ్వు యింటికి వెళ్ళు. మళ్ళీ రేపు వద్దువుగాని. ఇప్పటికే చాల ఆలస్యం అయింది" అని అన్నాడు.

"పర్వాలేదు స్టీవ్" అని చాలసేపు కూర్చుని ఎన్నో విషయాలు మాట్లాడి, "మళ్ళీ రేపు వస్తాను" అని చెప్పి వెళ్ళిపోయింది.

## 66

డయానాకి అన్ని పనులలోను చేదోడు వాదోడుగా ఉంటోంది స్టేసీ. పరాయి యింట్లో ఉన్నట్లు ఫీలవటం లేదు. అన్నా చెల్లెళ్ళు యిద్దరూ ఆ యింట్లో మనుష్యుల్లా కలసిపోయారు. డయానా కూడా వాళ్ళని సొంతబిడ్డల్లా చూసుకుంటోంది.

స్టేసీ అంటే ఆ యింట్లో అందరకీ గౌరవభావమే. గ్రేసీ తనకి తెలియని విషయాల్ని, సబ్జెక్టు గురించి తెలియనివి జాన్‌ని అడిగితెలుసుకుంటూంటుంది. కాని - జాన్ ఎక్కువగా ఎవరితోను మాట్లాడడు. అవసరం అయితే తప్పించి, లేకపోతే తనపని తాను చేసుకుపోతాడు. అతని ధ్యేయం ప్రస్తుతం ఒక్కటే. వీలైనంత తొందరగా ఖీలాని యింటికి తీసుకురావటం. అందుకే ఉద్యోగం కోసం అన్ని చోట్ల ప్రయత్నం చేస్తున్నాడు.

ముక్తసరిగా మాట్లాడుతూ, సీరియస్‌గా ఉండే జాన్ అంటే గ్రేసీకి ఒక విధమైన ప్రేమ, అభిమానం- ఏర్పడ్డాయి. అందుకే అప్పుడప్పుడు అతని రూం సర్దటం బట్టలు యిస్త్రీ చేయటం చేస్తూంటుంది. రెండు మూడుసార్లు తనపనులేవీ చేయవద్దని గ్రేసీని హెచ్చరించాడు జాన్. కాని గ్రేసీ మొండిపిల్ల. వద్దంటే మరికాస్త ఎక్కువ చేస్తుంది. అందుకునే పెద్దగా పట్టించుకునే వాడు కాదు. ప్రతిరోజు ఉదయం కాఫీ తనేయిస్తుంది.

ఒకరోజు ఉదయం మామూలుగానే కాఫీ యివ్వడానికి అతని రూంలోకి వచ్చింది గ్రేసీ. కాని జాన్ యింకా నిద్రలేవలేదు. అది ఆశ్చర్యకరమైన విషయమే. యింట్లో జాన్ ఒక్కడే. కాని ఈ రోజు యింకా ఎందుకు లేవలేదో?అని మంచం దగ్గరగా వెళ్ళి జాన్... జాన్... అని పిలిచింది. ఆ పిలుపుకి జాన్ మగతగా ఊ! ఊఁ అంటూ మూలిగాడు.

"ఈరోజు ఏమైందీ? ఇంకా నిద్రలేవలేదు?"

సమాధానం రాకపోయేసరికి ఒంటిమీద చేయి వేసి చూసింది.

"అబ్బ!" అంటూ ఒక్కసారి చెయ్యి వెనక్కిలాక్కుంది తన చేతిని.

జాన్ వళ్ళు జ్వరంతో వేడిగా కాలిపోతోంది. "ఓ మైగాడ్!" అంటూ గబగబ తల్లి వద్దకు వచ్చి చెప్పింది గ్రేసీ, డయానా వెంటనే జాన్ వద్దకు వచ్చి ఒళ్ళు ముట్టుకుని చూసి వెంటనే డాక్టర్‌కి ఫోన్ చేసి పదిగంటలకు అపాయింట్‌మెంట్ తీసుకుంది.

స్కాట్ అప్పటికే ఆఫీసుకి వెళ్ళిపోయాడు. తనకి ఆఫీసుకి వెళ్ళే టైం అయిపోతోంది. అందుచేత గ్రేసీని పిలిచి పదింటికి ఆస్పత్రికి జాన్‌ని తీసుకెళ్ళమని చెప్పింది. లంచ్ టైంలో తను వచ్చి చూస్తానని చెప్పివెళ్ళిపోయింది.

ఎప్పుడు జలుబు కూడ చేసి ఎరుగని జాన్‌కి జ్వరం రావటంతో స్టేసీ కొంచెం కంగారుపడింది. కాని పైకి మాత్రం ధైర్యంగానే ఉంది.

*

జాన్‌కి మామూలు జ్వరం అల్లా టైఫాయిడ్ లోకి దిగింది. దాంతో ఆస్పత్రిలో చేర్చవలసివచ్చింది. ఇంట్లో అందరూ కొంచెం కంగారుపడ్డారు. ఖీలాకి ఫోన్ చేయగా పర్మిషన్ తీసుకుని జాన్‌ని చూడటానికి ఆస్పత్రికి వచ్చింది.

మంచం మీద మగతగా పడుక్కున్న జాన్ ముఖం ఎర్రగా కంది ఉంది. ఊపిరందక ఆయాసపడుతున్నాడు. బెడ్‌ప్రక్కన కుర్చీలో గ్రేసీ కూర్చుని ఏదో పుస్తకం తిరగేస్తోంది. గదిలోకి వచ్చిన ఖీలాని చూసి విష్ చేసింది.

"నిద్రపోతున్నాడా?" అని అడిగింది ఖీలా!

"చాల సేపయింది. బహుశా లేచే టైం అయ్యింది"

కొడుక్కి దగ్గరగా వచ్చి "ఎన్నికష్టాలు వచ్చాయి హనీ! హాయిగా సుఖ పడవలసిన వయసులో ఎన్ని అవస్థలు పడుతున్నారో! నేను ఉండి కూడ లేనట్లే అయ్యాను" అని నెమ్మదిగా గొణుగుతూ జాన్ తల నిమిరింది ఖీలా.

"ఊరుకోండి ఆంటీ! మీరే యిలా డీలాపడిపోతే స్టేసీ యింకా కంగురుపడుతుంది. అయినా మీరు కంగారు పడనవసరంలేదు. కొద్ది రోజులలో తగ్గిపోతుంది" అంటూ లోపల తనకి కంగారుగానే ఉన్నా పైకి మాత్రం ధైర్యంగా ఖీలాని ఓదార్చింది.

వీళ్ళ మాటలకి జాన్‌కి మెలకువ వచ్చింది. నెమ్మదిగా కళ్ళు తెరిచాడు. ఎదురుగా కూర్చున్న తల్లిని చూసి అతని కళ్ళు నక్షత్రాల్లా మెరిసాయి.

"హాయ్ మామ్" అని తల్లిని నీరసంగా పల్కరించాడు జాన్.

"ఆయ్ హనీ! ఎలా అయి పోయావో! చూడు!" అంటూ మంచం ప్రక్కన వచ్చి కూర్చుంటూ 'ఎలా ఉంది జాన్?' అని అడిగింది.

"పర్వాలేదు మమ్మీ! కొంచెం బాగానే ఉంది!" అని అంటూ ఆమె చేతిని తనచేతిలోకి తీసుకుని "కొద్దిరోజులు ఓపిక పడితే మనమందరం హాయిగా కలసి ఉండవచ్చు. తొందరలో మంచి రోజులు వస్తాయి" అని ఆవేశంగా చెప్పాడు.

"ఓహ్ హనీ! అసలే అనారోగ్యంగా ఉన్న నీవు ఇలాంటి విషయం గురించి ఆలోచించకు. ముందు నీకు ఆరోగ్యం చేకూరనీ! ప్రస్తుతం నేను అక్కడ బాగానే ఉన్నాను. నీవు అనవసరంగా కంగారుపడకు"

ఇంతలో డయానా అక్కడకి రావటంతో తనని తాను నిగ్రహించుకోలేక డయానాని కౌగిలించుకుని కన్నీళ్ళు పెట్టుకుంది ఖీలా!

"ఏయ్ ఏమిటీ అధైర్యం? ఇప్పుడేమైయిందని ఆ బెంబేలు? ఊఁ జ్వరమే

కదా! తొందరలో తగ్గిపోతుంది. అంతేగాని ఇలా అధైర్యపడితే పిల్లల గతేం కాను'' అని లాలనగా అంది డయానా.

"కన్నతల్లినై యుండి కూడ దగ్గరుండి కొడుకుని చూసుకోలేకపోతున్నాను''

"మేమందరం ఉండగా నీకు ఎటువంటి భయం అక్కరలేదు. నువ్వు అనవసరంగా బాధ పడి మనసుని పాడుచేసుకోకు'' అని ధైర్యాన్ని చెప్పింది డయానా.

"ఆ ధైర్యంతోనే నేను ఇలా బ్రతగ్గల్గుతున్నాను. నీవే లేకపోతే ఈ రోజు నా పరిస్థితి మరొకలా ఉండేది. నీ ఋణాన్ని ఈ జన్మలో తీర్చుకోలేను. భగవంతుడున్నాడో లేడోగాని నా కళ్ళకి కనపడే దేవుడివి మాత్రం నీవే'' అంటూ అన్నిటికీ నీవే అన్నట్లు డయానా వంక చూసింది ఖీలా!

"ఆ! ఆ! అంతంత పెద్ద మాటలొద్దు ఖీలా! ఇందులో నేను చేసిందేమిలేదు. మానవత్వం ఉన్న ఏమనిషైనా చేస్తాడు. నీకు ఎప్పటికప్పుడు ఫోన్‌లో జాన్ ఆరోగ్యం గురించి చెబుతూంటాను''

"చాల థాంక్స్ డయానా! నేను ఉందామంటే రూల్సు ప్రకారం వీలుపడదు. మరి యింక నేను వెడతాను. మళ్ళీ రేపు వస్తాను''

"ఒకే! నేను నిన్ను డ్రాప్ చేసి యింటికి వెడతాను''

''సరే'' అని జాన్‌తో ధైర్యంగా ఉండమని, తొందరలోనే నయం అయిపోతుందని చెప్పి, ప్రేమగా నుదుటిమీద ముద్దెట్టుకుంది.

*

కిటికీ వద్ద మౌనంగా నిల్చుని బయటకు చూస్తోంది గ్రేసీ .

"గ్రేసీ'' అంటూ మెల్లిగా పిలిచాడు జాన్.

"..................''

రెండోసారి కొంచెం గట్టిగా పిలిచాడు.

ఏమిటన్నట్లు అతని వంక తిరిగింది పరధ్యానంగా.

"ఇలా వచ్చికూర్చో'' అని సంజ్ఞ చేసాడు.

ఆమె అతనికి దగ్గర్లో ఉన్న కుర్చీలో కూర్చుని చేతి గోళ్ళు కొరుకుతూ ఏదో ఆలోచిస్తోంది.

"ఏయ్! ఏమిటి అంత దీర్ఘంగా ఆలోచిస్తున్నావ్?''

"నథింగ్! ఆ! అన్నట్టు ఎందుకు పిలిచావ్?''

"మమ్మీ! ఇప్పుడే వెళ్ళింది''

"అవును''

"ఆమెని చూస్తుంటే నా మనసు ఎందుకో విలవిల్లాడిపోతుంది. నేను చూస్తుండగా ఆమె ఏ ఒక్కరోజు సుఖపడలేదు. ఎన్ని బాధలున్నా, ఎన్నికష్టాలున్నా తనలోనే దాచుకుని స్రవంతిలా ప్రశాంతంగా ఉంటుంది. నాకు ఉద్యోగం వస్తే ఆమెని పువ్వుల్లో పెట్టి చూసుకుంటాను. అదొక్కటే నా జీవితలక్ష్యం. అంతవరకు నాకు మనశ్శాంతి ఉండదు'' అని తన మనస్సులోని బాధనంతా గ్రేసీకి చెప్పుకున్నాడు.

గ్రేసీ మౌనంగా వింటోంది.

"నా మాటలతో నిన్ను బోరుకొడుతున్నానా గ్రేసీ?''

"నో! నో! జాక్ మీ తల్లీ కొడుకుల అనురాగం చూస్తూంటే నాకు జెలసీగా ఉంది. అయినా మనిషికి కావల్సింది ప్రేమ, అభిమానమే గదా! అవి ఉంటే దేనినైనా జయించవచ్చును. కాని ఒక్కవిషయం. నువ్వు తొందరగా కోలుకుంటేనేగాని ఏ పనీ జరగదు. అందుకు నీకు విశ్రాంతి కావాలి. ఎక్కువగా ఆలోచించకు. పూర్తి ఆరోగ్యం వచ్చిన తరువాత నీవు ఏం సాధించాలనుకున్నా సాధ్యం అవుతుంది. అప్పుడు నీ ఆశయాలు ఫలిస్తాయి. చూడు పదిహేను రోజులలో ఎలా అయిపోయావో! తొందరలో హాయిగా ఆరోగ్యంగా లేచి తిరగాలి'' అంది నవ్వుతూ!

"నిన్ను చాల బాధపెడుతున్నాను. అవునా?''

"ఏం? ఎందుకొచ్చిందా అనుమానం?''

"నీ టైం అంతా నా దగ్గరే గడిపేస్తున్నావ్. నీ చదువు పాడవుతుంది. అయినా నాలాంటి దురదృష్టవంతుడిపైన నీకెందుకింత అభిమానం? నీకు నేను ఏమవుతాను?'' అని ఆమె కళ్ళలోకి సూటిగా చూసాడు.

"నీకు మందులవల్ల బాగా పైత్యం చేసినట్లుంది. అసలే మితభాషివి. ఎక్కువగా మాట్లాడటం ఆరోగ్యానికి అంత మంచిదికాదు'' అంటూ మాట మార్చేసింది.

"ఏం! నాతో మాట్లాడాలంటే విసుగ్గా ఉందా?'' మొహం ప్రక్కకు త్రిప్పుకొని అన్నాడు.

"నో! నో! అదేంకాదు'' అంది కంగారుగా.

"మరి ఏమైనా కబుర్లు చెప్పు. వింటాను'' అని చిన్న పిల్లాడిలా అడిగాడు.

"ఒకే! అయితే నేను నిన్ను ఇంటర్వ్యూ చేస్తాను''

"అంటే?''

"అంటే నేను కొన్ని ప్రశ్నలడుగుతాను. వాటికి నీవు సూటిగా సమాధానాలు చెప్పాలి. అర్థం అయిందా?"

"ఓకే!"

"నీరసంగా ఉందా? కొంచెం జ్యూస్ యివ్వనా?"

"నో! నో! పర్వాలేదు" అంటూ చిన్నగా నవ్వాడు.

"నీకు ఉద్యోగం వచ్చిన తరువాత ఏం చేస్తావ్?"

"గోళ్ళు కొరుక్కుంటాను"

"ఏయ్! ఏమిటా తల తిక్క సమాధానం" చిరుకోపంగా అంది.

"మరి ఉద్యోగం వస్తే ఏం చేస్తారు? పిచ్చి ప్రశ్న వేసావ్ నువ్వు."

"నీకు ఎవరంటే యిష్టం?"

"మా మమ్మీ అంటే చెప్పలేనంత యిష్టం"

"నువ్వు ఎవరినైనా ప్రేమించావా?"

"ఓ! య్యా!"

"ఎవర్నీ?"

"గాడ్‌ని"

"ఇంకా...?"

"ప్రస్తుతానికంతే"

"నీకు గర్ల్ ఫ్రెండ్స్ ఉన్నారా?"

"ఆ! ఆ!"

ఇంతలో హడావుడిగా ఒగరుస్తూ స్టేసీ అక్కడకు వచ్చింది. అక్కడున్న గ్రేసీని చూసి 'ఏమిటి ఉపన్యాసాలిస్తున్నావ్' అంటూ వేళాకోళం అడింది.

"ముద్ద పప్పులాంటి మీ అన్నయ్యతో వేళాకోళం కూడానూ- సరి సరి" అంటూ మూతి మూడువంకరలు త్రిప్పింది గ్రేసీ.

"ఆఁ! జాన్! నీకో గుడ్ న్యూస్" అంటూ అతని ప్రక్కన కూర్చుంది.

"ఏమిటదీ?"

"చెప్పుకో చూద్దాం."

"మమ్మీ ఫోన్ చేసిందా?"

"ఇప్పుడేగా వెళ్ళింది. అప్పుడేనా?" అంది గ్రేసీ.

"మరి ఏమిటో చెప్పేయ్ తొందరగా! అసలే మీ అన్నయ్య నీర్సంగా ఉన్నాడు" అంది గ్రేసీ.

"ఏం! పాపం! అంతజాలి? ఏమిటి కథా? కమామిషు?"

"ఏం లేదు తల్లీ! నీతో ఏం మాట్లాడినా తప్పే!" అని అంతలో ఏదో గుర్తు వచ్చినదానిలా 'ఆఁ నే చెప్పనా?' అంది.

"ఓకే! చెప్పు చూద్దాం"

"ఆఁ! నీ పెళ్ళి శుభలేఖ"

"ఏయ్! నీకు ఈ మధ్య మరీ ఎక్కువైపోతోంది"

"ఏమిటది"

"లవ్"

"ఎవరిమీద?"

"నా మీద"

"ఆఁ. ఆఁ!"

"ఆఁ! ఆఁ! లేదు! ఆవకాయా లేదూ! కమ్ టు ది పాయింట్"

"అయితే చెప్పేస్తున్నాను. చెప్పినందుకు నాకు ఏమి ఇస్తారు" అని యిద్దరి వంక చూసింది స్టేసీ.

"అబ్బ! అవన్నీ తర్వాత చూద్దాం. ముందు అసలు సంగతి చెప్పు" అని కొంచెం విసుగ్గా అంది.

"ఓకే! అయితే! ఇంతకీ అసలు సంగతి ఏమిటంటే మా అన్నయ్యకి ఒక గర్ల్ ఫ్రెండ్ + లవ్వర్ ఉత్తరం వ్రాసింది. ఇదిగో జాన్" అంటూ చేతి బేగ్‌లోంచి ఒక కవరు తీసి జాన్‌కిచ్చింది.

"ఒక్కక్షణం గ్రేసీ మొహంలో రంగులు మారాయి.

ఆ సంగతి జాక్ గ్రహించి చిన్నగా నవ్వుకున్నాడు. స్టేసీ యిచ్చిన కవరుని చింపి చదవసాగాడు. అతని కళ్ళల్లో ఆనందం. పట్టరాని సంతోషంతో స్టేసీని కౌగిలించుకుని "ఐ లవ్ యూ స్టేసీ! ఇంతమంచి వార్త తెచ్చినందుకు నేను నీకు ఏం యివ్వను?" అని ఆమె బుగ్గ మీద ముద్దుపెట్టుకున్నాడు.

కంగ్రాచ్యులేషన్స్ జాన్! నాకు తెలుసు అసలు సంగతి. ఆ! అన్నట్టు మర్చిపోయాను. ఇప్పుడే వస్తాను" అంటూ గ్రేసీని పట్టించుకోకుండా బయటకు వెళ్ళిపోయింది. గ్రేసీకి యిదంతా ఏమిటో అర్థం కాలేదు. ఇంక తనని ఎవరూ పట్టించుకోవటం లేదని మనసులో చిన్నగా బాధపడింది. ఇంక ఒక్కక్షణం అక్కడ ఉండబుద్ధి కాలేదు.

ఇంతలో గ్రేసీ... అని జాన్ పిలిచాడు.

ఆమె జాన్‌కి దగ్గరగా వచ్చినిలబడింది.

"నాకు ఉద్యోగం వచ్చింది గ్రేసీ! ఇదిగో చూడు ఆర్డర్స్" అంటూ ఆమె చేతికి కవరు అందించాడు.

"ఆమె వాటిని చదివి, సంతోషంతో 'కంగ్రాచ్యులేషన్స్ చెప్పింది. తరువాత నెమ్మదిగా జాన్... అయితే... అని ఏదో చెప్పబోయి ఆగింది.

"ఏమిటి? ఏదో అడుగుదామని మధ్యలో ఆపేసావ్?"

"మరి నీకు ఉద్యోగం వచ్చింది. నీకు తొందరలో పూర్తి ఆరోగ్యం చేకూరుతుంది. అప్పుడు మీరు మా యింట్లోంచి వెళ్ళిపోతారా?" అని జాలిగా అడిగింది.

"అదేం ప్రశ్న? అలా అడుగుతున్నావ్?"

"ఏం లేదు. ఇన్నాళ్ళు మంచో, చెడో మనం కలసిఉన్నాం. తెలీకుండానే మనమధ్య స్నేహాభావం ఏర్పడింది. అలాంటప్పుడు ఆకస్మాత్తుగా మధ్యలో విడిపోతే నాకు బాధగా ఉంది."

"ఓస్! అంతేనా! ఆ మాత్రానికే బాధపడాలా? అయినా మేము ఎక్కడకి వెళ్ళుతున్నాం అని. వీలున్నప్పుడు కలుసుకుంటూ ఉండచ్చు."

"జాన్ నామీద నీ అభిప్రాయం ఏమిటి?" అని ముక్కుకు సూటిగా అడిగింది.

"నీకేం. మంచి అమ్మాయివి. అందం, చదువు, తెలివితేటలున్నాయి. ఎదుటి మనిషి బాధపడుతుంటే చూడలేని జాలి గుండెగలదానివి. నేను నీకు చాల ఋణపడిఉన్నాను"

"అంతేనా?"

"ఊఁ"

"మరి నేనంటే నీకు యిష్టం లేదా?"

"లేకేం?"

"అయితే నేనొక ప్రశ్న అడుగుతాను. మళ్ళీ మనకిటువంటి అవకాశం రాకపోవచ్చు"

"సరే! అడుగు"

"నేను నిన్ను ప్రేమిస్తున్నాను. నువ్వంటే నాకు ప్రేమ, యిష్టం. నీకు యిష్టమయితే మనం పెళ్ళిచేసుకుందాం. ఈ విషయంలో మన పెద్దవాళ్ళు కూడా ఏం అభ్యంతరం చెప్పరు." అని తన మనసులోని అభిప్రాయాన్ని చెప్పింది.

"నువ్వు తొందరపడుతున్నావేమో గ్రేసీ"

"నో! నో! నేనేం తొందరపడటం లేదు. నీ మనసు నాకు తెలుసు. నేనంటే నీకు చాల యిష్టం ఉంది. నువ్వు పైకి చెప్పకపోయినా నీ మనసు నన్ను ప్రేమిస్తోంది. నీ సంగతంతా నాకు తెలిసిపోయింది. నువ్వేం కంగారుపడకు. రెండురోజుల క్రితం నీరూం సర్దుతుంటే నీవు వ్రాసుకున్న ప్రేమగీతాలు నీ ప్రేమ సుందరిఫొటో అన్నీ చూసాను. నీ మూగ ప్రేమని అర్థం చేసుకున్నాను. 'ఐ లవ్ యూ జాన్' అంటూ అతని నుదుటి మీద ముద్దెట్టుకుంది"

"ఐలవ్‌యూటూ గ్రేసీ' అంటూ ఆమె చేతుల్ని తన చేతిలోకి తీసుకుని నేను చాల అదృష్టవంతుణ్ణి. లేకపోతే నాలాంటి వాడికి నీలాంటి అప్సరస దొరకటం ఏమిటి? మమ్మీకి విషయం తెలిస్తే చాల సంతోషిస్తుంది. నా బాధ, తపన అంతా ఆమె కోసం, ఆమెని తొందరగా అక్కడ నుండి తీసుకురావాలి." అని అంటూ భవిష్యత్‌పై తనకున్న అభిప్రాయాల్నీ, ఆశయాల్నీ గ్రేసీకి వివరించి చెప్పాడు. ఇద్దరూ ఎన్నో కబుర్లు చెప్పుకుంటూ ప్రపంచాన్నే మరచిపోయారు కాసేపు.

## 67

కీర్తిక ఉద్యోగంలో చేరింది. ఉదయం ఎనిమిది గంటలకు వెళ్ళటం, మళ్ళీ సాయంత్రం అయిదింటికి యింటికి రావటం. జాక్ విషయం పూర్తిగా మర్చిపోయింది. రోజులు హేపీగా గడచిపోతున్నాయి.

ఒకరోజు ఆఫీసు నుండి వచ్చిన కీర్తిక కాఫీ త్రాగుతూ టీపాయ్ మీదున్న కవరు తీసి చూసింది. అంతలో పద్మ అక్కడికి వచ్చి 'అది తాతగారు వ్రాసారు. ఉత్తరంతోపాటు కొన్ని ఫొటోలు కూడ పంపారు. తీసిచూడు' అని కూతురుతో అంది.

"ఏం ఫొటోలు మమ్మీ?" అంది.

"తీసిచూడు. నీకే తెలుస్తుంది" అని సీరియస్‌గా చెప్పింది. కీర్తిక ముందుగా ఉత్తరం చదివింది. అందులో ప్రత్యేకంగా తనకే ఓ పేజీ రాసారు. తరువాత ఏవో నాలుగైదు ఫొటోలుండటంతో వాటిని ఒక్కొక్కటీ తీసి చూసింది.

"అయితే మమ్మీ! వీళ్ళందరికీ పేర్లు, చిరునామాలు ఏవీలేవా?" అంది కొంటెగా.

"ఆ! ఎందుకు లేవు. ఇదిగో ఈ అబ్బాయిపేరు మదన్‌మోహన్. ఎమ్.టెక్" అని కీర్తిక ప్రక్కన కూర్చుని చెబుతోంది పద్మ.

"ఊఁ! హో! అచ్చు మన్మథ లీలలో హీరోలా ఉన్నాడు"

"అడ్డదిడ్డంగా వాగక ముందు చెప్పింది విను" అంటూ రెండో ఫొటో తీసి "ఇతని పేరు ఆనంద్‌కుమార్. ఎమ్.బి.బి.యస్ హౌస్ సర్జన్ చేస్తున్నాడు"

"ఆఁ! ఆఁ! పాపం! డాక్టరై వుండి కూడా డైటింగ్ సంగతే మరచినట్లున్నాడు. ఫొటోలో నిండుగా త్రొక్కుడు లడ్డూలా... ఉన్నాడు."

"అయితే నే వెడుతున్నాను. ఇవిగో మిగతా ఫొటోలు - అడ్రసులు" అంటూ మిగిలినవి టీపాయ్ మీద పడేసి అక్కడ నుండి లేవబోయింది పద్మ.

"సారీ మమ్మీ! కూర్చో అంటూ చేయి పట్టి కూర్చోబెట్టింది. "ఊఁ! తరువాత" అంటూ బుద్ధిగా కూర్చుంది కీర్తిక.

"నాటీ గార్ల్" అంటూ "ఊఁ అయితే విను" అంటూ "ఇతని పేరు అరుణకుమార్. మెకానికల్ ఇంజనీర్" అంటూ ఫొటోలన్నీ వరుసగా పెట్టింది.

"అయిందా మమ్మీ లిస్టు"

"ఆఁ! ఆఁ! అయింది. ఇవన్నీ నువ్వు మరొకసారి చూసి నీకు నచ్చిందేదో చెబితే మిగతా విషయాలు డాడీ చూసుకుంటారు. ఏమిటి? వినపడిందా?" అని గట్టిగా అంది పద్మ.

"ఆఁ! అయితే మమ్మీ! ఓ పనిచేద్దాం"

"ఏమిటదీ" అంది ఆశ్యర్యంగా.

"ఇంతమందిని చూస్తుంటే ఎవర్ని పెళ్ళిచేసుకోవాలో తెలీటం లేదు. అందుకని లాటరీ వేసి మన దీపిక చేత తీయిస్తే బాగుంటుంది. ఏమంటావ్?" అంది కీర్తిక.

"నీ తెలివితేటలు అఘోరించినట్లే ఉన్నాయి. అదేమన్నా కథలపోటీ అనుకున్నావా? లాటరీ తీయడానికి?" అని కొంచెం చికాగ్గా అంది పద్మ.

"ఏమిటి? తల్లీ కూతుళ్ళు తెలివి తేటల్ని తూకం వేసుకుంటున్నారు?" అని అంటూ శ్రీకాంత్ అక్కడకు వచ్చాడు.

"ఆఁ! ఏముంది? మీ ముద్దుల కూతురికి లాటరీలో వరుడు కావాలిట" అని వ్యంగ్యంగా అంది.

"చూడండి డాడీ!మమ్మీ మరీను. ఇన్నింటిలో ఎవరు నచ్చారంటే ఎలా చెప్పేదీ? ఒకళ్ళు లావుగా, బొద్దుగాను, మరొకళ్ళు సన్నగా పొడుగ్గా దుబ్బు మీసాలతో తెలుగు సినిమా విలన్‌లాను, మరొకళ్ళు హిప్పీ క్రాపు, పెద్ద గుండ్రని కళ్ళద్దాలతోను ఉంటే ఎవరు ఎలాంటి వాళ్ళో ఎలా తెలుస్తుంది? మీరే చెప్పండీ?" అంటూ గారాలుపోయింది.

"అది కాదురా! నెమ్మదిగా మరొకసారి తీరుబడిగా చూడు ఒక్కటైనా నచ్చకపోతుందా. మిగతా విషయాలు నేను చూస్తానుగా" అని నచ్చచెప్పాడు.

"ఓకే డాడీ!" అంటూ "ఈ ఫొటో చూడండి! ఎలా ఉంది?" అని అడిగింది కీర్తిక.

"ఏదీ! ఇలా యివ్వు!" అంటూ తీసుకున్నాడు.

"ఇది కూడ డాడీ! ఈ రెండింటిలో ఏదైనా పర్వాలేదు. తుది నిర్ణయం మీదే" అంది.

కీర్తిక యిచ్చిన రెండు ఫొటోలని పరికించి చూసి "వెరీగుడ్ సెలక్షన్ నాకే వదిలేసావన్నమాట. నా పేరు నిలబెట్టావ్" అని అంటూ "చూడు అది నా కూతురు" అన్నట్టు గర్వంగా కళ్ళెగరేసాడు పద్మ వంక చూసాడు శ్రీకాంత్.

"ఊఁ! సరేలెండి! తండ్రీ కూతుళ్ళు ఒకటేగాని పదండి! భోజనం చేద్దురుగాని" అంటూ "దీపికా! ఎక్కడున్నావ్? అన్నం తిందుగానిరా" అంటూ చిన్న కూతుర్ని పిలుస్తూ కిచెన్‌లోకి వెళ్ళింది పద్మ.

"పదకీర్తి! మీ అమ్మకి ఆకలేసినా, కోపం వచ్చినా ఎవరు ఒక్కక్షణం ఎదురుగా నిలబడలేరు. పద" అంటూ తండ్రి కూతుళ్ళు డైనింగ్ హాలులోకి వెళ్ళారు.

*

"మమ్మీ!"

"ఊఁ!"

"ఏమిటి చదువుతున్నావ్?"

"Cesare pavese వ్రాసిన 'ఏమాంగ్ ది ఉమెన్' నవల చదువుచున్నాను.

"అతను ఫ్రెంచి కవి అనుకుంటాను"

"కరెక్ట్"

"ఎలా ఉంది నవల?"

"చాల బాగుంది. ఈ నవలకి అవార్డ్ కూడ వచ్చింది.

"అయితే చాల గొప్ప నవలై ఉండాలి"

"నవలకి అవార్డ్ వచ్చినంత మాత్రాన అందరికీ నచ్చాలని లేదు. చదివే వాడి అభిరుచిని బట్టి కూడ ఉంటుంది. అందరికీ నచ్చకపోవచ్చు. అర్థం చేసుకోవడం చాల కష్టంకూడా"

"అదీ నిజమే అనుకో! pavese గురించి ఎక్కడో చదివాను. భలే టిపికల్

కేరెక్టర్ అతనిది. ఎక్కువగా ప్రేమ కవిత్వం వ్రాసాడు. ఇతని జీవితాన్ని ఆధారంగా తీసుకుని సినిమా కూడా తీసారు. ఆఁ ... ఆ సినిమా పేరు ....... ఊఁ గుర్తొచ్చింది. అది మేన్ ఆఫ్ ది లవ్. కవికి, సినిమా హీరోకి చాల దగ్గర పోలికలున్నాయి'' అంటూ ఇంకా ఏదో చెప్పబోతుండగా మధ్యలో పద్మ 'అది సరే గానీ అసలు విషయమేమిటి? ఎప్పుడూలేనిది ఈ రోజు యింత తీరుబడిగా కబుర్లు చెబుతున్నావ్!'' అని కీర్తిక వంక చూసింది పద్మ.

"సారీ మమ్మీ! నిన్ను డిస్టర్బ్ చేసినట్లున్నాను''

"అది కాదు. నీకు ఏమన్నా కావాలేమో అని అడిగాను. అంతేకాని మరోలా కాదు''

"ఏం లేదు మమ్మీ! నిన్న డాడీని అడిగితే ఏదో వంక చెప్పి తప్పించుకున్నారు''

"ఏమిటిది?''

"మరేం లేదు. నువ్వు డాడీని ఎలా పెళ్ళిచేసుకున్నావ్?''

"ఎలా పెళ్ళి చేసుకోవటం ఏమిటీ? నీ తలకాయ'' అంటూ నవ్వేసింది.

"అదే మమ్మీ! ఇప్పటి వాళ్ళయితే ప్రేమించుకోవటాలు, ఫొటోలు... వగైరా! కదా! మరి అప్పట్లో కూడ ఈ ప్రేమలూ .... దోమలూ... ఉండేవా?'' అని ఇంట్రస్ట్‌గా మొహం పెట్టి అడిగింది.

"ఏమిటీ? రేపేమన్నా డిబేట్ పోటీ ఉందా?''

"నో! మమ్మీ! ఏదైనా ఒక విషయం గురించి అడిగి తెలుసుకోవటం మంచిదని అడిగాను. అందులోను మా 'యంగ్ బ్యూటిఫుల్ మమ్మీ' గురించి తెలుసుకోవటం అత్యవసరం గదా!''

"ఆఁ! ఆఁ! మాటలు నేర్చావ్! అయితే వినుటూకీగా చెప్తాను'' అంటూ చెప్పసాగింది.

"మాది ప్రేమ వివాహం కాకపోయినా విచిత్ర వివాహం అని చెప్పగల్ను. పెళ్ళి చూపుల్లో ఎంత మందినో చూస్తాం. కాని పెళ్ళి చూపులు ప్రేమకి నాంది పలకడం నిజంగా అదృష్టం కాదంటావా! అదే జరిగింది మా విషయంలో. మా నాన్న గారి వేలు విడిచిన మేనమామ ఉండే వాడు కాకినాడలో. ఒకరోజు హఠాత్తుగా మా యింటికి వచ్చి స్వీటు, హాటూ సేవించాక ఒక హాట్... హాట్ సంబంధం గురించి మా నాన్నగారి చెవిలో వేసిపోయాడు. రెండు రోజుల తర్వాత అమాంతంగా అబ్బాయినే తీసుకొని వచ్చేసాడు. బంధువుల యింటికని తీసుకొచ్చాడుట. సరే మా అమ్మ ఒకటే హడావుడి! గట్టిగా బిగించి అల్లిన జడ - నిజంగా అప్పలమ్మలా తయారు చేసింది నన్ను. మరి ఇంతోటి అప్పలమ్మ ఆ అమాయకపు చక్రవర్తికి నచ్చేసిందట. వెళ్తూ వెళ్తూ ఆ అబ్బాయి వాళ్ళ తల్లి దండ్రుల వద్ద తీసుకోవాల్సిన జాగ్రత్తలు అవీ చెప్పిపోయాడుట. ఇంకేముందీ ఒక మూడుసార్లు వాళ్ళ వాళ్ళు, వాళ్ళ వాళ్ళ వాళ్ళూ వచ్చి చూసారు నన్ను. పెళ్ళి నిర్ణయింపబడ్డ తర్వాత ఆర్నెల్లకిగానీ వివాహముహూర్తం కుదరలేదు. మరి మీ డాడీ అంత దూరం ఆగలేక నెలకొకసారి వైజాగ్‌నుండి కాకినాడ ప్రయాణం కట్టేవారు. ఎంత దగ్గరయ్యామో చెప్పలేను. నిజంగా ప్రేమించుకున్నాకే పెళ్ళి చేసుకున్నట్లయింది. ఆరునెలల్లో ఒకర్నొకరం ఎంతగానో అర్థం చేసుకున్నాం. అందుకే నిజానికి పెద్దలు కుదిర్చిందే అయినా- మాది ప్రేమపెళ్ళి అని గర్వంగా చెప్పుకుంటాం- అదీ సంగతి. అర్థం అయిందా అని గట్టిగా నవ్వేసింది పద్మ.

"అయితే పెళ్ళికి ముందుగానే డాడీని నీ చిలిపి కళ్ళతో కట్టేశావన్నమాట''

"ఏది ఏమైనా కీర్తీ! పెళ్ళికి ముందైనా, తర్వాత అయినా ఒకరినొకరు అర్థం చేసుకుని, ఒకరి అభిప్రాయాల్ని ఒకరు గౌరవించుకోవడం ముఖ్యం. అంతేగాని అందం, ధనం ముఖ్యం కాదు. మంచి మనసుతో ఒకరినొకరు ప్రేమించుకుంటూ జీవితాన్ని సుఖమయం చేసుకుంటూ కాలం గడపాలి. అప్పుడే మనం ఎటువంటి ఒడుదుడుకులు వచ్చినా హాయిగా ఎదుర్కొన గల్గుతాం! రేపు నీ భవిష్యత్‌లో కూడ నీ భర్తని మనస్ఫూర్తిగా ప్రేమిస్తూ, గౌరవిస్తూ ఎటువంటి సమస్యలైనా చిరునవ్వుతో ఎదుర్కొనగలవని, అందుకు తగిన వరుడు నీకు భర్తగా రావాలని నేను ప్రతిరోజు దేవుణ్ణి ప్రార్థిస్తున్నాను''

"థాంక్యూ మమ్మీ! మరి చాల విషయాలు చెప్పావ్. నిద్ర వస్తోంది. గుడ్‌నైట్'' అంటూ తన రూంలోకి వెళ్ళిపోయింది కీర్తిక.

## 68

మూడునెలలకి జాన్ పూర్తి ఆరోగ్యంతో కోలుకున్నాడు. ఉద్యోగంలో చేరాడు. బలానికి ఇంకా మందులువాడుతున్నాడు. మానసికంగా చాల ఆనందంగా ఉన్నాడు. జాన్ ఆనందంగా ఉల్లాసంగా తిరగటం చూసిన డయానా దంపతులు చాల సంతోషించారు.

ఒక శనివారం నాడు అన్నాచెల్లెలు, గ్రేసీ కలసి ఖీలా పాత యింటికి డయానాతో చెప్పి వెళ్ళారు. ఇల్లు వదలి చాల రోజులు అయినందువల్ల గదులన్నీ దుమ్ము, ధూళితో నిండుకొని ఉన్నాయి. ముగ్గురు కబుర్లు చెప్పుకుంటూ అన్ని

గదులు చకచకా శుభ్రం చేసేసారు. తరువాత రెండు మూడు వారాలు యింటిలోపల గదులకి క్రొత్త రంగులు వేసారు. కర్టెన్స్, బెడ్‌షీట్స్, టేబుల్ క్లాత్స్ అన్ని గదుల రంగులకు మేచింగ్ అయ్యేలాగ క్రొత్తవి కొని వేసారు. ఇప్పుడు ఆ యిల్లు నిత్యనూతన శోభతో కళకళలాడుతోంది. మధ్య మధ్యలో డయానా సలహాలిస్తూండేది. హెల్ప్ చేస్తూండేది. గ్రేసీ అయితే పోటీ పడి మరీ చేసేది పని.

"ఏంటీ మా అన్నయ్యని కాకాపడుతున్నావ్" అని వేళాకోళంగా అంది స్టేసీ.

"ఆ అవసరం నాకేమీ లేదులే"

"అదీ చూస్తాలే" అని ఫ్లవర్ వాజ్‌లో పువ్వులు సర్దుతూ అంది.

"అలా చూస్తూనే ఉండు" అంది కొంటెగా గ్రేసీ!

"అది సరేగాని పని తొందరగా ముగించండి. నాకు ఆకలేస్తోంది" అంటూ కిందకి వచ్చింది స్టేసీ.

"మా యింటి పనులలో నిన్ను కూడ కష్టపెడుతున్నాను. సారీ గ్రేసీ" అని మెల్లిగా అన్నాడు.

"అలా ఎందుకనుకుంటున్నావ్. ఇది నా యిల్లుగానే భావిస్తున్నాను. అయినా నువ్వేమన్నా పరాయివాడవా? మనింటికి మనం చేసుకోవటంలో తప్పేముంది? అందులోను నీతో కలిసి చేయటం నాకు ఎంతో సంతోషం. ఎప్పుడూ నీకు తోడునీడగా ఉండాలనే నా కోరిక" అని అంటూ అతనికి దగ్గరగా వచ్చి 'ఐ లవ్ యూ జాన్' అని ముద్దుపెట్టుకుంది.

"నేను చాల అదృష్టవంతుణ్ణి గ్రేసీ! నీవంటి దేవత భార్య కాబోతున్నందుకు. ఐ లవ్ యూ టూ" అంటూ ఆమెను మరింత దగ్గరకి తీసుకున్నాడు.

"ఐ యామ్ వెరీ హంగ్రీ! వెయింటింగ్ ఫర్ యూ బోత్" అంటూ క్రిందనుండి గట్టిగా అరిచింది స్టేసీ.

"వస్తున్నాం" అంటూ మేడమీద నుండి క్రిందకు వచ్చారు. అప్పటికే స్టేసీ అన్నీ టేబుల్ మీద సర్దేసింది.

"వ్వాట్ ఎ వండర్" అంటూ టేబుల్ మీద అట్టపెట్టెలో పెద్ద సైజులోనున్న 'పెప్రానీ పీజా' ని చూసి లొట్టలు వేస్తూ 'థాంక్యూ వెరీ మచ్ జాన్' అంటూ అతనికేసి ప్రేమగా చూసింది గ్రేసీ!

"సారీ మిస్! దీన్ని ఏర్పాటు చేసింది మనం. తెలిసిందా! ఇది మా అన్నయ్యకు చాల యిష్టం" అని గర్వంగా అంది.

"డోంట్ వర్రీ మేడమ్! మా యిద్దరి టేస్టులూ ఒకటేలే" అని గబుక్కున నాలిక్కరుచుకుంది గ్రేసీ!

"ఒక్కసారి ఆశ్చర్యాన్ని నటిస్తూ, నువ్వు అంత పనీ చేస్తావని నేను ముందే అనుకున్నాను. మొత్తానికి తెలివిగానే అమాయకుడైన మా అన్నయ్యని ఫిష్‌లా వలలో వేసేసుకున్నావ్" అంటూ గ్రేసి గెడ్డం పట్టుకుని అటు యిటు త్రిప్పింది.

"అంతా నీ ఆశీర్వచనమే స్టేసీ! మా యింటికొచ్చిన కొత్తల్లో ముందుగా దగ్గరైంది నువ్వు. నిజంగా మీ అన్నా చెల్లెళ్ళు యిద్దరూ మాయింట్లో తిరుగుతుంటే నాకు ఎంతో ఆనందంగా ఉండేది. నా ఒంటరితనాన్ని మర్చిపోయి ఆనందంగా ఉండేదాన్ని. ఏది ఏమైనా జాన్ అంటే...!"

"ఆఁ! ఆఁ! జాన్ అంటే నాకిష్టం. మీ మమ్మీ వచ్చిన తరువాత మేమిద్దరం వివాహం చేసుకుంటాం అని అంటావ్! అంతేనా?"

"అంతేకాదు. మనం ఎప్పుడు విడిపోకుండా ఇలాగే నవ్వుతూ కలసి కాలం గడిపేయాలి" అంది హేపీగా.

"తథాస్తు" అంటూ అందరూ కలసి పిజా పని పట్టారు.

*

"మీకోసం ఎవరో వచ్చారు. వెయిటింగ్ రూంలో ఉన్నారు. మిమ్మల్ని సూపరింటెండెంట్ గారు పిలుస్తున్నారు" అని షీలాతో చెప్పి వెళ్ళిపోయింది ఒకామె.

"మళ్ళీ ఏం అవాంతరం వచ్చిందో" అనుకుంటూ ఆఫీసు రూంలోకి వెళ్ళింది షీలా!

సూపరింటెండెంట్‌తో మాట్లాడుతున్న జాన్, స్టేసీలను చూసి ఆశ్చర్యపోయింది షీలా.

తల్లిని చూడగానే 'ఆయ్ మామ్!' అంటూ కౌగిలించుకుంది స్టేసీ.

జాన్ మాట్లడటం అయిన తరువాత 'ఆయ్ హనీ! ఎలా ఉన్నావ్?" అంది షీలా.

"ఫైన్ మమ్మీ' అంటూ అతని కళ్ళు మెరిసాయి.

ఇద్దర్నీ ఒక్క క్షణం గుండెలకి చేర్చుకుంది.

ఆ మాతృహృదయం సంతోషంతో పొంగిపోయింది. కొంత సేపైన తర్వాత అనురాగ తరంగాలలోంచి తెప్పరిల్లి బయట ప్రపంచంలోకి వచ్చింది.

సూపరింటెండెంట్ ఆమెని కూర్చోమని కొన్ని ఫారమ్స్ యిచ్చి వాటి మీద సంతకాలు పెట్టమన్నాడు. ఆమె ఆశ్యర్యంగా వాటి వంక చూసింది.

"మీరేమీ కంగారు పడక్కరలేదు. మీ పిల్లలు మిమ్మల్ని తీసుకువెళ్లడానికి వచ్చారు. వాళ్ళని కన్న మీరు చాల అదృష్టవంతులు. తొందరలో మీకు జాబ్ వచ్చే ఏర్పాటు చేస్తాం. మీ జీవితం సంతోషంగా హాయిగా సాగాలని ఆశిస్తున్నాను" అంటూ ఖీలాని రిలీజ్ చేసాడు.

ఆమె కాగితాల మీద సంతకం చేసి కృతజ్ఞతాభావంగా అతని వంక చూస్తూ 'మీరు చేసిన సహాయానికి నేను ఎంతగానో ఋణపడిఉన్నాను" అని అతని వద్ద శెలవు తీసుకుని పిల్లలతో కలసి యింటికి బయలుదేరింది.

*

ఇంటి ముందు కారు ఆపాడు జాన్. కారు తలుపు తెరచి పట్టుకున్నాడు. స్టేసీ, ఖీలా కారుదిగారు. జాన్ తాళం తీసి తలుపు తీసాడు. ముగ్గురూ కలసి లోపలకు వచ్చారు. చాల రోజుల తరువాత ఆ యింటిలోకి అడుగుపెట్టిన ఖీలాకి అంతా ఆశ్యర్యంగాను, ఆనందంగాను ఉంది. ఇల్లంతా దీపకాంతులతో, చల్లని సువాసనలతో ప్రశాంతంగా మెరుస్తోంది.

ఇంతలో ఆకస్మాత్తుగా 'సర్‌ప్రైజ్' అంటూ ఒకేసారి కొన్ని గొంతులు ఏకకంఠంగా పల్కాయి.

సంభ్రమాశ్చర్యాలతో ఖీలా ఒక్కసారి నాలుగు వైపులా చూసింది. డయానా ఫామిలీ, తరువాత ఫామిలీ ఫ్రెండ్స్ అందరూ బయటకు వచ్చారు. వాళ్ళందరూ ఖీలాకి అభివందనలు తెలుపుతూ, అభిమానంతో తెచ్చిన కానుకలను ఆమెకి అందించారు. వాళ్ళందర్నీ చూసిన ఖీలాకి నోట మాట రాలేదు. కళ్ళల్లో ఆనందబాష్పాలు నిండుకున్నాయి.

స్టేసీ, గ్రేసీలు ఫ్రెండ్స్ తెచ్చిన వంటకాల డిష్‌లను టేబుల్‌మీద చక్కగా చకచకా సర్దేసారు. వచ్చిన వాళ్ళందరికీ డ్రింక్స్ అందించాడు జాన్. తన జీవిత ధ్యేయం నెరవేరింది. తల్లి కళ్ళల్లోని ఆనందాన్ని జాన్ చూసి సంతోషించాడు. అందరూ ఆనంద సముద్రంలో తేలియాడుతున్నారు. జాన్ పియోనా మీద ఓ చక్కని పాటను తీయగా తన మధురకంఠంతో పాడాడు. అతను పాట పాడుతున్నంతసేపు గ్రేసీ మంత్రముగ్ధలా అతని వంక రెప్ప వాల్చకుండా చూస్తూ నిలబడింది. పాట అనంతరం 'జెస్ట్ ఎ మినిట్! మీ అందరకి ఈ శుభ సందర్భంలో ఒక శుభవార్త" అంటూ తన గొంతు ఓసారి సవరించుకుని నిలబడ్డాడు జాన్.

అందరూ ఒక్కసారి నిశ్శబ్దం అయిపోయారు. అందరి ముఖాలలోను 'ఏమిటావార్త' అనే క్వశ్చెన్ మార్కు ఏర్పడింది.

"డియర్ ఫ్రెండ్స్! వచ్చే నెల ఇరవై అయిదవ తేదీన చర్చిలో జాన్‌కి, గ్రేసీతో వివాహం నిశ్చయమైంది. ఆ సందర్భంగా మీరందరూ అక్కడకు రావలసినదిగా కోరుతున్నాను" అని చెప్పటం ముగించాడు.

అందరూ గ్రేసీ వంక ఆశ్చర్యంగా చూసారు. సిగ్గుతో ఆమె బుగ్గలు దానిమ్మ మొగ్గలయ్యాయి. ఈ విషయం విన్న ఖీలా నెమ్మదిగా సోఫాలో కూర్చుంది. ఆమె గొంతులో ఏదో తెలియని అలజడి.

"ఏమైంది ఖీలా? ఆర్ యూ ఓకే" అంటూ ఆమె పరిస్థితిని చూసి కంగారుపడింది డయానా.

"డయానా! నిన్ను ఎలా అభినందించాలో తెలీక నోట మాట రావటంలేదు. ఇంత సంతోషాన్ని నేను భరించలేకుండా ఉన్నాను. నిజానికి నేను నీకు ఏమవుతాను. నీ ఋణం ఎలా తీర్చుకోవాలో అర్థం అవటంలేదు. రోజు రోజుకీ పెరిగిపోతోందేగాని తరగటం లేదు. నేనంటే నీకు ఎందుకింత జాలి" అని కళ్ళు వత్తుకుంది.

"ఛ! ఛ! ఇలాంటి సమయంలో అవేం మాటలు. జాలి ఏమిటి? నువ్వంటే నాకు ఎందుకో తెలీని అభిమానం. అది ఎందుకు? ఏమిటి? అంటే నేనేం చెప్పలేను. ఐ లైక్ యూ! అంతే! అయినా మంచి మనసున్న ముత్యం లాంటి జాన్‌ని నా కూతురికిచ్చావ్. అంతకంటే ఏం కావాలి నాకు. ఆ విధంగా తీరిందనుకో నీ ఋణం" అంటూ నవ్వేసింది.

"గ్రేసీ చిన్న దానివైనా పెద్ద మనసుతో మమ్మల్ని అర్థం చేసుకున్నావ్. కార్లో వస్తుంటూ నీ గురించి అంతా చెప్పాడు జాన్. భవిష్యత్‌లో మీరిరువురూ ఒకరినొకరు అర్థం చేసుకుంటూ హేపీగా జీవితం గడపాలి. అంతకంటే నే కోరుకునేది యింకేమీ లేదు." అంటూ గ్రేసీని దగ్గరగా తీసుకుని కౌగిలించుకుంది.

అందరూ ఒక్కసారి చప్పట్లు కొట్టారు.

"అయితే హనీమూన్ ట్రిప్ ఫ్రాన్సా? న్యూయార్కా?" అంటూ గ్రేసీ చెవిలో గొణిగింది స్టేసీ.

"యూ నాటీ!" అంటూ ఆ సంగతి తరువాత ఆలోచిద్దాం" అంటూ మాట మార్చింది గ్రేసీ.

స్నేహం, బంధుత్వంగా మారినందుకు అందరూ ఖీలా, డయానాలను అభినందించారు. తరువాత పార్టీ బ్రహ్మాండంగా జరిగింది. కొంతమంది జంటలు జంటలుగా విడిపోయి డాన్స్ చేస్తున్నారు. కొందరు కబుర్లు చెప్పుకుంటున్నారు.

జాన్ టేబుల్ వద్ద మౌనంగా నిలబడి ఏదో ఆలోచిస్తున్నాడు. వెనక నుంచి "జాన్! కమాన్! డాన్స్ చేద్దాం" అంటూ అతని చేయి పట్టుకుని తీసుకువెళ్ళింది గ్రేసీ! జాన్ మంత్రముగ్ధలా ఆమె వెంట వెళ్ళాడు.

వాళ్ళిద్దరూ ఒకరి చేతిలో ఒకరు చేతులు కలుపుకొని నెమ్మదిగా కదుల్తూ డాన్స్ చేస్తున్నారు.

ఆమె కళ్ళల్లో ప్రేమ, అభిమానం!

అతని చూపుల్లో ఆరాధనా, అనురాగం.

ఆమె అతని కన్నుల్లోకి చూస్తూ 'జాన్! నీ జీవిత లక్ష్యం నెరవేరిందా?''

"ఊఁ ఊఁ ఇంకా ఒక్కటి మిగిలిపోయింది''

"ఏమిటది'' అతని భుజం మీద తల ఆన్చి అడిగింది.

"మన యిద్దరి వివాహం జరగాలి. అప్పుడు అందరం కలసి ఉండాలి. దానికి ఎల్లవేళలా నీ చేయూత, ప్రేమానురాగాలు కావాలి.''

"ఆ విషయంలో నీకు ఎటువంటి అనుమానం అక్కరలేదు. కావాలంటే కాగితం మీద వ్రాసియిస్తాను. ప్రామిస్'' అంటూ అతని చేతిలో చేయి వేసింది.

"థాంక్యూ గ్రేసీ! థాంక్యూ!'' అంటూ ఆమె గులాబీ పెదవుల్ని తన పెదవులతో బంధించాడు.

వాళ్ళిద్దర్నీ రెప్పవేయకుండా చూస్తూన్న డయానా "మన పిల్లలు మంచులో మంచి ముత్యాలు. కష్టాల మంచు పొరలు కరగిపోయి మంచి మనసులతో ఎలా మెరుస్తున్నారో చూడు'' అని ఖీలాతో అంది.

"మీ....టూ''

వారి మనసులలో ఆనందం, సంతృప్తి పున్నమి వెన్నెలలా నిండుకున్నాయి.

భవిష్యత్‌లో తమ మధుర జీవిత స్వప్నాల గురించి ఆలోచిస్తూ, ఒకరి కళ్ళలోకి ఒకళ్ళు చూసుకుంటూ మత్తుగా నవ్వుకుంటూ మైమరచి డాన్స్ చేస్తున్నారు జాన్, గ్రేసీలు.

వాళ్ళ కలలు నిజం అవుతాయని శుభ సూచకంగా చర్చిలో గంటలు మ్రోగాయి.

## 69

రాత్రి భోజనాలు చేస్తున్న సమయంలో కాలింగ్ బెల్ మ్రోగటంతో 'ఈ సమయంలో ఎవరొచ్చారబ్బా! ఫోన్ కూడ చేయకుండా' అని అనుకుంటూ తలుపు తీసింది నీరజ.

ఆకుపచ్చరంగు పట్టుచీరలో వనకన్యలా మిలమిలా మెరిసిపోతున్న కీర్తికని చూసి ఆశ్చర్యంతో 'రా! రా! ఏమిటి సర్‌ప్రైజ్' అంటూ లోపలకి ప్రేమగా ఆహ్వానించింది.

"థాంక్స్ ఆంటీ'' అంటూ లోపలకి వచ్చింది.

తలుపు వేసి లోపలకు వస్తూ 'రా! భోజనాలు చేస్తున్నాం. అక్కడ కూర్చుందాం' అంటూ డైనింగ్ హాలులోకి నడచింది నీరజ.

"ఎవరొచ్చారు?'' అని అన్నం తింటున్న రాజశేఖరం అడిగాడు.

"వెన్నెలలో వనకన్య'' అంది సీరియస్‌గా

"ఏమిటీమధ్య కవిత్వం కూడా మాట్లాడుతున్నావ్'' అంటూ ఆమె వెనకే వయ్యారంగా నడచి వస్తున్న కీర్తికని చూసి 'ఓహ్! బ్యూటిఫుల్ యంగ్ ఇండియన్ లేడీ! కమాన్... కమాన్...'' అంటూ కుర్చీ చూపించాడు.

"నిన్ను చూస్తుంటే మీ ఆంటీకి కవిత్వం కూడ వచ్చేస్తోంది'' అంటూ నవ్వాడు.

సమాధానంగా చిరునవ్వు నవ్వుతూ కుర్చీలో కూర్చుంది కీర్తిక.

"మంచి టైములో వచ్చావ్. ఇప్పుడే మీ ఆంకుల్‌తో నీ గురించి అంటున్నాను''

"దేని గురించి ఆంటీ''

"కీర్తికకి గోంగూర పచ్చడంటే చాల యిష్టం. రేపు కొంచెం తీసుకువెళ్ళి యివ్వండీ అని'' అంటూ ఓ ప్లేటులో వేడి వేడి అన్నం, మామిడికాయ పప్పు, వెల్లుల్లి పాయలు వేసిన గోంగూర పచ్చడి, కూరవేసి కీర్తిక ముందు పెట్టి,

"తీసుకో కీర్తీ'' అంది నీరజ.

పళ్ళెం వంక చూస్తూ, "అన్నీ నాకిష్టమైనవే... ఊ! పచ్చడిలో నంచుకుందుకి చిన్న నీరుల్లి పాయలు కూడ ఉన్నాయే! అయితే ఓ పట్టు పడతాను'' అంటూ పప్పులో నెయ్యి వేసుకుంటూ అమాయకంగా అంది. అమాయకంగా, చిలిపిగా, నెమ్మదిగా ఉండే కీర్తిక అంటే అందరికీ యిష్టమే.

"ఆఁ! ఇందులో మజ్జిగ మిరపకాలు, అప్పడం ఉన్నాయి, వేసుకో!'' అంటూ స్టీలు బాక్స్ కీర్తికకి దగ్గరగా జరిపాడు రాజశేఖరం.

"థాంక్స్ అంకుల్''

"ఏమిటి విశేషం? చీకటి పడ్డాక బయలుదేరావ్.మమ్మీ, డాడీ యింట్లోలేరా?'' అంటూ అడిగింది నీరజ.

"మమ్మీకి ఈరోజు నైట్ డ్యూటీ! డాడీ ఆఫీసు వర్క్ చూసుకుంటున్నారు.

మిమ్మల్ని చూసి చాల రోజులయిందిగదా అని డాడీతో చెప్పి వచ్చాను. అదీగాకుండా నాకు మేరేజ్ నిశ్చయం అయింది'' అని గొణుగుతున్నట్లు చెప్పింది.

"అంత మంచి శుభవార్త అలా నములుతూ చెబుతావేంటీ? మరింకేం! వెరీ మెనీ కం(గ్రాచ్యులేషన్స్'' అంటూ అభినందించారు ఆ దంపతులు.

"ఆఁ! అదీ సంగతి. ఇదంతా పెళ్ళి కూతురు ముస్తాబన్నమాట. అందుకా ఆ సిగ్గులు...! ఆఁ! అమ్మ దొంగా!'' అంటూ శిల్ప, బుగ్గమీద చిటికవేసింది.

"చాల సంతోషం కీర్తి! అయితే మావాడు కూతురి పెళ్ళి హడావుడిలో ఉన్నాడన్న మాట. అబ్బాయి ఏంచేస్తున్నాడు'' అడిగాడు రాజశేఖరం.

"ఏం చేస్తాడు...! పెళ్ళి నిశ్చయమైంది గదా! ఈ విదేశీయ దేవతగారి గురించి కలలుకంటూ, లొట్టలేస్తూంటాడు. అంతేనా కీర్తీ డియర్'' అని చిలిపిగా అంది శిల్ప.

"ఆ! ఆఁ!... ఆ టైం నీకూ వస్తుంది. అప్పుడు నేను కూడా ఇలాగే... అంటూ నవ్వేసింది కీర్తి.

"అతను బెంగుళూరులో మెకానికల్ ఇంజనీరుగా పనిచేస్తున్నాడు. పేరు అరుణ్‌కుమార్. వచ్చే నెలలో ముహూర్తం పెట్టారు.'' అంటూ గోంగూర అన్నంలో ఉల్లి పాయ నంచుకుంటూ చెప్పింది.

"వెరీగుడ్! ఇంతమంచి వార్త చెప్పినందుకు గోంగూరా అన్నమేనా... లేక ఏదైనా స్పెషల్ ఉందా భామామణీ!'' అంటూ భార్యతో అన్నాడు.

"మీకేం పనిలేదు! ఎప్పుడూ తిండి ధ్యాసే'' అంటూ చిలిపిగా విసుక్కుంది.

ఉల్లిపాయ ముక్కగొంతుకలో అడ్డం పడటంతో కీర్తికకి పొలమారి ముఖం అంతా ఎ(రగా అయింది.

"అరెరే! అప్పుడే బావగారు తలుచుకుంటున్నట్లున్నారు. ఇవిగో మంచినీళ్ళు'' అంటూ నీళ్ళగ్లాసు అందించింది శిల్ప''

"ఆఁ! ఆ! మాటలు నేర్చావ్''

సరదాగా కబుర్లు నంచుకుంటూ భోజనం ముగించారు. తరువాత నీరజ అందరికీ మైసూర్‌పాక్ ముక్కలు యిచ్చింది. తింటూ (డ్రాయింగ్ రూంలో కూర్చున్నారు.

"ఆఁ! మర్చిపోయాను అసలు సంగతి' అంటూ తన హేండ్‌బేగ్‌లోంచి శుభలేఖ, వరుడిఫొటో తీసి నీరజకి యిచ్చింది.

"అప్పుడే శుభలేఖలు కూడా వేయించేసారన్నమాట. ఊఁ అబ్బాయి చాల అందంగా ఉన్నాడు. మంచి సెలక్షనే'' అంది నీరజ.

"పెళ్ళయ్యాక మమ్మల్ని మర్చిపోక కొంచెం గుర్తుపెట్టుకో తల్లీ'' అంటూ అబ్బాయి ఫొటోని తల్లి చేతిలోంచి తీసుకుంది.

"మధ్యలో నువ్వెందుకు పానకంలో పుడకలా?'' అని వెక్కిరింపుగా అంది కీర్తిక.

"ఈ విషయాలు ముందుగా నా నోటితో మీకు చెప్పాలని వచ్చాను. మమ్మీ, డాడీ వీలుచూసుకుని వస్తామని చెప్పమన్నారు. మరి వచ్చి చాలసేపయింది. ఇంక వెడతాను ఆంటీ! మళ్ళీ (ప్రొద్దున్నే పరుగులు తీయాలి గదా!'' అంటూ లేచింది.

"ఒక్కక్షణం కీర్తీ' అంటూ మేడమీదకి వెళ్ళి ఓ అయిదు నిమిషాల తర్వాత (క్రిందకు వచ్చి కీర్తికకి బొట్టుపెట్టి కుడిచేతికి ఓ జత బంగారు గాజులు తన చేతులతో తొడిగి, (క్రొత్త పట్టుచీర, తాంబూలం చేతికి అందించింది నీరజ.

"ఇవన్నీ ఏమిటి ఆంటీ? అందులోను ఖరీదైన బంగారపు గాజులు'' అంటూ కంగారుగా ఆమె వంక చూసింది.

"నువ్వేం కంగారుపడకు. నా మనసుకి యివ్వాలనిపించింది. అసలు ఈ గాజులు మనోహర్ భార్యకు యిద్దామని చేయించాను. కాని ఆమె మన సం(ప్రదాయ, ఆచారాలకి దూరంగా ఉంది. అమెరికన్ లేడీ గదా! అందువల్ల వీటి అవసరం ఆమెకు లేకపోయింది. అయినా నువ్వు నా కూతురిలాంటి దానివి. నీ పెళ్ళికి ఎలాగూ ఇండియా రాలేము గదా! అందుకని 'పెళ్ళికానుక' '' అంటూ కీర్తికని దగ్గరగా తీసుకుంది.

"అవును కీర్తీ! మీ ఆంటీకి ఇండియన్ కోడలొస్తే బాగుంటుందని కలలు గంది. కాని ఆమె కోరిక తీరలేదు. గుర్తొచ్చినప్పుడు పిచ్చిగా ఆలోచిస్తూంటూంది. మన సం(ప్రదాయ, ఆచార వ్యవహారాలు మనవరకే పరిమితంగదా! అవి మరొకరికి బాధ కల్గించవచ్చు. అయినా ఆ విషయాలు ఇప్పుడు తలచుకుని, బాధపడి (ప్రయోజనం లేదు'' అంటూ "పద నిన్ను కారులో యింటివద్ద దింపివస్తాను' అంటూ బట్టలు మార్చుకుందుకు లోపలకి వెళ్ళాడు రాజశేఖరం.

నీరజ బాధను అర్థం చేసుకున్న కీర్తిక ఆమె పాదాలకు వంగి నమస్కరించింది.

"అరే! అదేమిటి? లే!లే!'' అంటూ కీర్తికని పైకి లేకదీసి సంతోషంగా వెళ్ళి జంటగా కలసిరా'' అంటూ ఆశీర్వదించింది నీరజ.

"మా అమ్మకి ఓ మాంచి ఇండియన్ అల్లుణ్ణి వెదికి పట్టుకురా అంటూ

నవ్వేసింది శిల్ప.

"ఓ! ష్యూర్! అబ్బాయిల జాబితా నా వద్దే ఉంది" అంటూ శిల్ప నెత్తిమీద ఓ మొట్టికాయేసింది.

"మరి వస్తానాంటీ! మళ్ళీ తిరిగివచ్చాక కలుద్దాం" అంటూ సెలవు తీసుకుని టాటా చెప్పి కారెక్కింది కీర్తిక. ఆమె వెళ్ళిన వైపే చూస్తూ మనస్ఫూర్తిగా ఆశీర్వదించింది నీరజ. ఆమె కన్నీటి తెరల వెనుక కారు కదలిపోయింది.

## 70

పింకీకి గాయం కొంచెం తగ్గుముఖం పట్టింది. ఇంకా ఆస్పత్రిలో ఒక వారం ఉంచాలన్నారు. జెర్సీ రోజూ చూసివస్తోంది. రాత్రిళ్ళు స్టీవ్ కొడుకు వద్ద ఉంటున్నాడు. తల్లి రోజూ వస్తూ వెడుతూ ఉండటంతో వాడికి మనసులో ఆశలు కొత్త చిగుళ్ళువేస్తున్నాయి. ఆ మనోబలంతోనే వాడు తొందరగా కోలుకో గల్గుతున్నాడు.

స్టీవ్ జెర్సీలు సన్నిహితంగానే మాట్లాడుకుంటున్నారు. ఒకరోజు అనుకోకుండా లంచ్‌టైంలో రెస్టారెంట్‌లో కలిసారు. ఇద్దరూ ఒకే టేబుల్ వద్దకూర్చున్నారు. లంచ్ తింటూ కబుర్లు చెప్పుకుంటున్నారు.

రెప్పవాల్చకుండా స్టీవ్‌నే చూస్తోంది జెర్సీ.

"ఏయ్! ఏమిటా చూపు?"

"అద్దంలో మొహం చూసుకొని ఎన్నాళ్ళయింది?"

"ఏం? ఎందుకు?" అంటూ ఓసారి మొహాన్ని తడిమి చూసుకున్నాడు.

"ఎంతలా చిక్కిపోయావో!"

"ఎవరకీ!" అని కొంటెగా అన్నాడు.

"మాటలతో తప్పించుకోవటం నీకే వచ్చు"

"రియల్లీ"

"స్టీవ్ నన్ను యిప్పటికైనా క్షమిస్తావా? నిన్ను ఎంతలా బాధ పెట్టానో!"

"అవేం మాటలు. ఎప్పుడో ఎవర్నో విడదీసి ఉంటాను. దాని ఫలితాన్ని అనుభవించాను. అంతే!"

"నీ అంత గుండె నిబ్బరం నాకు లేదు బాబూ!"

"ఆఁ! ఆఁ! అందుకే యిన్నాళ్ళు నాకు దూరంగా ఉండగలిగావ్!"

"మొండిగా, పట్టుదలగా నీకూ, పింకీకి దూరంగా ఉన్నా, నా మనసు ఎంత చిత్రవధ అనుభవించిందో ఎలా చెప్పను మాటలతో. పింకీని స్కూల్లో అడిగేదాన్ని. వాడు అన్నిటికీ మౌనంగా ఉండేవాడు. ఆ చిన్నారి మనసుని ఎంతలా గాయపరిచానో! ఏదో తెలియని దెయ్యం నన్ను ఆవరించింది. తన మనసులోని బాధనంతా చెప్పింది."

"ఇప్పుడు ఆ దెయ్యం వెళ్ళిపోయిందా! పూర్ హనీ! నిన్ను నీవు బాధ పెట్టుకుంటూ మమ్మల్ని దూరం చేసుకున్నావ్. సీల్లీ ఉమెన్" అంటూ ఆమె చేతిమీద ముద్దెట్టుకున్నాడు.

చాలసేపు మాట్లాడుకుని రిలీఫ్ ఫీలయ్యారిద్దరూ.

*

పింకీని ఆస్పత్రినుండి యింటికి తీసుకువచ్చారు. ఇల్లంతా శుభ్రంగా, నీట్‌గా అందంగా సర్దిఉండటం చూసి 'దీనికి కారణం ఎవరా?" అని ఒకరి మొహాలు ఒకరు చూసుకున్నారు.

ఫ్లవర్ వాజ్‌లో ఉన్న పసుపు పచ్చ గులాబీ గుత్తులను చూసి పింకీ హాయిగా నవ్వుకున్నాడు.

"మమ్మీ" అంటూ తల్లిని పిలిచాడు.

"ఏం హనీ!" వాడి ప్రక్కకూర్చుంది.

"మమ్మల్ని వదలి మళ్ళీ వెళ్ళిపోవుగదూ!" అంటూ అనుమానంగా అడిగాడు.

"నో! హనీ! మళ్ళీ అటువంటి పొరపాటు చేయను. ఇప్పటికే మనమందరం చాల బాధపడ్డాము" పింకీ తల నిమురుతూ అంది.

"థాంక్యూ మమ్మీ!"

"ఐ లవ్ యూ పింకీ' అంటూ వాణ్ణి గుండెలకి హత్తుకుంది. ఆమె మాటలు విన్న పింకీ కళ్ళల్లో కోటినక్షత్రపు కాంతులు నిండుకున్నాయి. గుడ్ నైట్ పింకీ! హేవ్ స్వీట్ డ్రీమ్స్" అంటూ వాడి నుదుటి మీద ముద్దిచ్చి, బెడ్‌షీట్ కప్పి బయటకు వచ్చింది.

"స్వీట్ మమ్మీ' అని మనసులో అనుకుంటూ నిద్రపోడానికి కళ్ళు మూసుకున్నాడు హాయిగా.

*

పింకీని నిద్రపుచ్చి వస్తున్న స్టీవ్‌కి కళ్ళ ఎదుట జెర్సీ అప్సరసలా కన్పించింది.



చెళ్ళపిళ్ల వెంకట రమణ

నవల

# మంచు ముత్యాలు

(కెనడాలో గడిపిన జీవితం నుంచి)

ప్రచురణ :

రమణ సుమనశ్రీ ఫౌండేషన్, హైదరాబాద్.

Rs.150/-
$ 10/-

చెళ్ళపిళ్ల వెంకట రమణ

నవల



# మంచు ముత్యాలు

(కెనడాలో గడిపిన జీవితం నుంచి)

ప్రచురణ :

రమణ సుమనశ్రీ ఫౌండేషన్, హైదరాబాద్.